# ముఖం చాటు చేసిన మృత్యువు

— ఎ. మురళీకృష్ణ

ఓ కథా వృక్షం కూలిపోయింది
తుపానులా వచ్చిన మృత్యువు
శాస్త్రిగారంటే ఇష్టపడి ఇక
మనకు లేకుండా చేసింది
చావు అంత కఠినమైందని
ఆ కథకుడికి తెలియకనా ?

మృత్యువు పలకరించినపుడు
శాస్త్రిగారు ఏమన్నారో
తెలీదు కానీ
దానిపైనే ఓ జోకు వేసి
నవ్వుతూ వెళ్ళిపోయుంటారు
మనకు విషాదాన్ని మిగిల్చి

శాస్త్రిగారి లాంటి
కథా వృక్షం
మళ్ళీ మన పెరట్లో మొలవాలి
అల్పజీవుల ప్రతినిధి
మన వీధిలో నడవాలి
ఎవరిస్తారు ఆటోవాడికి
అడిగినంత డబ్బు—
జేబు ఖాళీ చేసుకుని
ఫీజు లేకుండా వకీలు పని చేసి
పీడితులకు అండగా నిలిచే
పెద్ద మనిషి !
కథా కథన శిల్పి !
వచనానికి రారాజు
పీడిత జన జీవన శైలికి
రాచకొండ !
బడుగు బతుకుల విశ్వనాథుడు
ఏడీ, మన శాస్త్రి ?
మరీ తేజా మన రా.వి. ?




సంపుటి : 17 సంచిక
146 డిసెంబరు 1993

ప్రజాసాహితి కార్యాలయం .
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.

రచనలు పంపవలసిన చిరునామా :
నిర్మలానంద,
వర్కింగ్ ఎడిటర్, ప్రజాసాహితి
7-1-23, చర్చి స్ట్రీట్
చినవాల్తేరు,
విశాఖపట్నం - 530 023.

ఏజంట్లు, చందాదరులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు .
కొత్తపల్లి రవిబాబు,
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.
గుంటూరుజిల్లా




ముఖచిత్రం :
రావిశాస్త్రి
('ఆంధ్రజ్యోతి' సౌజన్యంతో)

రెండవ కవరు పేజీ ,
ముఖం చాటు చేసిన మృత్యువు
(కవిత) — ఎ. మురళీకృష్ణ

మూడవ కవరు పేజీ :
దండాలండి బాపు- శాస్త్రి బావుకు
దండాలు (శబ్దచిత్రం)
— ఛాయరాజ్

నాల్గవ కవరు పేజీ :
రావిశాస్త్రి
— త్రిపురనేని శ్రీనివాస్

ఈ సంచిక వెల . రు. 8-00

వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100
(సం॥లో ప్రచురించిన పుస్తకాలతో)

# ఈ సంచికలో...

సంపాదకీయం (3). మహత్తర అక్టోబర్ విప్లవ స్ఫూర్తితో ముందుకు సాగుదాం(7). పొంక తిరుగుడు దంకెలోడ (17); మానవ హక్కుల కమీషన్ (19). సిశ్శబ్ద నిషేధం (3८). గోచికన్న దరిద్రమ్మేడిది? (37); అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి దశాబ్ది ఉత్సవాల మహాసభకు- జన సాహితి సందేశం (39). అరుణోదయ సందేశం (41). దేశభక్త రైతాంగ వాలంటీరా! (47); మేలు కొలుపు (48); మతోన్మాదులను తరిమి కొడదాం (56). రచయితలూ, పాత్రికేయులపై మతతత్వ వాదుల వీరంగం (57). లక్నో తీర్మానాలు(65). స్త్రీ వాద ప్రశ్నల్ని, పరిశీలనల్ని నిరాకరించటం సరికాదు (85); ఉత్తరాలు (90). చైతన్యవాహిని (102).

**రావిశాస్త్రి సంచిక :**

వ్యాసాలు :


| | | |
|---|---|---|
| "సామాజిక స్పృహగాళ్ళు"ట! | — రావిశాస్త్రి | 13 |
| "సొమ్ములు పోనాయండి"లో పాలనా యంత్రాంగం | — వల్లంపాటి వెంకటసుబ్బయ్య | 22 |
| 'బల్లచెక్క'లో లోతు | — గోపరాజు నారాయణరావు | 29 |
| మూడు నవలలు | — జె.పి.యల్. గ్విన్ | 45 |
| రావిశాస్త్రి రచనలూ- జీవితం నుండి | — పి. చంద్రశేఖర్ అజాద్ | 52 |
| రావిశాస్త్రి కథలలో స్త్రీ పాత్రల చిత్రణ | — కావూరి అనూరాధ | 64 |
| భావాల లావాలు చిమ్మిన రాచకొండ | — వి.వి. రమణమూర్తి | 82 |
| రావిశాస్త్రీయం | — దివి కుమార్ | 93 |
| కవితలు : రాసినవాడు ఫల్గుణుడు | — చందు సుబ్బారావు | 20 |
| దృష్టి కర్త | — ఇమ్రోజ్ | 51 |
| కథ : ఆఖరి దశ | — రావిశాస్త్రి | 78 |
| గల్పిక : నా పానంలో సంగోరు యిచ్చినా? | — ఎ.బి. సుందరరావు | 27 |
| లేఖ సాహిత్యం: రావిశాస్త్రి లేఖలు | | 33 |
| పిల్లల ప్రపంచం నిర్వహణ : | — పి. చంద్రశేఖర్ అజాద్ | 100 |



# కథలే మిగిల్చి కరిగిపోయిన 'రాచకొండ'కు కలాల నివాళి.

"అన్యాయానివి కోరల కరువులే; ఊరకోలేక ఉండబట్టలేక పడిపడిగా
పడబడుతూ పిల్చి చూస్తే
మిల్లు చుట్టూ మర తుపాకులే. వాటికెడంగా ప్రవాహమే.... రోడ్డు నిండా
ఉడుకు రక్తపు
మడుగులే మడుగులే; అందులో ఎర్రనెరని వెన్నెలే తడి వెన్నెలే; నెత్తురంతా
చిమ్మి
అరపై మందొక్కసారి కూలినపుడు నెత్తురంతా ఒకటే; అవును తల్లీ
ఒక్కటే మా నెత్తురంతా ఒక్కటే"

ఇదీ సంతకం అక్కర లేని వచనం; ఉవ్వెత్తున లేచి ఎగసిపడే కెరటం వెనుక కెరటం, వుపమానం వెంట వుపమానం, విశాఖ సంద్రంలా హోరెత్తుతూ, చదువరులను ఉక్కిరి బిక్కిరి చేస్తూ పరవళ్ళ గోదారిలా సాగే శైలిలో, రావిశాస్త్రి తప్ప మరెవరూ వ్రాయలేరన్నది "నిజం." ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో ప్రచండ భాస్కరుడై సముజ్జ్వలంగా ప్రకాశించి, తెలుగు కథకు, నవలకు అనితర మార్గం నిర్దేశించి, మనకు కథలే మిగిల్చి కరిగిపోయాడు రాచకొండ. విశాఖ సముద్రంలో ఎగసిపడే కెరటాలను సముదాయించలేక ఏరాడకొండ ఎంత అవస్థ పడిందో! నవంబరు పదవ తేదీ ఉదయం 9 గం॥ 45 ని॥లకు విశాఖలో కన్ను మూసిన రాచకొండ విశ్వనాథశాస్త్రి మరణవార్త సాహిత్యాభిమానులను దుఃఖంలో ముంచి వేసింది. ఏడవ చంద్రుడు- ఒకే విశ్వంతో మానవ జీవన భూగర్భం ఛేదించి, వీక్షించి, సమీక్షించి తన సాహితీ శైలి నైపుణ్యంతో మన ముందుంచబోయే అద్భుత సత్యాలను, అనుభవాలను తెల్సుకొనే అదృష్టాన్ని తెలుగు పాఠకులు కోల్పోయారు; "నాకు మృత్యువు ఆసన్నం అవుతోంది. నేను ఎవ్వర్నీ మోసం చేసి అబద్ధాలు ఆడి మూటకట్టుకొని మోసుకు పోవలసింది ఏమీ లేదు" అని చాలా వినమ్రంగా, నిరాడంబరంగా పల్కుతూ మృత్యుశయ్యపై నుండి కూడా విరామ మెరుగక 'ఇల్లు' నవలను పూర్తి చేసిన రావిశాస్త్రికి మరణం లేదు; మరణించినా మన స్మృతుల్లో చిరంజీవిగా నిల్చిపోతాడు.

అభ్యుదయ రచయితలు ఆగిపోయిన చోటు నుంచి రావిశాస్త్రి పయనం ప్రారంభమౌతుంది. "సమాజాన్ని వేయి కళ్ళతో కనిపెట్ట గల్గినవాడే సిసలైన

రచయిత. ఆ పని యిదివరకు కొడవగంటి చేశాడు. ఇప్పుడు రావిశాస్త్రి చేస్తున్నాడు. కథలు మాత్రమే రాసిన కొడవటిగంటిని ఒకప్పుడు నేను చెకోవ్‌తో పోల్చాను. నాటక రచయిత కూడా అయిన రావిశాస్త్రి ఆ పోలికకు యింకా అర్హుడు-" అన్న మహాకవి శ్రీశ్రీ మాటల్లో తెలుగు వచన సాహిత్య గమనాన్ని నిర్దేశించే అసాధారణ ప్రజ్ఞ, అపూర్వ శైలి, రాజీలేని నిబద్ధత గల రచయిత రావిశాస్త్రి అని చెప్పనక్కర లేదు.

ఆయన అరుదుగానే వ్రాసేవారు. కాని కథ, దాని సంవిధానం, పాత్రల చిత్రణ అద్భుతంగా, సజీవంగా రూపుదిద్దుకునే వరకు వ్రాసేవారు కారు. అయిన నాల్గున్నర దశాబ్ది కాలంలో "భారతి"లో మొదటి కథ ప్రారంభించిన నాటి నుండి 'ఇల్లు' నవల దాకా సృష్టించిన సాహిత్యం తక్కువేమీ కాదు. మూడు కథల బంగారం, ఋక్కులు, ఆరు చిత్రాలు, ఆరు సారా కథలు, సారో కథలు, కలకంఠి, రావిశాస్త్రి కథలు మొదలయినవి కథా సంకలనాలు. అల్పజీవి, రాజు మహిషి, గోవులొస్తున్నాయ్ జాగ్రత్త, రత్తాలు-రాంబాబు, ఇల్లు నవలలు. నిజం, విషాదం, తిరస్కృతి నాటకాలు, అనేక పుస్తకాలకు వ్రాసిన ముందు మాటలూ, వ్యాసాలు 'రావిశాస్త్రీయం'గా ఆయన తెలుగువారి కిచ్చిన అపూర్వ వారసత్వ సంపద. చిత్తశుద్ధి, నీతి నిజాయితీ, విశ్వసనీయత గల ఒరిజినల్ రచయిత రావిశాస్త్రి ఎవరి కోసం రాస్తున్నాడో, ఎందుకు రాస్తున్నాడో చాలా స్పష్టంగా, బాధ్యతగా రచనా వ్యాసంగం చేశాడు. కీర్తి కండూతికో, పదవులకో, సన్మానాలకో, ఎవరినో సంతోష పెట్టడానికో తన కలాన్ని సారించలేదు: అక్షరాయుధుడై ఆగ్రహంతో, ఆవేశంతో కోర్టుల, జెయిళ్ళ, పోలీసుల, ప్రభుత్వ కార్యలయాల, సారా కాంట్రాక్టర్ల, పైరవీదాయుళ్ళ, ధన మదాంధుల, భోగలాలసుల, భూ కామాందుల అకృత్యాలను, అన్యాయాలనూ, దౌర్జన్యాలనూ, కపటత్వాన్నీ, చీల్చి చెండాడాడు. కలం కొరడా ఝుడిపించి అక్రమాలపై తిరుగబడమని ప్రబోధించాడు. నిత్య దరిద్రంలో కడుపు నిండక రాక్షస రతికి బలౌతున్న పతితులూ, నేరగాళ్ళూ, జూదగాళ్ళూ, వ్యవస్థ ఉక్కు చక్రంలో నలిగిపోతున్న అధోజగత్ సహోదరులూ, అమాయకులూ, అభాగ్యులూ, అల్పజీవులూ ఆయన కథల్లో, నవలల్లో ప్రాణం పోసుకున్నారు. విశాఖ మాండలికంలో వారంతా సజీవంగా దృశ్యాలై, మన హృదయాలపై చెరగని, మరవని ముద్ర వేస్తారు. "ఈ (భగవత్) సృష్టిలో న్యాయం లేదు; ధర్మం లేదు. సత్యం శివం లేనే లేవు: ఇంత వరకూ కొంత వరకూ సర్వ జీవ జాలాన్నీ సమన్వయ పరచి, సమానత్వం సాధించి, న్యాయం నిలబెట్టి ధర్మ సంస్థాపనకు తాపత్రయపడేది మానవుల్లో కోటికి ఒక్కడే. కోటికి ఒక్కడైనా మానవుడే మానవుడే!" (అ.) తన "ఇల్లు"- చివరి నవలలో చివరి సందేశంగా తన ఆచరణగా తన అన్ని రచనల్లోనూ "మానవుడే

సందేశంగా" బ్రతుకు రుచి చూపించిన మహా రచయిత ఆయన. మానవ సంబంధాల అంతర్మథనాన్ని ఎంతో చిక్కగా, సున్నితంగా, సుళువుగా, ప్రభావితంగా వీక్షించి, కాంక్షించి రచనలు చేశాడు. తన ప్రాపంచిక దృక్పథపు సునిశితత్వంతో, అద్భుత శైలితో పాఠకులను ఉద్రూతలూగించి, తన్మయత్వంతో తన వెంట లాక్కెళ్ళి, అమోఘమైన తాత్త్వికత ముగింపుతో హృదయాలపై చెరగని ముద్ర వేశాడు. వర్షం, అడవి, వెన్నెల, చంద్రుడూ, సముద్రం, చెట్టూ చేమా, చీమా, నల్లమేక, పులి, పాము, ఇంద్రధనస్సు- ఒకటేమిటి ప్రకృతిలోని సమస్తవస్తువులూ ఆనందం. దుఃఖం కల్గించేవి, మనం ద్వేషించేవి, ప్రేమించేవి. ఆయన ఉపమానాలతో క్రొత్త ఊపిర్లతో మనల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. మనిషిని, ప్రకృతిని అర్థం చేసుకోవడానికి, మానవుల మధ్య కోపాలు, తాపాలు, ఉద్రేకాలు, ఆనందాలు, దౌర్జన్యాలు, కుట్రలూ, కుహకాలు, త్యాగాలు, చావులూ, మరణాలు సంక్లిష్ట సాంస్కృతిక విలువల్ని సాహిత్య అద్దంలో మనకు స్ఫటికమంత నిర్మలంగా చూపించాడు. తెలుగు సాహిత్యంలో ఏ రచయితా తొంగి చూడని చీకటి కోణాలను వెలికి తీశాడు. మరీ ముఖ్యంగా కోర్టులు, పోలీసులు. చట్టాలు ఎంతగా సంపన్నుల, భూ స్వాముల, దళారీల పక్షమో, ప్రజాస్వామ్య మెంత బూటకమో, న్యాయం, ధర్మం, నల్లకోటు రాబందులూ, ఖాకీ లాఠీలు, చట్టాల ఉక్కుచట్రాల క్రింద నలిగి, మూలిగి విధ్వంసం కావించబడుతున్నవో విస్పష్టం కావించిన తీరు అమోఘం. రావిశాస్త్రి కలం తన వాడిని, వేడిని సంతరించుకునే సమయానికి తెలుగుదేశంలో రాజకీయార్థిక రంగంలో తలెత్తిన మార్పుల ఫలితంగా ఆవిర్భవించిన నూతన దళారీ ధనిక వర్గం, కుహనా మధ్య తరగతి, లంపెన్ ప్రోలటేరియన్ పాత్రలనూ, మానవ సంబంధాలలో పడిపోతున్న విలువల చిత్రణనూ, అనివార్యంగా పోరాటం తప్ప మార్గం లేదని సంఘటిత పడుతున్న చైతన్యాన్ని జీవద్భాషలో రావిశాస్త్రి కలంలో సజీవతను సంతరించుకున్నవి.

కవిత్వం వ్రాయాలనీ మహా కవుల స్థాయిలో కవిత సాధ్యం కాక వచనంలోకి అడుగు పెట్టాననీ, "తానొక ఫేయిల్డ్ పోయెట్" అని వినమ్రంగా చెప్పుకొన్న రావిశాస్త్రి గారి ప్రతి కథలో, నవలలో గలగల పారే జలపాతంలా, ఎగిసిపడే సంద్రంలా, ఎర్రని సాయం సంధ్యలా, స్వచ్ఛమైన గాలికి ఊయల లూగే వరి చేనులా మనల్ని ఉద్వేగ్నుల్ని, ముగ్ధుల్ని చేస్తుంది. వచనానికి కవిత సొగసు తొడిగి పఠితల హృదయాలకు ఉద్వేగాన్ని, వచన రచనకు సరికొత్త పంథాను అలరించారు. కొందరు ఆధునిక కథా రచయితలు, సాహితీ విమర్శలు ఆయన శిల్పంపై, శైలిపై, భాషపై విమర్శలు కురిపించినా, రావిశాస్త్రి తాను విశ్వసించిన, నచ్చిన పంథాలోనే తన సాహిత్య మంతా సృజించి, అత్యుత్తమ సృజనాత్మక రచయితగా ఆంధ్ర

చెహోవ్, మొపాసా, డికెన్స్‌గా కీర్తి గడించాడు. విశ్వ సాహితీ లోకంలో తెలుగు కవితకు శ్రీశ్రీ పట్టం కట్టగా, వచన రచనకు రావిశాస్త్రి ఆ అపూర్వ స్థానం కల్పించి వచన రచనా మహాశ్రీ మరో శ్రీశ్రీ అనిపించుకున్నాడు.

వ్యక్తిగత జీవితంలో ఎవరి తప్పులెనయ్యినైనా క్షమించే చల్లని చిరునవ్వుల వెన్నెల అతడు. కాని సాహిత్యంలో రచయితగా ఎవరి తప్పుల్నీ క్షమించలేదు. "రచయిత ప్రతివాడూ తాను రాస్తున్నది ఏ మంచికి హాని కల్గిస్తుందో ఏ చెడ్డకి వుపకారం చేస్తుందోనని ఆలోచించ వలసిన అవసరం వుందని నేను తలుస్తాను. మంచికి హాని చెడ్డకి సహాయమూ చెయ్యకూడదని నేను భావిస్తాను. ఇది తెలుసుకుందికి తెలియ జెప్పడానికీ నేనిదంతా రాసేను"— అలా స్పష్టమైన, శాస్త్రీయమైన సామాజిక బాధ్యత రచయిత కుండాలని విశ్వసించి రచనలు చేశాడు. వ్యవస్థపై రచయితగా యుద్ధభేరీ మోగిస్తూ, విప్లవ రచయితల సంఘం ఉపాధ్యక్షుడిగా వుండి, ఇందిరాగాంధీ నిరంకుశ పాలనలో అత్యవసర పరిస్థితి కాలంలో రెండు సంవత్సరాలు చెఱసాల జీవితం అనుభవిస్తూ విశాఖ జైలులో "రత్తాలు-రాంబాబు" నవల రచించాడు. తన వ్యక్తిగత జీవితం, యితర కారణాల వలన విరసానికి రాజీనామా చేసినా, భావ జాల పరంగా విప్లవ ప్రజాతంత్ర సాహిత్య, సాంస్కృతికోద్యమానికి చాలా ఆప్తుడుగా, ఏరాడ కొండంత అండగా నిలబడిన రచయిత రావిశాస్త్రి. విశాఖ జిల్లా పౌర హక్కుల సంఘం బాధ్యతగా ప్రముఖ విప్లవకారుడు నాగభూషణం పట్నాయక్‌కు డిఫెన్స్ లాయర్‌గా, సికింద్రాబాదు కుట్ర కేసులో ముద్దాయిలైన వరవరరావు, చెరబండరాజు యితర రచయితల పక్షాన కోర్టులో వాదించాడు.

సాహిత్య అకాడమీ అవార్డులనూ, ఆంధ్ర విశ్వవిద్యాలయం "కళాప్రపూర్ణ" బిరుదులనూ తిరస్కరించిన రావిశాస్త్రి తానంగీకరించని ఆలోచనలు, ఆచరణతో రాజీ పడలేదు. వృత్తి రీత్యా క్రిమినల్ న్యాయవాదిగా విశాఖపట్నంలో ఏ దిక్కూ మొక్కూ లేని అమాయకులకు, రాజకీయ ఖైదీలకు అండగా నిలిచాడు. కోర్టు చుట్టూ, జైళ్ళ చుట్టూ, సారా కొట్ల చుట్టూ, పోలీసు స్టేషన్‌లో విధి వంచితులు, బాధా సర్పద్రష్టులే ఆయన క్లయింట్స్. వారితో మాట్లాడి, వారి భాషతో తాను తాదాత్మ్యం చెంది ఆ ఉత్తరాంధ్ర అట్టడుగు వర్గాల భాషను అంత సొగసుగా, పదునుగా, శక్తిగా స్వంతం చేసుకుని కథలల్లాడు. తెలుగు కథలో, నవలలో సామాన్యునికి మాన్యుడిగా స్థాన మిచ్చిన రావిశాస్త్రి నిజంగానే ధనస్వామ్య వ్యవస్థను వ్యతిరేకించాడు, తిరస్కరించాడు, విధ్వంసం కావించండని పిలుపిచ్చాడు. విప్లవం తప్ప మరో మార్గం లేదన్నాడు.

ఆయన పులులను, సింహాలను ద్వేషించాడు. లేళ్ళను, ఉడుతలను ప్రేమించాడు: ఆయన పాములను ద్వేషించాడు, చీమలను ప్రేమించాడు. సంపన్నులను

(తరువాయి 101 వ పేజీలో)

# మహత్తర అక్టోబర్ విప్లవస్ఫూర్తితో
# మునుముందుకు సాగుదాం

—పరజ

Those born in the eras of stagnation
Cannot recall their chosen way
We the children of Russia's terrible years
Cannot forget a single day

—Alexander Blok

స్తబ్ద యుగాల్లో జన్మించినవారు తాము ఎంచుకున్న మార్గాన్ని గుర్తు తెచ్చుకోలేరు నిజమే కానీ ఒక దేశపు అత్యంత బీభత్స, భీతావహ కాలాల్లో జీవిస్తున్న మనం ఒక్క రోజైనా ఎట్లా మర్చిపోగలం? అక్టోబర్ విప్లవం విజయవంతమైన మహత్తరక్షణాల్ని గుర్తుచేసుకుంటూ, విప్లవస్ఫూర్తినీ పోరాట పటిమనూ మనకు వారసత్వంగా అందించిన ఆ మహోన్నత త్యాగాల చరిత్రని కళ్ళముందు నిలుపుకుంటున్న మనం సంక్షుభిత వర్తమాన అగ్నిపర్వతంపై నిలబడి వున్నాం. ఎంత జాగరూకతతో, ఎంత పరిశీలనతో, ఇంకెంత ఆత్మవిశ్వాసంతో అవలోకించాల్సి వున్నదో, వ్యవహరించాల్సి వున్నదో నడుస్తున్న చరిత్ర మనకి మరీ మరీ గుర్తు చేస్తున్నది. వెన్ను తడుతున్నది. ప్రేరేపిస్తున్నది. జార్ చక్రవర్తిని నేలకూల్చిన రష్యన్ విప్లవం కానీ, చాంగ్‌కై షేక్‌ని జపాన్ సామ్రాజ్యవాదాన్నీ మట్టి గరిపించిన చైనా విప్లవం కానీ దోపిడీ పీడనల పునాదిపై నిలబడే ప్రజా కంటక వ్యవస్థల స్థానే వొక కొత్త సమాజం కోసం కలలుకని దాన్ని వాస్తవంగా స్థాపించవచ్చు అని నిరూపించినాయి. ప్రపంచవ్యాప్తంగా కార్మిక వర్గం దోపిడినీ పీడననూ ఎదిరించి పెట్టుబడిదారీ రాక్షసున్ని మట్టి గరిపించగల మహత్తరశక్తి అనీ నిరూపించబడ్డది. అణగారివున్న శ్రామికజనం వొక్కసారి వుప్పెనై ఎగసి తిరగబడితే దోపిడీ పీడనల కోటగోడలు పునాదుల్తో సహా పూడ్చిపెట్టుకు పోతాయనీ స్పష్టమైంది. మార్క్స్, ఎంగెల్స్ కమ్యూనిస్టు ప్రణాళికలో అన్నట్టు కేవలం యూరప్‌నే కాదు, ప్రపంచ వ్యాప్తంగా దోపిడీ శక్తుల్ని కమ్యూనిజం అనే 'భూతం' వెన్నంటి వెంటాడి గజగజా వణికించింది. గత చరిత్ర అంతా వర్గ పోరాటాల చరిత్ర అనీ, పెట్టుబడిదారీ వర్గం తనకు గోరీకట్టే కార్మిక వర్గాన్ని తానే సృష్టించి బలోపేతం చేస్తుందనీ మార్క్స్ వూహ అక్షరాలా నిజమైంది. చైనాలో కార్మికులకు తోడు రైతాంగమూకదను తొక్కి

నూతన ప్రజాస్వామిక వ్యవస్థను నిర్మించుకున్నాయి. ఈ శతాబ్దం అర్థభాగానికల్లా ప్రపంచవ్యాప్తంగా విజయవంతమైన విప్లవాలు కార్మిక వర్గాన్ని తిరుగులేని శక్తిగా నిలబెట్టినయి. కమ్యూనిస్టు సమాజాన్ని, సోషలిస్టు వ్యవస్థలనూ ఒక బలమైన ప్రత్యామ్నాయంగా ముందుకు తెచ్చినయి. రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజాన్ని జర్మన్ నాజీయిజాన్ని స్టాలిన్ నాయకత్వంలో ఎదిరించి ఓడించిన సోవియట్ రష్యా కార్మికవర్గం అజేయమని చాటింది.

చరిత్రలో రెండువర్గాలు, పీడిత పీడక వర్గాలు సంఘర్షించుకున్నప్పుడు పీడిత వర్గం గెలిచి మరింత అభివృద్ధికరమైన నూతన సమాజాన్ని స్థాపించడం మాత్రమే కాదు, కొన్నిసార్లు వర్గ పోరాటం ఘర్షించుకుంటున్న వైరి వర్గాల వినాశనానికీ దారి తీస్తుంది. సామ్రాజ్యవాదం మరణశయ్యపై నుండి, తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో చిక్కుకుపోయి ఆర్థిక వ్యవస్థను మార్కెట్ శక్తులకు అప్పగించడం ఈ శతాబ్దాంతపు ఒక ముఖ్య చారిత్రిక లక్షణమైతే మరోవైపు సోవియట్ రష్యాలో, తూర్పు యూరప్‌లో "సోషలిస్టు" వ్యవస్థలూ "కమ్యూనిస్టు" ప్రభుత్వాలూ కుప్పకూలి పెట్టుబడిదారీ విధానం 'ఘన విజయం' సాధించినట్టు కనబడడం మరో ముఖ్య పరిణామం. కమ్యూనిస్టు వ్యతిరేకులకూ, పనిగట్టుకుని నూతన సమాజావిష్కరణ ప్రయత్నాలపై బురద జల్లే వారికి 'స్వర్గాలు కూలుతున్నై!స్వర్గాలు కూలిపోయినై!!' అని పట్టరాని ఆనందం కలిగి వుండవచ్చు గాక! కమ్యూనిస్టు భావజాలం పట్ల సానుభూతి వున్నవారికీ, ప్రగతిశీల ప్రజాస్వామ్య మేధావి వర్గానికీ కించిత్తు నిరాశా,'యిక ఎప్పుడైనా యింతేనా ?' అనే సందేహం— మరీ ముఖ్యంగా మావో అనంతరం చైనా కూడా మార్కెట్ ఎకానమీ వైపు పాశ్చాత్యీకరణ, ప్రైవేటీకరణలవైపూ ప్రయాణం చేస్తుండడం చూస్తే — తప్పక కలిగేవుంటుంది. మొత్తంగా కమ్యూనిస్టు సమాజ స్థాపన మీదా, మార్క్సిస్టు సిద్ధాంతం పైనా, విప్లవం విజయవంతమయ్యే అవకాశాల మీదా ఈ సందేహాలు కలిగే ప్రమాదమూ లేకపోలేదు. అయితే చైతన్య వంతంగా, సృజనాత్మకంగా మార్క్సిజాన్ని ఈనాటి సమాజానికి అన్వయించే వారికి మాత్రం వైఫల్యాల నుండి 'కూలుతున్న స్వర్గాల' నుండి కొత్త గుణపాఠాలు, సరికొత్త విప్లవస్ఫూర్తీ, నూతనోత్తేజం కలగడం అచారిత్రకమేమీ కాదు. చరిత్రను శాస్త్రీయంగా విశ్లేషించి భవిష్యత్తును అంచనా వేసే విప్లవ ఆశావాదం అచారిత్రక మెట్లా అవుతుంది?

సోషలిస్టు విప్లవం విజయవంతమై కార్మిక వర్గం రాజ్యాధికారం చేజిక్కించు కున్న తర్వాత సమస్త వర్గ పోరాటాలూ ముగిసిపోయి సమస్త సమస్యలూ వాటంతట అదే పరిష్కారమై పోతాయనుకోవడం యాంత్రికమైన సూత్రీకరణ. వుత్పత్తి శక్తులకూ వుత్పత్తి సంబంధాలకూ మధ్య వైరుధ్యం దానంతట అదే సంపూర్ణంగా, పరిష్కారం కూడా కాదు పునాదిలో జరిగే మార్పులో వుపరితలంపై ప్రభావాన్ని నెరపినా, వుపరితలాన్ని పూర్తిగా ఆటోమేటిగ్గా మార్చేయవు. వుపరితలంలో వుండే అనేకానేక కార్మికవర్గ వ్యతిరేక పెడ ధోరణులకు వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం జరగాల్సిన అవశ్యకత ఎంతైనా వుంటుంది. అట్లాగే పునాదిలోనూ యింకా మారని గిడసబారిన ప్రగతి నిరోధక అంశాలనీ సమూలంగా నిర్మూలించాల్సే వుంటుంది. విప్లవం జరుగుతున్నపుడు విప్లవానంతరమూ వుపరితలం (Super structure) ప్రాధాన్యతనూ, వుపరితలంలో చైతన్యవంతంగా జరగాల్సిన వర్గ పోరాటాల అవశ్య కతనూ గుర్తించాల్సినంతగా గుర్తించక పోవటంవల్ల అనేకానేక పెడధోరణులు తలెత్తి క్రమంగా బలం పుంజుకుని చివరకు సోషలిస్టు వ్యవస్థనే పెళ్ళగించివేసేంత ప్రమాద స్థాయికి చేరుకుంటాయనేది 'కూలిన స్వర్గాలు' నేర్పుతోన్న బలమైన గుణ పాఠం. అయితే కూలిపోయినవి నిజంగా స్వర్గాలా? లేదా స్వర్గం పేరుతో చెలామణీ అయిన వ్యవస్థలా?

సామ్రాజ్యవాదంలో శాంతియుత సహజీవనం ప్రకటించి, తానూ ఒక అగ్ర రాజ్యంగా ఎదిగేందుకు పోటీలో అడుగుపెట్టి, మూడవ ప్రపంచదేశాలని సాంకేతికం గానూ, ఆర్థిక సాయం పేరా, సైనిక దాడులలోనూ, దురాక్రమణలతోనూ కబళించిన సోవియట్ రష్యా సోషల్ సామ్రాజ్యవాదంగా 1956లో కృశ్చేవ్ అధికారంలోకి రాగానే మారిపోయిందా? ఈ పరిణామాలకు పునాది విప్లవానంతరం అసంపూర్తిగా వదిలివేయబడ్డ వర్గ పోరాటాల వైఫల్యంలో లేదా? బ్యూరోక్రటిక్ ప్రభుత్వ పెట్టుబడి దారీ విధానంగా కృశ్చేవ్ హయాంలో పరిణామం చెందిన సోషలిస్టు వ్యవస్థ క్రమ క్రమంగా ప్రపంచంలోని ప్రధాన అగ్రరాజ్యంగా, ప్రపంచ ప్రజలకు ప్రథమ శత్రువుగా ఎదగడం గతి తార్కిక క్రమమే (Dialectical process) సోవియట్ రష్యా సోషలిజం పేర తూర్పు యూరప్ మీద రుద్దిన ప్రభుత్వ పెట్టుబడిదారి విధానం వల్ల ఆయాదేశాల ప్రజల్లో ఒక దుర్మార్గమైన నిరంకుశ పాలనని అనుభవించారు. కనీస ప్రజాస్వామిక వాతావరణం లేక విలవిల్లాడారు. చివరకు సోషలిజం అంటే యింత హీనమైనదా అనే ఏహ్యాభావం వాళ్ళలో పెరిగిపోవడం అసహజమేమీ కాదు. కార్మిక వర్గానికి ప్రతినిధులుగా చెప్పుకున్న కమ్యూనిస్టుపార్టీ నాయకులు సకల రాజ భోగాలనీ అనుభవిస్తూ ప్రజల్ని నియంతలుగా పాలించడం స్వేచ్ఛా కాముకులైన అశేష ప్రజానీకానికి ఎప్పుడూ మింగుడుపడని విషయమే! అందుచే సోవియట్ రష్యా

తృత్వం, నిరంకుశ ప్రభుత్వ పెట్టుబడిదారి విధానం పట్ల వుప్పొంగిన నిరసన ప్రజా వెల్లువలో ఆయా 'స్వర్గాలు' కుప్ప కూలిపోయినయి. కూలిపోవాల్సినవే కూలిపోయి నయి. అయితే నిరంకుశత్వ నియంతృత్వం స్థానే ఆయాదేశాల ప్రజలు ఎంచుకున్న పాశ్చాత్య "ప్రజాస్వామ్యం" ఎంత బూటకమైందో మరెంత నికృష్టమైందో యివ్వా డిప్పుడే తెలుసుకుంటున్నారు కూడా! పాశ్చాత్య 'ప్రజాస్వామ్యం' పై పూ, పెట్టుబడి దారీ విధానం పై పూ, మార్కెట్ ఎకానమీ పై పూ గ్లాన్‌నాస్ట్, పెరిస్త్రోయికాలతో ప్రారంభమైన బహిరంగ ప్రయాణం ఆగస్టు కూప్ (Coup) తర్వాత ఎల్ట్సిన్ గద్దె నెక్కడంతోనే పరిసమాప్తి కాలేదు. సోషలిజం పేరు మీద చెలామణీ అయిన బ్యూరో క్రటిక్ ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం అంత సులువుగా మార్కెట్ ఆర్థిక వ్యవస్థ గానూ పెట్టుబడిదారీ వ్యవస్థగానూ మారిపోదు. హార్డ్‌లైనర్సుగా పిలువబడుతూ పార్లమెంట్‌ను గుప్పిట్లో పెట్టుకున్న రుత్స్కోయి, ఖస్బులాతోవ్ నిజానికి వ్యతిరే కించింది ఈ మార్పునే! రివిజనిస్టులకీ ఎల్ట్సిన్‌కీ జరిగిన పోరుసు కమ్యూనిజానికీ పెట్టుబడిదారీ విధానానికీ జరిగిన పోరుగా అభివర్ణించడం ఎంత మాత్రమూ సరైంది కాదు. అయితే 'ప్రజాస్వామ్య' పరిరక్షకుడిగా ఎల్ట్సిన్ తన అధికారం నిలుపు కునేందుకు జరిపిన రక్తపాతం, కొనసాగించిన నిర్బంధం, పత్రికలపై విధించిన సెన్సారు మాత్రం పాశ్చాత్య 'ప్రజాస్వామ్యం' ఎంత క్రూరంగా ప్రవర్తించగలదో ప్రపంచ ప్రజలందరికీ వెల్లడయింది. రష్యాలోనూ, తూర్పు యూరప్‌లోనూ చలామణీ అయిన వ్యవస్థల మీద ద్వేషం మొత్తంగా కమ్యూనిజం మీదా, సోషలిజం మీదా ప్రకటితమైన ద్వేషంగా, లెనిన్ విగ్రహాల్ని కూల్చివేసిన 'పెనుమార్పు'గా పాశ్చాత్య మీడియా చేతనైనంతగా ప్రచారం చేసి సంబరపడిపోయింది. అరిస్టోక్రసీకి, మధ్య తరగతికి, వుద్యోగ వర్గాలకూ పరిమితమైన ఈ నిరసన ప్రజలందరి ద్వేషంగా కూడా దుష్ప్రచారం జరిగింది. సోవియట్ రష్యాలో ఈ మార్పులో జరిగినప్పుడూ, యిప్పటికీ కూడా లక్షలాది కార్మికులు, రైతాంగం లెనిన్ ఫొటోలతో మాస్కో వీధుల్లోనూ యింకా అనేక చోట్లా 'విప్లవం వర్ధిల్లాలని' 'దోపిడీ వ్యవస్థలు నశించాలనీ' నినదిస్తూ ఊరేగింపులు, ధర్నాలు, సమ్మెలు నిర్వహించడం పెట్టుబడి దారీ వర్గం ఎంత కప్పిపుచ్చడానికి ప్రయత్నించినా సోషలిజం కమ్యూనిజాలను చరిత్ర నుండీ ప్రపంచ ప్రజల హృదయాల నుండీ చెరిపి వేయలేదనే సత్యం రుజువగు తున్నది. ఈ మధ్య పోలెండ్‌లో జరిగిన ఎన్నికలలో 1990లో అధికారంలోకి వచ్చిన కమ్యూనిస్టు వ్యతిరేకి చిత్తుగా వోడిపోవడమూ, జర్మనీలో, హంగరీలో, చెకొస్లవేకియాలో, యూగోస్లోవియాలో సంఘటనలు ప్రజలు పాశ్చాత్య పెట్టుబడిదారీ విధానాన్ని ఎంత ద్వేషిస్తున్నారో స్పష్టం చేస్తున్నాయి.

'స్వర్గాలు కూలిపోవడానికీ', విప్లవం విజయవంతం కాకపోవడానికీ, విప్ల వోద్యమంలోకి సమీకరింపబడే ప్రజానీకం ఎక్కువ కాలం నిలబడక పోవడానికీ, పీడిత ప్రజానీకంలో కొందరు శత్రు శిబిరంలో వుండడానికీ ప్రధాన కారణం మానవ ప్రవృత్తి అనీ, మానవ ప్రవృత్తిలో అన్ని కాలాలలో, అన్ని సమాజాలలో విశ్వజనీనంగా కొన్ని వికారాలు వర్గాతీతంగా వుంటాయనీ వీటిని మార్క్సిజం కానీ, చారిత్రిక భౌతికవాదం కానీ సరిగ్గా పట్టించుకోలేదనే వాదన వొకటున్నది మానవ ప్రవృత్తి పట్టించుకోని మార్క్సిస్టు దృక్పధంలోని లోపాన్ని పూర్తి చేయాల్సిన అవసరాన్ని ఈ వాదన ముందుకు తెస్తూ మానవ ప్రవృత్తిలోని అనేకానేక వికారాల్ని ద్వేషించాలంటోంది. మానవ ప్రవృత్తి అనేది ఒక అమూర్తమైన భావనకాదు. అది నిర్దిష్టంగా ఆయా సామాజిక పరిస్థితులమీదా, చారిత్రక నేపథ్యం మీదా ఆధారపడి వుంటుంది (Time and space). మానవ ప్రవృత్తి వుత్పత్తి సంబంధంలో రూపు దిద్దుకునే నిర్దిష్టమైన వర్గ సంబంధ భావజాలం. సమాజంలో అత్యంత ప్రబలంగా వుండే భావజాలం పాలకవర్గ భావజాలమే కాబట్టి పీడిత ప్రజా సమూహాల్లో ప్రగతి నిరోధక భావజాలం వుండడంలో ఆశ్చర్యం లేదు. అట్లా మానవ ప్రవృత్తి రూపు దిద్దుకోవడమూ అసహజం కాదు. శ్రామిక వర్గానికి చెందిన ప్రజల్లో అన్య వర్గ ధోరణులూ ఎన్నో ప్రబలంగానే వుంటాయి అయితే శ్రామికవర్గానికి తమదైన వర్గ స్వభావం వుండదనడమూ సరియైంది కాదు. యిక్కడే కమ్యూనిస్టుపార్టీ పురోగామి పాత్ర (Van guard) నిర్వహిస్తుంది. పీడనకు వ్యతిరేకంగా సాగే పోరాటాల్లోకి సమీకరించబడే పీడిత ప్రజానీకానికి కార్మికవర్గ దృక్పధం అందించి ఆ పోరాటాలు సమ సమాజ స్థాపన కోసం సాగే పోరాటాలుగా ముందుకు నడిపేది (Steer) కమ్యూనిస్టు పార్టీయే! ఏ ప్రజా సమూహానికీ తనను తాను విముక్తి చేసుకుని సమ సమాజమనే వున్నత ఆశయాన్ని స్థాపించే లక్ష్యం స్వతహాగా కలిగి వుండదని ఖచ్చితంగా నిర్ధారించలేకపోయినా ఆ వర్గ దృక్పధాన్ని, రాజకీయ లక్ష్యాన్ని సానపెట్టి పదునెక్కించేది కార్మికవర్గ పార్టీయే! పోరాట క్రమంలో Class- in- itself గా వుండే పీడిత ప్రజా సమూహం Class-for- itself గా మారుతుందనే మార్క్సిస్టు లెనినిస్టు తాత్త్వీక దృక్పథం వైరుధ్యాలు, భౌతిక శక్తుల మధ్య, సాంఘిక శక్తుల మధ్య, సాంస్కృతిక రంగంలోనూ వునికిలో వున్న నిర్దిష్ట వర్గ వైరుధ్యాలూ, సంఘర్షణ తీవ్రత కానీ మానవ ప్రవృత్తి కాదు. పీడితులు ప్రజా వ్యతిరేకులు కావడం వెనుక ఖచ్చితమైన పాలక వర్గ రాజకీయాలు, భావజాలమూ వున్నాయనేది సత్యం. సోవియట్ రష్యాలో, చైనాలో, తూర్పు యూరప్‌లో 'సోషలిజం' కూలిపోవడానికి అసంపూర్ణంగా పరిష్కరించబడ్డ వైరుధ్యాలూ, వర్గ పోరాటం విప్లవానంతరమూ

కొనసాగక పోవడం కారణం కానీ, కార్మిక వర్గంలో వుండే కార్మికవర్గ వ్యతిరేక మానవ ప్రవృత్తి మాత్రమే కాదు.

ఒకానొక సంక్లిష్టమైన సామాజిక దశలో వున్నాం మనం. సామ్రాజ్యవాదం' అగ్రరాజ్యాలు— అది అమెరికా కావచ్చు, పరిణామ దశలో వున్న రష్యా కావచ్చు- ప్రపంచం మొత్తాన్ని తమతమ మార్కెట్ల అధీనంలోకి తెచ్చుకుని కబళించి వేయాలని చూస్తున్న సందర్భమిది. ఊహాతీతంగా పెరిగిపోతున్న సాంకేతిక పరిజ్ఞానంలోనూ, అణ్వస్త్రాలతోనూ, సాంస్కృతిక దండయాత్రలతోనూ సామ్రాజ్యవాదం కోరలు సాచి ముందు కొస్తున్నది. మూడవ ప్రపంచ దేశాల ప్రజానీకానికి ప్రధాన శత్రువైన సామ్రాజ్యవాదం నిజానికి మావో-సె-టుంగ్ చెప్పినట్టు "కాగితం పులే !" మరణ శయ్యపై నున్నదే! తన వునికి కాపాడుకోడానికి ప్రజా శత్రువులైన దళారీలలోనూ, అత్యంత ప్రగతి నిరోధక శక్తులైన భూస్వామ్యమూ, మతతత్త్వంతోనూ చేతులు కలిపి మూడవ ప్రపంచ దేశాలని కబళించ జూస్తున్నది. ఫలితంగా ఒక వికృతమైన సామాజిక ఆర్థిక వ్యవస్థా దాని కనుకూలమైన సాంస్కృతిక వ్యవస్థా ప్రజానీకం బ్రతుకులపై స్వారీ చేస్తున్నది. పెరిగిపోతున్న స్టార్ టీవీ సంస్కృతీ, నశించి పోతున్న మానవ విలువలూ, పేట్రేగిపోయే విశృంఖలత్వమూ, బాధ్యతారాహిత్యమూ, భూస్వామ్య బానిస సంస్కృతీ, ఎట్లయినా సరే డబ్బు సంపాదించి హఠాత్తుగా పై కెదిగి పోవాలనుకునే స్వార్థమూ, ఈ విష సంస్కృతి పరిణామాలే! రోజురోజుకూ దుర్భరమౌతున్న జీవనమూ, అడుగంటి పోయిన జీవన ప్రమాణాలూ, పెరిగిపోతున్న పేదరికమూ, ఆకలీ, నిరుద్యోగమూ ప్రజలని రోడ్డున పడేస్తున్నవి. వీటికి తోడు అమానవీయత, హింస పెచ్చరిల్లిపోయి నిలువ నీడ లేకుండా చేస్తున్నవి. ప్రజలని బూటకపు సంక్షేమాల ద్వారా, హామీల ద్వారా, వాగ్దానాల ద్వారా పాలించలేమని తెలుసుకున్న పాలకులు హింస ద్వారా పాలిస్తున్నారు. హింస వ్యవస్థీకృతమై రాజ్యమై (State) పోయింది. ప్రశ్నించే ప్రజలని రాజ్యహింస క్రూరంగా అణిచి వేస్తున్నది. విప్లవోద్యమాన్ని బూటకపు ఎన్‌కౌంటర్లతో, నిషేధాలతో అణచివేసే ప్రయత్నమూ రాజ్యం చేస్తోంది. అయితే దోపిడీ పాలకులు ఎంతో కాలం హింస మీద మాత్రమే ఆధారపడి పాలించ లేరు. అందుచేతే ప్రజలని ఏలడానికి హిందూ మతతత్త్వ భావ జాలాన్ని ఎంచుకుని కర్మ సిద్ధాంతంతోనూ, చాతుర్వర్ణ వ్యవస్థతోనూ హైందవ ధర్మంతోనూ అగ్ర కుల భావజాలంతోనూ ప్రజల నోళ్ళు నొక్కేసే ప్రయత్నం చేస్తున్నారు. ఫలితంగా రాజ్యమే హిందూ రాజ్యంగా పరిణామం చెంది, దళితులపై స్త్రీలపై, మైనారిటీ ప్రజలపై దాడులు అత్యాచారాలు రోజురోజుకూ పెరిగిపోతున్నై. ఇంత సంక్షుభిత సామాజిక బీభత్సంలో వూపిరి పీలుస్తున్న మనకు కర్తవ్యమేమిటో బాధ్యత ఏమిటో చరిత్ర స్పష్టంగానే వెలుగు చూపుతున్నది. మహత్తర అక్టోబర్ →

# "సామాజిక స్పృహగాళ్ళు"ట!

## — రాచకొండ విశ్వనాథ శాస్త్రి

సామాజిక స్పృహతో ఏదైనా, యెవరైనా రాస్తే (లేదా, రాయడానికి ప్రయత్నిస్తే) అటువంటి వాళ్ళని "సామాజిక స్పృహగాళ్ళ" అని వెక్కిరించడం కొంతమందికి (గొప్పదనపు) అలవాటు అయికూర్చుంది.

మీరు ఎక్కడైనా చూడండి. వెక్కిరించే వాళ్ళ ముఖాలు, అలా వెక్కిరిస్తూన్న సమయాల్లో, తరచు చాలా వికృతంగా మారుతాయి వికృతిలోంచే వెక్కిరింపు వచ్చి వుంటుందని నేను అనుకుంటాను. అయితే, వెక్కిరించడానికి ప్రయత్నించే వారి గురించి నేను కొంచెం కోపంతోనూ, కించిత్ దుఃఖంతోనూ రాసిన సంగతి అదీ ఈ కింది కూడాను.

ఎందు చేతనూ అంటే:

సామాజిక స్పృహతో (సా.స్పృ.) రాయాలని ప్రయత్నించే వాళ్ళని వెక్కిరించి వేళాకోళం చేస్తూ రాసేవారు కూడా సామాజిక స్పృహతోనే రాస్తారు. అసలు, అలా వెక్కిరించి వేళాకోళం చేయడంలోనే చచ్చినంత (లేదా ఒక్కొక్కప్పుడు, సా.స్పృ. "గాళ్ళ"ని చావ జంపి చెవులు మయ్యాలి అనేటంత) సామాజిక స్పృహ ఉంటుంది ఆ వెక్కిరింత ఎవరికోసం? సమాజంలోని "సా.స్పృ. గాళ్ళని" సమాజంలోని మరి కొంతమందికి చూపించి వెక్కిరించాలనే కదా వాళ్ళ ఉద్దేశం ?! ఆ వుద్దేశం వారికి ససేమిరా లేదు, వారు ససేమిరా చెప్ప జాలరు అని నేను సునాయాసంగా నమ్ముతాను.

సామాజిక స్పృహతో రాసిన వారిని వెక్కిరించి వాళ్ళు తాము మాత్రం అటువంటి స్పృహని బహిష్కరించి, ఆ స్పృహ లేకుండా (లేదా ఆ స్పృహని అతిక్రమించి) రాస్తున్నామని మనల్ని నమ్మమనే కదా వారి ఉద్దేశం?! అంతే కాని "మేం స్పృహ లేకుండా రాస్తున్నామండీ" లేదా "మేం చాలా నిస్పృహతో రాస్తున్నామండీ" అని వారు అనరు కదా? అలా అన జాలరు కూడా కదా!

---

→విప్లవాల స్ఫూర్తినీ, తదనంతర వైఫల్యాల గుణపాఠాల్నీ, శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథం వెలుగులో స్వీకరించాల్సిన అవసరమూ, పోరాడుతున్న ప్రజలపై అచంచల విశ్వాసంతో నూతనోత్తేజంతో, విప్లవ చైతన్యంతో పోరాట పటిమతో నూతన ప్రజాస్వామిక సాంస్కృతికోద్యమాన్ని నిర్మించేందుకూ, వుసరితలాన్ని విప్లవానుకూలంగా మార్చేందుకు మునుముందుకు సాగాల్సిన ఆవశ్యకతను ఈ చారిత్రిక సందర్భం బలంగా నొక్కి వక్కాణిస్తున్నది. ●

కొంతమంది కథకులు కథలు రాస్తారు. ఎందుకోసం? తమ ఆనందంకోసం- అని వారు అంటారు. కాని ఆ కథల్ని వారు ప్రకటించకోకుండా ఉండరు. తప్పక ప్రకటింపించుకుంటారు. అది ఎందుకోసం? ఆ కథలు ఇతరులు చదవడంకోసం. అంతే కద. అయితే ఆ ఇతరులు సమాజంలోని వారే కాని సమాజంలో లేకుండా ఎక్కడో ఏవో ఆకాశంలోని స్వర్గం లోకంలో ఉన్న వారు కాదు కద.

కానైతే :

కొంతమందికి ఈ భూతలమే స్వర్గంగా ఉంటుంది. సా.స్పృ.ని వెక్కిరించే వాళ్ళంతా అటువంటి భూతల స్వర్గంలో ఉన్నవారి ఆనందంకోసం రాస్తారేమోనని నేను తలుస్తాను.

పూర్వం రోము మహా నగరంలోకి కాదోలు ప్లేగు వ్యాధి ప్రవేశించి, జనాన్ని తినేయడం ప్రారంభించిందట. ఊరు వదిలి వెళ్ళజాలని పేదలు ఆ పెను ప్లేగుకి మంటల్లో మల్లెల్లా మాడి చేస్తున్నారు. కాని, బంగారు రెక్కల తుమ్మెదలు మాత్రం ఊరవతలికి పారి భోగలిగాయి. అయితే ఈ భాగ్యవంతులైన బంగరు తుమ్మెదలకి పనీపాటా లేకపోవడంతో కాలం వారి నెత్తుల మీద పెనుసుత్తిలా కూర్చుందట. ఆ నెత్తిమీద సుత్తిని మర్చిపోయి మల్లెల రాత్రుళ్ళు వారిలో ఏ ఒక్కను మర్చిపోకుండా ఉండడం కోసం వారు 'మధురంగా, సరసంగా, కమ్మకమ్మగా' బూతు బూతు కథలు చెప్పుకుంటూ, కాలక్షేపం చేస్తారు. పది రాత్రుళ్ళు కాబోలు అలా ఊరి అవతల ఉండి అన్ని రాత్రుళ్ళు వారు అటువంటి కథలే చెప్పుకున్నారో లేదో నాకు గుర్తు లేదు కాని అది రాత్రి మాత్రం వారంతా ఆ కథలతోనే ఆనందించేరని నాకు గుర్తు.

ఆ కథలు మన శుక సప్తతి కథల్లాంటివి. ఒక రాజుగారు కొన్ని దినాలు అంతఃపురం విడిచి, ఏదో రాచకార్యం మీద అనుకుంటాను- ఎక్కడికో వెళ్ళవలసి ఉంటుంది. వారు వెళ్తారు రాజుగారు అటు వెళ్ళగానే రాణిగారికి ఇటువైపు మదనావస్థ మరీ ఎక్కువ అయిపోతుంది. దాన్తో ఆమెగారికి పతివ్రతా సమాజ స్పృహ పటాపంచలై పోయి, రాజుగారు లేని లోటు ఎక్కడో అక్కడ భర్తీ చేసుకొందికి రాత్రిళ్ళు బయల్దేరుతూ ఉంటుంది.

అయితే - రెక్కలొచ్చిన ఆంజనేయుడు పక్షిగా మారిపోయి, ఈ అంతఃపురంలో నౌఖరికి అమిరిపోయేడా అన్నట్టు, ఈ రాజ దంపతులకు ఒక విశ్వాసమైన చిలక ఉంటుంది. అంతఃపురం దాటిపోయి అశ్లీలంతో మునిగిపోడానికి పయనమయే రాణిగారి కాలి తొందరచూసి, ఆ చిలక కంటతడి పెట్టుకుని, మహారాణిగారి మర్యాద కాపాడి, ఆమెని పట్టి ఆపి, రాజుగారి కోసం ఆమెని పతివ్రతా శిరోమణిగానే మిగల్చాలని పట్టు పడుతుంది. ఆ వుద్దేశంతో, ఆ పట్టుదలతో ఆ చిలక ఆ రాణీగారికి రోజుకొక కథ చెప్తూ ఉంటుంది. ఆ కథలు వింటూ వింటూ, రాణిగారు పతివ్రతగా

మిగిలిపోతుంది. ఇంతలో రాజుగారు (రవితేజము లలరగ) వచ్చేస్తారు. వారితో రాణిగారు పతివ్రతగానే పందిరి మంచం ఎక్కేస్తారు.

అంతఃపురం అవతల అన్నాళ్ళూ రాజుగారు ఏం చేశారో నాకు గుర్తులేదు కాని, ఆయన మంచివారు అనే నేను అనుకుంటాను. మరైతే చిలక ? చిలక - మా విశాఖవైపు వాళ్ళ 'అతి మంచి' గురించి అప్పుడొప్పుడు చెప్పినట్టు— చెడ మంచిది. మరి మహా రాణీ గారు? అవిడ కూడా మంచిగానే మిగిలి పోయింది కద!

అయితే అందులో చెడు ఏముంది ?

చెడ్డతనం అంతా చిలక చెప్పిన కథల్లో ఉంది అని నేను అనుకుంటాను. 'రంకు నేర్చినమ్మ బొంక నేర్చిందట' అని ఒక సామెత ఉన్నదని చాలా మందికి తెలిసిన సంగతే, 'సప్తతి' కథలలోని శుకం ఆ సామెతని ఉల్టా చేసి 'బొంక నేర్చిన అమ్మలే రంకు చేయాలి' అని రాణి గారికి బోధ చేస్తుంది. మొదట బొంక నేర్వ కుండా రెండో పనికి పెస్తే, బోలెడు ప్రమాదాలు ఉంటాయని చిలకవల్ల చక్కగా నేర్చుకున్న రాణీ గారు, తనకి బొంకు చాక చక్యం లేదు అని తెలుసుకొని, రంకు రాణీగా మారిపోకుండా మంచి రాణీగా మిగిలి పోతుంది.

శుక సప్తతి కథలు చెప్పిన వారికీ, డెకామిరన్ (Decameren) (లో నేను చదివిన కొన్ని) కథలు చెప్పిన వారికీ, సామాజిక స్పృహ లేదా? లేక పోతే వారు ఆ కథలు ఎవరికి ఎందు కోసం చెప్పినట్టు? ఆ కథల్లో మంచి గురించి బోధ ఉన్నదా, లేక చెడు చేయమనే బోధ ఉన్నదా? లేక వాటిలో ఉల్లాసం కలిగించాలనే ప్రేరణ మాత్రమే ఉన్నదా? వాటిలో మంచి బోధ కాని, చెడ్డ బోధ కాని, లేదా ఉల్లాసపు ప్రేరణ మాత్రమే కాని ఉంటే ఆ బోధనా, ఆ ప్రేరణా ఏ సమాజం కోసం? జలగల సమాజానికా, టామ్ జుమ్మనే ఈగా, దోమా సమాజానికా?

శుక సప్తతి కథలు 'లంజరికం' చెయ్యకూడదు అన్నట్టు చెప్తానే, జనంలోని యువతీ యువకుల్లో జారత్వాన్ని అహ్లాదకరంగా రెచ్చగొట్టడం లేదా? అ కథలు జార సామాజిక స్పృహతో చెప్పబడినవి కావా? మీరాబాయ్ గారి పాటలు ఏ సామా జిక స్పృహతో పాడ బడ్డాయి? సత్యభామా స్వాంతనం ఏ సామాజిక స్పృహతో రాయబడి, చదవ బడింది? మహా భారతం ఏ సామాజిక స్పృహతో చెప్పబడింది. మను చరిత్ర ఏ సామాజిక స్పృహతో రాయబడింది ?

ఇదే సందర్భంలో ఒక విషయం.

గుడిపాటి (కీ. శే.) వెంకట చలం గారు చాలా కథలు రాసేరు. సమాజం లోని స్త్రీకి సంకెళ్ళు తెగిపోవాలి అనే స్పృహతో ఆయన అ కథలు రాసేరు. సామాజిక స్పృహ గురించి వెక్కిరించే వారిలో నూటికి తొంభై తొమ్మిది మంది చలం గార్ని పొగుడుతారే కాని 'సామాజిక స్పృహ గాడు' అని ఆయన్ని మాత్రం వెక్కిరించరు. ఎందువల్ల ? అయ నీ కథల్లో నీతి ఎంత ఎక్కువగా ఉన్నప్పటికీ,

అందుకు సరి సమానంగా బూతు కూడా వున్నందువల్లా? లేక- (స్వేచ్ఛకి తెలుగు మాట ఏమిటి? బూతుకి సంస్కృత పదం ఏమిటి?) లేక - ఆడా మగా అంతా స్వేచ్ఛగా బూతుగా వుంటే బాగుంటుందని చలంగారు "చెప్పేరు కాబట్టి!" అనా? లేక 'పీడిత వర్గం' 'పీడించే వర్గం' 'కాయ కష్టం పడే వర్గం' 'కష్టించే వర్గాన్ని నష్టించే వర్గం' 'పూట బత్తెం-పుల్ల వెలుగూ వర్గం' 'పెట్టుబడీ బడా పొట్టల వర్గం'- ఇటువంటి విషయాల జోలికి చలంగారు పోకుండా ఉన్నందు వల్లా? ప్రస్తుతం మానవ సమాజంలో చెమటలు కార్చి కష్టించి సంపద సృష్టించే వర్గానికీ 'ఆ సంపద దోచుకుని సెంట్లు పూసుకొని పోషించే వర్గానికీ' మధ్య చెలరేగే పోరాటం గురించి ఆయన పట్టించుకోక పోవడం వల్ల నా? స్వేచ్ఛ కంటే జననేంద్రియ స్వేచ్ఛ మరీ ముఖ్యం అని చలంగారు 'తప్పక చెప్పేరు' అని వీరు తప్పక నమ్మడం వల్ల నా?

"సామాజిక స్పృహ" గురించి వెక్కిరించే వాళ్ళు చలంగారు ఎంతో సామాజిక స్పృహతో రాసినప్పటికీ సామాజిక స్పృహ గురించ ఆయన్ని మాత్రం ఎందుకు వేళాకోళం చెయ్యరు ?

ఇంతా ఎందుకు చెప్తున్నామా అంటే 'సా. స్పృ' లేకుండా ఎవ్వరూ ఏ కల్పనా సాహిత్యం కాని సృష్టించరు. మానవ లోకం అంతా ఒక్కగా నొక్క సమాజంగా లేదు· అందులో వేర్వేరు సమాజాలు ఉన్నాయి. వేర్వేరు సమాజాల్లో వేర్వేరు రచయితలు ఉండటమే గాకుండా, ఏ సమాజపు బాగు కోసం ఆ సమాజపు రచయితలు ఉంటారు. 'మంటల చేత మాట్లాడిస్తాను' అనే ఆవేశంతో రాసిన కవి ఒక సమాజపు మంచి కోసం భీభత్స రస ప్రధానంగా రాస్తే 'ఊర్వశీ ఊర్వశీ నీతో ఊహాంచలముల కెగసితి' అని మరొక కవి. మృదు మధురంగా మరొక సమాజపు మనోహరణం కోసం రాసేరు, వారి సమాజపు మంచి కోసం వారు రాస్తే, వీరి సమాజపు సరదా కోసం వీరు రాసేరు. తొడలు చూపించే కోయ్యాలి పాడ్డం కోసం 'ఇందాహ్ ఇందా తీసుకో, ఇపుడే ఇపుడే తీసుకో' అదే పాట రాసిన కవి గారి బూతు సమాజం ఒకటైతే, 'నక్రిక సెట్టు కింద నరుడో భాస్కరుడా!' అని పాట పాడిన కవి గారి శోక సమాజం ఆ బూతు సమాజానికి భిన్నమైన, వ్యతిరేకమైన వేరొక సమాజం. ఏ రచయిత సామాజిక స్పృహ ఆ రచయితకి ఉండి తీరుతుంది. "అటువంటి స్పృహ నాకు లేదు. నాకు వ్యతిరేకమైన ఫలానా ఫలానా వారికి మాత్రమే ఉంది" అని చెప్పుకు తిరిగే రచయిత ఎంతో చాలా స్పృహతో ఉన్నాడని మనం గ్రహించుకోవాలి. అంతే కాని, ఆతగాడు స్పృహ లేకుండా మాట్లాడు తున్నాడని మనం అనుకున్నట్లయితే మనది చాలా పెద్ద పొరపాటే అవుతుంది.

"సా. స్పృ. గాళ్ళు" అని తిట్టే రచయితలు తాము ఏది రాసినప్పటికీ కూడా ఏమి రాయాలో ఏమి రాయ కూడదో తెలుసుకొనే రాస్తారు. బాగా ఆలోచించే

రాస్తారు. మానవలోకంలో ఎక్కువ పోట్లు చెమటించి సంపద సృష్టించే అధిక సఖ్యల్ని, మాయా మోసం చేసి లేదా వారిపై జులుమూ జబర్దస్తీ చలాయించి అల్ప సంఖ్యాకులు ఆ సంపద దోచుకుంటున్నారు. సామాజిక స్పృహ లేశమైనా సరే ఉన్న ప్రతి ఒక్కరికీ ఈ పరమ సత్యం తప్పక తెలుస్తుంది. "సామాజిక స్పృహ గాళ్ళు" అని తిట్ట బడే రచయితలు ఈ దోపిడీ వ్యవస్థ దుంప నాశనం కానిదే సర్వ మానవ సమాన సౌభ్రాతృత్వం అనేది సర్వత్ర సిద్ధించదు. అందుచేత ఆ దుష్ట వ్యవస్థని నాశనం చేసి తీరాలి అనే స్పృహతో రాస్తారు - మరైతే వాళ్ళని "సా. స్పృ. గాళ్ళు" అని వెక్కిరించే రచయితలు ఎటువంటి స్పృహతో రాస్తారని (రాస్తున్నారని) మనం తెలుసుకోవాలి? దోపిడీ వ్యవస్థ సర్వదా వర్ధిల్లాలే కాని అది 'ఛస్తే మారకూడదు' అంటే వారి అర్థం ఏమిటి అంటే! 'దోపిడీ కాబడే వాళ్ళు చస్తే చచ్చారు కాని దోపిడి దొంగలు మాత్రం నిత్యం వర్ధిల్లాలి, దోపిడీ వ్యవస్థ మాత్రం ఎన్నటికీ మారకూడదు!" అదీ ఆ అర్థం.

సా. స్పృ తో రాసే వారిని వెక్కిరించే వాళ్ళ ఉద్దేశం అది కాదు అని ఆ వెక్కిరించే వాళ్ళు చెప్తే చెప్ప వచ్చును. వారిది నిజంగా ఆ ఉద్దేశం కాకపోతే, మరి ఏ ఉద్దేశంతో వారు సా. స్పృ గల వారిని వెక్కిరిస్తున్నారో వారే సెల విప్వవలసి వుంటుంది. సెల విస్తారా ?

('స్వాతి' సపరివార పత్రిక ప్రారంభ సంచిక 17-8-84 సౌజన్యంతో)

---

## దొంక తిరుగుడు డంకెలోడ

— ఎం. జి. ఎం.

దొంక తిరుగుడు ఓరి డంకెలోడా !
　　కాచుకోరా కదిలింది పోరుదండ !!........॥దొంక॥ (2)
దోపిడోళ్ల ఎజెంటువై - దొంగ బుద్ధులెన్నొనేర్చి
బడుగూ దేశాల ప్రజల - బానిసలుగ మార్చేందుకు
కుట్రలెన్నొ జేసినావు - కుతంత్రాలు పన్నినావు
అదిగించి బెదిగించి - ఆఖరికి బెదిరించి
పెట్టుబడి దేశాల - పెత్తనమే పెంచేందుకు
　　భస్మాసుర హస్తంతో భూగోళం మండించా
　　ఎదురు లేని పేటెంట్లకు పదును నీవు బెట్టినావు ....... ॥దొంక॥
ఇందుగలా డందులేదు - సందేహం వలదంటు
అన్ని రంగాల మీద - అదుపు సంపాదనకై
ప్లానులెన్నో వేసినావు - ప్రపంచాన్ని పంచేందుకు
బహుళ జాతి కంపెనీల - భారీగ తెరవమంటావ్

దేశవాళి కంపెనీల - కాదరపే ఒద్దంటావ్
కార్మికులారా శ్రమశక్తికి - తగిన ఫలిత మొద్దంటవ్
శ్రమజీవుల శక్తినంత సులభంగా దోచుకొని
విదేశీ దోపిడోల్లు - మరింతా నువ్ బలువంటవ్....... ॥డొంక॥

ఆ దేశ వస్తువులను - ఈ దేశము లమ్మేందుకు
అదుపు లేవి ఒద్దంటవ్ - సుంకాలు రద్దంటవ్
మేలు రకం తయారిలని - భారిగ లాభాలు గుంజి
బడుగు దేశ ఉత్పత్తుల - బంధనాల్లో బంధించి
దివాళా తీయించి - దిక్కూ లేకుండ జేసి
విదేశీ మార్కెట్లను - వీలు నీవు పెంచివేయ
స్వదేశీ మార్కెట్లను గంగలోన ముంచేయ
స్పెషల్, సూపర్ చట్టాల - బూబోడిని చూపినావు ...... ॥డొంక॥

బడుగా దేశాలలోన - సృష్టించిన జీవకణాల్
క్రమంగ దోచుకెళ్ళి - కొత్త కొత్త పేర్లు బెట్టి
క్రొత్తగ సృష్టించామని - అధిక దిగుబడిస్తాయని
అంతులేని ధరలు బెంచి - విత్తనాల నమ్ముకొని
పండించిన పంటనంత - తిరిగి మాకె అమ్మాలని
పంటలోని కొంతన్నా - ఇత్తనాలు కుంచొద్దని
ప్రతి పంటకు బహుళజాతి విత్తనాలు కొనాలని
ఆంక్షలెన్నో బెట్టి నీవు - ఆగమాగం జేస్తున్నవ్....... ॥డొంక॥

పరిశోధన లాపివేయ - పలు రకాల ఉచ్చులేసి
అభివృద్ధి సాగకుండ - అడ్డంకులు సృష్టించి
సబ్సిడీలు రద్దంటవ్ - ఎరువుల ధర బెంచంటవ్
వ్యవసాయ మార్కెటంత - బహుళ జాతి పరమంటవ్
టెక్స్ టైలు సేవారంగం - మిగిలి ఉన్న వ్యాపారం
సామ్రాజ్యవాదులకు - సొంత మప్పగించాలని
నక్కజిత్తులెన్నో జేసి డొంకతిరుగు డెత్తులేసి
బడుగు దేశ ప్రజల నీవు బానిసలు జేస్తున్నవ్... .... ॥డొంక॥

కసాయోడ డంకలోడ కట్టిపెట్టు ఆటలన్ని
నిజము దెలిసి పేదలంత - ఎదురు పోరు నడుపుతుండ్రు
ఉరుములోలె ఉరుముకుంటు - పరుగు దీసి వస్తుండ్రు
దోపిడి దేశాల కుట్ర - బుగ్గిపాలు జేస్తుండ్రు

"గాట్" కొంత బలిసెటోళ్ళు - గుండె లదురగొడుతుండ్రు
ప్రజల మోసం జేసెటోల్లు - తన్ని కాటి కంపుతుండ్రు
దొంక తిరుగుడు ఓరి డంకెలోడా
కాముకోరా కదిలింది పోరుదండు
దొంక తిరుగుడు ఓరి డంకెలోడా
కాముకోరా కదిలింది జనం దండు ||దొంక||



గల్పిక

డిశంబర్ 10- మానవ హక్కుల దినం సందర్భంగా :

# మానవ హక్కుల కమిషన్

— బజరా

కుళ్ళిపోయిన శవాలకు కుట్లు వేద్దామని కూర్చున్నారు వాళ్ళు! తుక్కు తుక్కయిపోయిన మాంసానికి తూకవ వేద్దామనుకున్నారు వాళ్ళు! ఇంకిపోయిన రక్తానికి 'బ్లడ్‌గ్రూప్' వెతుకుతున్నారు వాళ్ళు! మృతకళేబరాల కంఠాలకి "మానవ హక్కుల కమిషన్" పతాక టోపీలు తగిలించారు వాళ్ళు!

"హిట్లర్ కంటే హీరో ఎవరా ?" అని ఇండియాలో చర్చ వచ్చింది. అదీ తేలిపోతే తుపాకీ రాజ్యం తరుపున భారతదేశ ప్రతినిధి జెనీవాలో 49వ సమావేశానికి వెళ్ళాలి మరి. ఇక్కడా పోటీ వచ్చింది.

ఒక అపర రాముడున్నా వాడు ఎక్సుపార్టీ వోడు. హేంలు ఎందరో వున్నా హోంవర్కు వుంది వాళ్ళకి. ఏ వర్కూ లేనోడు....వున్నది పాడిన, ఊడ గొట్టిన మంచం కోడొకటి తేలింది. కేంద్రమూ కూడబలుక్కొని అంధ్రం నుండి "ము(జె)న్నా! వాళ్ళకి నువ్వే సరిజోడు" అంది. నిజమేనని నరమాంసం గుప్పున ముక్కుల్లో దూరి సాక్ష్యం పలికింది.

"ఐక్యరాజ్య సమితిగోరు అర్హతలడుగుతారేమో?!" అడిగాడొకడు. అంతే అంతెత్తున లేచాడు. ఆ లేవడంలో 1990లో హైదరాబాద్‌లో 200ల మందిని లేపి, తను 'మంత్ర దండం' పొందిన ఘనతవుంది! గుమ్మున నోరు మూసి గుడ్లు నిలేసారు మిగతా వోళ్ళు.

"అర్హతలడిగినోడు అయిన పార్టీ అయిందు మల్ల, లేపోతే బాంచెన్.... ఆడే పౌర హక్కుల పోరగాడో, జర్నలిస్టు కుర్రగాడో అయితే అలవాటుగ నెత్తురు మింగుదును"....

"సెబాస్!.... అందుకే నిన్ను వెళ్ళమన్నది...." 'నర'సింహం.

వాషింగ్టన్‌లో టన్నుల కొద్దీ వాషింగ్ పౌడరు విడుదలయింది. 'జెన్నా వారి పవర్' తెల్పుతూ ఏది ఎన్నిపాళ్లో తెల్పింది. ఎన్‌కౌంటర్లు- 328; లాకప్ డెత్‌లు- 43. చుండూరు- 16..... ఇలా! రెండేళ్ళలినా తన ప్రతాప వి స్తరణకు గర్వపడుతూ వివరాలు ఇంకా పూర్తిగా లేనందున కొంచెం బాధ పడ్డాడు.... అందుకేనేమో 'ఆసియా వాచ్' మీద మండి పడ్డాడు.

మానవ హక్కుల కమిషన్- సమావేశంలో నాన్‌విజ్ తింటూ విజిటేరియన్ గురించి బహు చక్కగా మాట్లాడాడు. 'ఆసియా వాచ్' అరిచింది. ఆ అరుపుకు డిస్టర్బెన్సయినా, మెచ్చుకోకుండా వుండలేకపోయాడు. కారణం ఆ కేటలాగు వల్లే తను ఎంపికయ్యానని!

(29-09-93 నాడు 'మానవ హక్కుల కమిషన్'ను భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన దృష్ట్యా 'చెద'రంగంలో మరో గడిలో వెనిక్కి చూస్తూ....)

## రాసినవాడు పల్గుణుడు

— చందు సుబ్బారావు

బిగించిన తీగె గాలికి 'కుయ్' - మన్నట్లుండే కంఠం
గుండె కండరాలను 'ఎక్స్‌రే' తీయగల సులోచనాల కళ్ళు .... 'సెడక్టివ్' చిరునవ్వు !

పట్టు తేనె లాంటి పలుకు ... పొట్ట క్రిందుగా బెల్టు ....
విశాఖ లీగర్ ఆసుపత్రిలో పెరిగిన అశ్వత్థ వృక్షం .... అక్షరాలతో ఆయుధ పూజ !

కాస్త వగరు .... కూస్త పొగరు .... రీడర్ నరాల జ్వరం పుట్టించే 'విగరు'

అండర్ వరల్డ్ అభాగ్యుల కన్నీళ్ళను చిత్రించిన అథారిటీ ....
ఆలోచన్ల అడవి కొండల మీంచి దూకిన కవిత్వం
పెరిగి పరుగులు తీసి నిశ్చలంగా స్రవించిన వచన రచనా ప్రవాహం
అనది .... అతనిది !

గుహాంతర న్యాయం నల్ల చీకటి గొన్లు ....
మెళ్ళో తెల్ల పీలికల పీకల మేషాండ భ్రమల కోసిన చురకత్తి ....
అమాయక పోలీసు హరిశ్చంద్రుల వేధించే నక్షత్ర శిఖామణి .... దీక్ష దక్షత ....

రొట్టె ముక్కలు .... బల్ల చెక్కలు .... సుబ్బయ్య అల్పాంతరంగంలో
రగిలిన కదలి సుడిగుండాలు
నిశ్చేతన చేతన శర్మల ఖుషీ విషాదాల నిజాలు .... రుజాగ్రస్త కల్లోలినీ
కారుణ్య తరంగాలు

బాధలు .... రోదనలు .... ఆశలు .... దుఃఖాశ్రువులు ....
పిచ్చుకల నేరాల ఫుళ్ళు .... శిక్షల కత్తుల సర్జరీ జైళ్ళు ....
ఏడ్పులు .... నిట్టూర్పులు .... కలసి కాచి వడపోసిన డికాషన్ ....
సాహా .... వి.శా. త్రాగించిన సిరా నిషా విశేషాల సరిగమలు
రస రాజ యోగి పెద నాయన్ల రహస్య ఫాతీలపై కదిలిన కలం 'బాకు'
రుస రుసరు

'సిక్స్ టీ'లో అతని పెన్ను 'సెక్స్‌టీన్' పరవళ్ళు ....
చిలికిన లేతాకు మనస్సుల చిరు కోర్కెల బుస బుసలు
"రాసినవాడు ఫల్గుణుడు .... అవశ్యము రాయగలంగ లేరు
హెచ్చకు కుందగున్ ... పుచ్చు కలాలు పీనుగ పెంటలై చచ్చును."
చెమట బిందువులకు 'డిఫెన్స్' .... చేవ తీరిన మన తెలుగు 'డికెన్స్'
విష్ హిమ్ ఆల్ సక్సెస్ .... అతడెక్కిన శిఖరాలు మనవే !
అతడు నడచిన బాట నేషనల్ హైవే !!

(రావి శాస్త్రి షష్టిపూర్తికి "ఆంధ్రజ్యోతి" వారపత్రిక 6-8-82 లో ప్రచురణ
అయిన కవిత.)

"రావిశాస్త్రిగారి అనేక రచనలు చదివి వారిని మౌనంగా మెచ్చుకొన్నాను. వారి సాహితీ ప్రతిభ, కథా శిల్పం, దళిత మానవులపై ఆదరం, అన్యాయాన్ని ఎదుర్కోవటం, పీడిత ప్రజలపై కారుణ్యం మొదలైన వారిలోని ఉజ్వల గుణాలు నచ్చుతుండేవి— రావిశాస్త్రిగారు సృష్టించిన పాత్రలన్నీ వారిలో ప్రత్యక్షం కావాలని ఆశించటం విజ్ఞతకు లక్షణం కాదు. రచయిత తనలో వున్న పాత్రలనే కాక తనలో లేని పాత్ర నెన్నిటినో సృష్టిస్తాడు. తనలో లేని పాత్రలను సృష్టించ కలిగిన రచయితే నిజమైన స్రష్ట. శాస్త్రిగారు అంతే."

— సంజీవదేవ్

# "సొమ్ములు పోనాయండి"లో పాలనా యంత్రాంగం

— వల్లంపాటి వెంకట సుబ్బయ్య

ప్రభుత్వ పాలనా యంత్రాంగం ఒక ముక్కాలి పీట. చట్ట సభలూ, కార్య నిర్వాహక శాఖా, న్యాయ శాఖా ఆ పీటకున్న మూడు కాళ్ళు. చట్ట సభలు చట్టాలు చేస్తాయి. ఆ చట్టాలను కార్య నిర్వాహక శాఖ అమలు పరుస్తుంది. అమలు పరచటంలో ఎవరికైనా అన్యాయం జరిగితే న్యాయ శాఖ జోక్యం చేసుకుంటుంది. మరో రకంగా చెప్పాలంటే చట్ట సభలు ప్రజలకు హక్కులిస్తాయి. ఆ హక్కుల్ని కార్య నిర్వాహక శాఖ ప్రజల వద్దకు తీసుకు పోతుంది. చట్టాలకు సరైన వ్యాఖ్యానం చెప్పటం ద్వారా న్యాయ శాఖ ప్రజల హక్కులకు రక్షణగా ఉంటుంది.

ఇది సిద్ధాంతం- బయటికి ప్రజాస్వామికంగా, ఉదారంగా, మానవతా దృక్పథంగా కనిపించే సిద్ధాంతం. కానీ "ప్రజలు", "హక్కులు", "న్యాయం" మొదలైన పదాలకు వాస్తవంగా కనీసం రెండర్థాలుంటాయి. ఆ అర్థాలు దేని మీద ఆధారపడి ఉంటాయో ఆలోచిద్దాం.

"సొమ్ములు పోనాయండి"ని ఉదాహరణగా తీసుకుంటే "ప్రజలు" ఎవరు? ప్రెసిడెంటా, దాసరి బోడిగాడా? హక్కులంటే మిరపకాయల చిన్నారావువా, బోడిగాడి బావమరిదివా? న్యాయమంటే కరణం చెప్పిందా, బోడిగాడి జగిలీడు చెప్పిందా? ఇలాంటి ప్రశ్నలు వేసుకుంటూ వెళ్ళితే వర్గ స్వభావం అంటే ఏమిటో తెలుస్తుంది. చట్టాలు చేసే పెద్దలు తమకు అనుకూలంగా ఉన్న చట్టాలనే చేస్తారనీ, కార్యనిర్వాహక శాఖా, న్యాయ శాఖా గూడా చట్టాలు ఎవరి సౌకర్యం కోసం రాయబడ్డాయో వారికి అనుకూలంగానే అమలు చేస్తారనీ, వ్యాఖ్యానిస్తారనీ గూడా తెలుస్తుంది. ఈ విషయాన్ని అర్థం చేసుకునే కాబోలు ఛార్లెస్ డికెన్స్ రాసిన "ఆలివర్ ట్విస్ట్" (1838) అన్న నవలలో మిస్టర్ బంబుల్ అన్న దగాకోరు కూడా "Law is an ass, an idiot" అంటాడు. అదే నవలలో "ఆర్ట్‌ఫుల్ డాడ్జర్" అన్న పిల్లదొంగ కోర్టులో తాను చెప్పుకోవలసింది ఏమీలేదని చెబుతూ "The court is not the shop for justice" అంటాడు.

ఒక్కోసారి చట్ట సభలూ, కార్యనిర్వాహక శాఖా, న్యాయ శాఖా తీవ్రంగా ఒకదాంతో మరొకటి పోట్లాడుకుంటున్నట్టు మనకు అనిపిస్తుంది, వాస్తవానికి ఆ పోట్లాట లాలూచీ కుస్తీ లాంటిది. ఎప్పుడైనా ఈ శాఖలు నిజంగానే తమలో తాము పోట్లాడుకుంటే వాళ్ళ ప్రాతినిధ్యం వహిస్తున్న వర్గంలోనే ఎవరి హక్కులకు న్యాయం చేయాలని మాత్రమే ఉంటుంది. కాబట్టి సమాజంలో ఉన్న వారందరూ ప్రజలు కారు. అందరికీ హక్కులుండవు, అందరికీ న్యాయం జరగదు.

మన దేశంలాంటి "ప్రజాస్వామ్య" దేశాల్లో ఉన్న హక్కుల్లో అత్యంత ప్రధానమైంది ఆస్తి హక్కని చట్టాలు చెబుతాయి. "సొమ్మలు పోనాయండి"లోని ప్రెసిడెంటుకు వందలాది ఎకరాల పొలం ఉంది. దానికి అవతలగా చిన్న రామ్మూర్తి అనే వాడి పొలం రెండెకరాలుంది. దాన్ని అతడు ప్రెసిడెంటుకు స్వాధీన తనఖా ఉంచాడు. అతడు చితికిపోయి ఉండటం చేత అతడు దాన్ని విడిపించుకునే అవకాశం లేదు. ప్రెసిడెంటు పొలానికి, చిన్న రామ్మూర్తి పొలానికీ మధ్య దాసరి బోడిగాడి పొలం నలభై సెంట్లుంది. దాన్ని ప్రెసిడెంటు దఖలు పరిచేసుకుంటే అతడు తన భూముల్ని "ఏకాండంగా" సాగు చేసుకోవచ్చు. "సొమ్మలు పోనాయండి"లోని కథంతా ఆ నలభై సెంట్లని కబళించటానికి జరిగిన తతంగమే. కాబట్టి ఆస్తి ఉన్నా-మరీ ముఖ్యంగా అది చిన్న ఆస్తిగా ఉంటే-ఆస్తి హక్కు మాత్రం అందరికీ ఉండే అవకాశం లేదు.

ఈ భూమికి సంబంధించిన కథనంతా దాసరి బోడిగాడు జైల్లో ఉన్నప్పుడు ఉత్తమ పురుషలో చెబుతాడు. అతని కథనం ఇలా ప్రారంభమౌతుంది:

"సొమ్మలు పోనాయండి
అదండి ఆరాంబ(మండి
ఔత పోతులండి
జనం నిలబడి సూసే వోరండి
అలాంటి సొమ్మలండి, పోనాయండి"

సొమ్మలు (ఎద్దులు) పోవటానికి కారణం కథకు చాలా ముఖ్యం. ప్రెసిడెంటు వద్ద మూడు వందలు అప్పుగా తెచ్చి బోడిగాడు ఆ ఎద్దుల్ని కొన్నాడు. ఇచ్చింది మూడు వందలే అయినా కరణం పత్రాన్ని ఆరు వందలకు రాశాడు. ప్రెసిడెంటు ముందుగా బోడిగాడి ఎద్దుల్ని మాయంచేసి ఆ తరువాత అప్పు తీర్చమని (మూడు వందలు కాదు, ఆరు వందలు) బలవంతం చేసినప్పుడు ఎద్దుల్ని అమ్మి అప్పు తీర్చే అవకాశం లేకుండా చేస్తాడు. మొగుడి నిస్సహాయతను చూసి ఓర్చుకోలేని బోడిగాడి భార్య సంద్రాలు ప్రెసిడెంటును తిడుతుంది. ప్రెసిడెంటు ఏమీ మాట్లాడడు కానీ అతని అన్నకొడుకు చిన్నారావు సంద్రాలును కొడతాడు. భార్యను పరాయి మొగవాడు కొట్టటాన్ని భరించలేని బోడిగాడు చిన్నారావు మీద కర్ర తిరగేస్తాడు. చిన్నారావు బోడిగాడి మీద మాత్రమే కాకుండా, అతని పెళ్ళాం ముత్యాలు మీదా, కూతురు చిలక మీదా కేసు పెడతాడు. అలా అప్పు కేసుకు క్రిమినల్ కేసు జత కలుస్తుంది. ఆ తరువాత అరెస్టులు, ఆస్తి సర్టిఫికేట్లు, జామీన్లు, బెయిలు, వాయిదాలు సాగుతూనే ఉంటాయి. ఈలోగా నాటుపిల్లలంటే మోజున్న తాసిల్దారూ, డి.ఎస్.పి, వాళ్ళ నేస్తాలూ కలిసి చిలకను ఎత్తుకుపోయి, మానభంగం చేసి, రైలు కింద పడేస్తారు.

తన జగిలీడు కేసులో నుంచీ జారిపోకుండా ఉండాలనీ, తన నలభై సెంట్ల మడి చెక్క ప్రెసిడెంటుకు దక్క కూడదని బోడిగాడు దాన్ని అతని పేర క్రయ పురోణీ రాసిస్తాడు. ఈ విషయం తెలుసుకున్న ప్రెసిడెంటు బోడిగాడి జగిలీడి వద్ద నుంచీ ఆ పురోణీని భయపెట్టి తన పేర బదిలీ చేయించుకుంటాడు. దాంతో ఒక రకంగా కేసు మలుపు తిరుగుతుంది.

క్రిమనల్ కేసులో బోడిగాడికి శిక్ష పడుతుంది. అతడు అపీలుకు వెళ్తాడు. ఈలోగా రాజీ ప్రయత్నాలు జరుగుతాయి. తన మడి చెక్కను వదులు కోవటానికి బోడిగాడు సిద్ద పడతాడు. సెంటుకు వంద రూపాయల చొప్పున డబ్బు చెల్లించే టట్టూ, క్రిమనల్ కేసు రాజీ చేసుకునేటట్టూ ఒప్పందం కుదురుతుంది. అన్ని రకాలుగా చితికిపోయిన బోడిగాడు అప్పులు తీర్చేసి మిగిలిన డబ్బు తీసుకొని పట్నం వెళ్ళి పోవటానికి సిద్ధపడతాడు. విక్రయం రాసుకోవటానికి ముందు పొలాన్ని కొలిచిన కరణం అది నలభై సెంట్లు కాదు, ముప్పై సెంట్లే ఉందంటాడు. అంతకు ముందు కొలిచినప్పుడు నలభై సెంట్లుండి ఇప్పుడు ముప్పై మాత్రమే ఎందుకుందని బోడిగాడు గట్టిగా ప్రశ్నిస్తే కరణం జవాబు చెప్పడు. అంతటితో రాజీ ప్రయత్నం విఫలమై పోతుంది.

బోడిగాడి జగిలీడు క్రయ పురోణీ ప్రెసిడెంటు పేర బదిలీ చేసిన రోజే పొలం ప్రెసిడెంటు స్వాధీనంలోకి వచ్చిందని కరణం వాదిస్తాడు. పొలం తన స్వాధీనం లోనే ఉందని బోడిగాడు చెబుతాడు. ఆ మాటను అతని జగిలీడు బలపరుస్తాడు.

కొన్ని రోజుల తరువాత చిన్నారావు కిరాయి రౌడీల సహాయంతో పొలాన్ని దున్నటాని కొస్తాడు. బోడిగాడు, అతని భార్య, బావమరిది, జగిలీడు వాళ్ళను ఎదు ర్కొవటంతో దొమ్మి జరుగుతుంది, బోడిగాడు చిన్నారావును నరికేస్తాడు. సంద్రాలునూ, బోడిగాడి జగిలీణ్ణీ కిరాయి రౌడీలు చంపేస్తారు. బోడిగాడు బావమరిది తీవ్రంగా గాయపడతాడు. ఈ అన్యాయాన్నిచూసి రెచ్చిపోయిన ప్రజలు ప్రెసిడెంటు ఇంటికి నిప్పు పెట్టేస్తారు. బోడిగాణ్ణి అరెస్టు చేస్తారు.

ఈ కథను జైల్లో ఉన్న బోడిగాడు చెప్పి, చివరికిలా అంటాడు: "అయితే నేల్లెండి. జామీ నిస్తే బయటి కెళ్తాను. ఇయ్యకపోతే గోడలు గుద్ది బద్దలు కొట్టైనా బైటికెళ్తాను. ఎల్లి పెసిడెంటుగోణ్ణి నరుకుతాను. నరికి ఆ నెత్తురు నా పెల్లం నేల కొరిగిన చోటా, నా జగిలీడు పేనాలి డిసిన చోటా నా బూదేవత మీద జల్లుతాను, విందుకు తిరుగులేదు. విదీ నా మాట. ఉత్తమాట కాదు. విదీ చిలాచ్చరాల మాట."

ఇదీ సూక్ష్మంగా "సొమ్ములు పోనాయండి"లోని కథ. ఆస్తి హక్కును గురించిన ఆలోచన ఇందులోని కథా వస్తువు. చట్టప్రకారం ఆస్తి హక్కు అందరికీ ఉన్నా రాజ్య వ్యవస్థలు-పరిపాలనా యంత్రాంగం-దాన్ని ఎవరికి పరిమితం చేస్తాయి అన్నది కథాంశం.

ఈ కథలో ఒక వైపు బోడిగాణ్ణి, మరొక వైపు పాలనా యంత్రాంగాన్నీ ఉంచి పరిశీలిస్తే పాలనా యంత్రాంగం స్వభావం బయట పడుతుంది.

ఇందులో పంచాయితీ బోర్డు ప్రెసిడెంటూ, గ్రామ కరణమూ గ్రామ స్థాయిలో ప్రభుత్వ పాలనా యంత్రాంగానికి చెందిన ప్రతినిధులు. గ్రామ ప్రజల హక్కుల్ని రక్షించటం వీరి బాధ్యత. కానీ వాస్తవానికి వీరిద్దరూ ప్రజా కంటకులుగా తయారయ్యారు. ప్రెసిడెంటు అర్థ బలానికీ, అతని అన్న కొడుకు చిన్నారావు కండ బలానికీ కొంతంత అండ గ్రామంలోని భూముల లెక్కల్ని తారుమారు చేయగల కరణంది. తప్పుడు నోట్లూ, తప్పుడు భూముల లెక్కలూ రాసి అతడు వారి దోపిడీకీ, దౌర్జన్యానికీ సహకరిస్తుంటాడు. లంచగొండితనం అతనిలోనే కాక అతని కుటుంబంలోగూడా ఎంతగా జీర్ణమైపోయిందో రావిశాస్త్రి ఒక చిన్న ఉదాహరణంతో చూపించాడు. ప్రోనోటు సంగతి మాట్లాడటానికి ఓ మధ్యాహ్నం పూట బోడిగాడు కరణం ఇంటికెళ్తే అతడు నిద్ర పోతుంటాడు. అతణ్ణి నిద్ర లేపమని అతని కొడుకుతో చెబితే ఆ కుర్రాడు పావలా లంచం అడుగుతాడు. పావలా తన దగ్గర లేదని పది పైసలు లంచంగా ఇచ్చాకే వాడు తండ్రిని నిద్ర లేపుతాడు. అలా వ్యవస్థలోని లంచగొండితనం కరణం కుటుంబంలోకి - మరీ కాబోయే కరణంలో ప్రవేశించి స్థిరపడిపోయింది.

గ్రామస్థాయిలో ప్రభుత్వ యంత్రాంగం ఇలా ఉంటే తాలూకా, జిల్లా స్థాయిలో మరింత ఘోరంగా, క్రూరంగా ఉంది. బోడిగాడి కూతురు చిలక మీద అత్యాచారం చేసి, హత్య చేసిన వాళ్ళు కార్యనిర్వాహక శాఖ ఉన్నతోద్యోగి అయిన తహసిల్దారూ, శాంతిభద్రతల శాఖ ఉన్నతోద్యోగి అయిన డి.ఎస్.పి. అవినీతి ప్రభుత్వ యంత్రాంగానికి దోస్తీ ఎవరితోనో కూడా రావిశాస్త్రి చక్కగా చూపించాడు. చిలక మీద అత్యాచారం చేసిన జట్టులో ఒక బ్రాందీ షాపు యజమానీ, మరొక లారీ ఓనరు ఉన్నారు. అవినీతి ఉద్యోగులకూ, దౌర్జన్యం చేయ గలిగిన బలం ఉన్న ధనవంతులకూ మధ్య బిగిసిపోతూ ఉన్న అనుబంధాన్ని రావిశాస్త్రి ఈ విధంగా చిత్రించాడు.

ఇక న్యాయ శాఖ సంగతి సరేసరి. న్యాయ శాస్త్రానికున్న వర్గ స్వభావాన్ని రావిశాస్త్రి తన కథల్లో, నవలల్లో, నాటకాల్లో స్పష్టంగా చూపించాడు. "బొమ్మలు పోనాయండి"లో కూడా న్యాయ శాఖ అసలు స్వరూపం నగ్నంగానే దర్శనమిస్తుంది. బోడిగాడు చెప్పినట్లు "ఆడికి (ప్రెసిడెంటుకు) టౌనంట ఈడికి ఇద్దరు ముండలున్నట్టే సేతి కింద ముగ్గురు ప్లీడర్లున్నారు." ఇతర కేసులు లేకపోయినా వాళ్ళరు. జీవనం జరగటానికి ప్రెసిడెంటు పెట్టిన కేసులు చాలట. అంటే తనకు నచ్చని వాళ్ళను అణగదొక్కటానికి వాళ్ళను కోర్టుకు లాగటం ఒక విధానంగా అనుసరిస్తున్నాడన్నమాట. బోడిగాడు గూడా మొదటిసారి కోర్టుకు వెళ్ళినప్పుడు అక్కడ

పాతావరణాన్ని చూచి బెంబేలు పడిపోతాడు. పోసుగుడు గాళ్ళ (బ్రోకర్లు) ముసురు కుంటారు. పోలీసోళ్ళు గూడా "అళ్ళకాడి కెళ్ళండి, అళ్ళ మాటినుకోండి" అని ప్రోత్సహిస్తారు. గచ్చకాయ వాగుడు బెంచి గుమాస్తా, కేసులోని వాస్తవాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించని న్యాయాధిపతీ, ప్రెసిడెంటుకు అనుకూలంగా ఉండేలా రాజీ చేయటానికి ప్రయత్నించిన ప్లీడర్లూ, పేదలు భరించలేని కోర్టు ఖర్చులూ, ప్లీడర్ల ఖర్చులూ, కేసులు తేలటంలో కోర్టుల్లో జరిగే ఆలస్యం - ఇవన్నీ కూడా కోర్టులు ఎవరికి అందుబాటులో ఉన్నాయో స్పష్టంగా చూపుతాయి. ఈ విషయాన్ని నిరూపించటం కోసం రావిశాస్త్రి మరొక సంఘటనను ప్రస్తావించాడు. దొమ్మీ జరిగిన తరువాత బోడిగాడితోపాటు కంటి తుడుపుగా ప్రెసిడెంటును కూడా అరెస్టు చేస్తారు. దుర్మార్గుడైన అతనికి కోర్టు జామీనిస్తుంది. కానీ ఆ దుర్మార్గానికి బలైపోయిన బోడిగాడికి ఇవ్వదు.

"ఆరు సారా కథలు", "మూడు కథల బంగారం," "రత్తాలు - రాంబాబు," "నిజం" మొదలైన ఎన్నో రచనల్లో రావిశాస్త్రి రాజ్యంయొక్క స్వభావాన్ని చక్కగా చూపించాడు. "సొమ్ములు పోనాయండి"లో మరో అడుగు ముందుకు వెళ్ళి రాజ్యం యొక్క స్వభావం, అంటే రాజ్యం యొక్క వర్గ దృక్పథం, ఏ సామాజిక ఉత్పత్తి సంబంధాలలో నుంచి పుట్టిందో చక్కగా చూపుతుంది. అంతే కాదు ధనబలం, కండ బలం ఉన్న దోపిడీ వర్గం ప్రయోజనాలను ప్రభుత్వ యంత్రాంగం ఎంత పటిష్టంగా రక్షిస్తూ ఉంటుందో కూడా ఈ నవలిక ప్రదర్శిస్తుంది, కర్తవ్యాన్ని బోధిస్తుంది.

---

"మార్క్సిజాన్ని విమర్శించాలనే వాళ్ళు నాలాటి వాడి వ్యసనాల్ని చూసి చూపేకన్న నమ్మింది ఆచరించిన వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం మొదలయిన వారి ఆదర్శం పాటించితే మంచిది. ఒక గొప్పవాడి గొప్ప, మంచివాడు చెప్పినా, చెడ్డవాడు చెప్పినా ఒకటే. అలాగే మార్క్సిజం గొప్ప మార్క్సిజానిదే గాని చెప్పేవాడిని బట్టి మారదు."

—రావిశాస్త్రి

(తుమ్మల వేణుగోపాలరావు గారితో సంభాషణతో)

గల్పిక :

# నాపానంలో సంగోరు యిచ్చినా ?

ఎ. బి. సుందరరావు

"బాబూ ! చాత్రి బాబు నేరేటండి! ఓ, సారి - ఓ సిటం సేపు అగిపెంటుగా మాటాడాల! .... బేగి పిలవండి బాబూ"....

"ఎవరమ్మా నువ్వు!.... ఆయన్తో నీ కేంటి పని....?"

(పాపం ! ఎవరో ఏంటో.... అసలు సంగతి చెబుతే ! అయినా చెప్పడం తప్పదు కదా ! ఇంకా గుమ్మంలో కాలుపెట్టి పెట్టకుండా - చెప్పేస్తే - ఏం బాగుంటుంది. ఏదో సామెత చెబుతారే ! చావు కబురు చల్లగా చెప్పేస్తే బావుంటుందని నా ఉద్దేశం. అయినా ఈ శాస్త్రితో గొప్ప చిక్కొచ్చి పడింది. ఎవరు బంధువులో - ఎవరు స్నేహితులో, ఎవరు కావాల్సినవారో, ఎవరు అక్కర్లేని వాళ్ళో - పీడూ వాడని లేదు .. అందరితోనూ బిజీయో. అక్కర్లేని వాళ్ళు లేరు. కుర్రాళ్ళు, ఆడపిల్లలు - కండువా — ఖద్దరు చొక్కాగాళ్ళు - ముసిలాళ్ళు - పడుచువాళ్ళు - కవులు, క్లయింట్లు, ఆఫీసర్లు - పోలీసులు. గమ్మత్తేంటంటే - ఏ వయస్సు కావయస్సు వాళ్ళతో - యిమిడిపోతూ సరదాగా, సీరియస్‌గా, సిన్సియర్‌గా మెసుల్తూ ఎడ్జస్టయిపోతూ - చేస్తూ వృత్తినీ - ప్రవృత్తినీ - జోక్స్‌నీ - అష్టావధానం చేస్తూ - తప్పించుకు తిరుగుతూ - టైం టేబిల్‌కి కట్టుపడకుండా — యింత మందితో సతతమయ్యే మనిషి.)

ఈ అమ్మ ఎవరని చెప్పాలి (ఉండి వుంటే) - చెబితే మాత్రం తెలుస్తుందా?- నా అనుమానం పటాపంచలయింది - ఆమె సమాధానంతో.

"ఉప్పు పత్తిరీ లేనోల్లం; ఎవలని సెతితే ఏటి తెలుసుద్ది - తమరే ఓ సిటం బాబుని బయటకి పార్రమ్మని సెప్పండి - నా నొచ్చానని... కోరుటుకి టయం అయిపోనాదని ?

'బహుశా ఎవరో క్లయింటు - స్త్రీ - ' అని చెబుతే చాలేమో ...

"బాబూ! తమరు కొత్తగా వచ్చిన్రా ! గద్గదీ సంగతి - ఇలాగయితే.... ఛాత్తుర్లు బాబంత ఎదగనానికి తమకి శానా కాలం పట్టేస్తది. ఎవరెవరో ఎరిక నేకపోతే ఏటని సెప్పేది; మాము మామే! ఛాత్తుర్లు బాబు బాబే! కేసులు మాము అప్పసెపతాం - కోర్టుల్లో ఆయన వాదిస్తాడు అస్సలు కేసులా మాము సెపతామేటి ? - మా మొఖాలు సూసి కేసేటో ఆయనే సూత్తాడు - నా వొంతు ఏలి ముద్దర పెట్టేడమే.

"ఇహ నా పేరేటి అంటావా? - ఏ పేరని సెప్పేది? కేసును బట్టి కేసుకో పేరుంటది. ఆ పేర్లన్నీ ఆయన పెట్టినదే! ఇయ్యాల పేరు రేపుండదు. అస్సలు నా పేరు నాకే తెలవదు - మా అమ్మా - బాబూ ఎవరో తెలుస్తే కదా నా పేరే పెట్టారో ఎరికవడానికి -

"మా కేసులంటావా? - కేసేటో నాకే తెలవదు.... మాటకి - ఇంటి కాడ మా యజమానితో అంబలి తాగుతున్నాను అనుకో - ఇంతలో పోలీసాడు ఒచ్చి బరబరా లాక్కుపోతాడు. మర్నాడు పేపర్లో నాను ఏదో లాడ్జిలో ఎవుడుతోనో తొంగున్నట్టు కేసు - సరేలే - కలో గంజో-ఇంటి కాడయితే నేటి-జెయిలులో అయితే నేటి సావనేక బతకాల - బతకాలి కాబట్టి సావ లేము -

"ఛాత్రి బాబన్నట్టు - మాలాటి వోల్లు సత్తే - రైల్లాగిపోవు. బస్సులు తిరగడం మానవు — రోడ్డు మీద మనుసులు నడవక పోరు-లోకం బందయిపోదు- సూరీడు పొద్దు పొడివక మానడు - గుంకకనూ మానడు.

"ఓ పాలి ఏటయిందంటే-ఏవో కేసుకని వొచ్చాను. ఛాత్రి బాబు ఎవలుతోనో బాతాఖాని ఏత్తన్నాడు. నాను పల్లక కూకున్నాను - అందునేవో కతలు రాత్తాడంట. అయీ తుదీ మొదలూ వుండవట - ఎక్కాన్నుంచేనా సదవొచ్చట. ఎక్కాడునుంచేనా మానే యొచ్చట - పూర్తిగా సద వొచ్చు - మాన వొచ్చు. అంటే ఏటన్న మాటా? - ఎంత మట్టుకు సదువుతే అక్కాడ కదే బాగుంటుదట. ఇయ్యన్నీఎందుకు సెబతన్నా నంటే - మా బతుకులూ అలాంటియ్యే.

"నానేదో ఒగుతున్నాను. నానొచ్చిన పనేటో మరిసిపోనాను ఏటి సెప్ప మంటావు .... ఇంతకీ బాబున్నాడా ....నేడా?

"ఏటయి పోనాడు .... ఏటీ? ఏటంటున్నావూ? మరి నేడా! అస్సికాలు ఆడుతున్నవా? తప్పు బాబూ .... తప్పు ....! మాలాటి వొల్లతో ఆసికాలేటి? - ఏటీ - మరి మాలోటి వోల్లు ఎందులో పడి సావాల - మమ్మల్నొగ్గేసి యాడకి పోనాడు ఛాత్రి బాబూ!-ఆ దేవుడు అడిగితే నా పానంలో సంగోరు ఛాత్రి బాబు కిచ్చినా? నాయానికి రోజులు కావు స్మీ! నా నేటి సేతును. తండ్రో!...." ●



"ఏ దేశంలో ఏ మారుమూల ఏ కోర్టుకి వెళ్ళి చూసినప్పటికీ అక్కాడ కనిపించే పోలీసులూ, బంట్రోతులూ, గుమాస్తాలూ అంతా కూడా పీడించడానికి యముడు పంపిన స్పెషల్ టైప్ పిశాచాల్లా వుంటారే తప్ప మనుషుల్లా కనిపించరు. మనుషుల్లా ప్రవర్తించరు."

—రావిశాస్త్రి

('తలుపు గొళ్ళెం')

# 'బల్ల చెక్క' లోతు

—గోపరాజు నారాయణరావు

మనిషిని ఇంకో మనిషి మోసం చేసెయ్యడం, సాధు జంతువుల్లాంటి వాళ్ళ మీద తోడేళ్ళ వంటి గజ తెలివైన వాళ్ళు బతికెయ్యడం, ఈ తోడేళ్ళ మీదేమో పులి లాంటి గడుసు వాళ్ళు స్వారీ చేయడం ముందు నుంచీ వున్నదే. ఇలా బతికెయ్యడానికి సమృద్ధిగా కావలసిన వనరుకే జన సామాన్యంలో వున్న ముద్దు పేరు 'లాభం'. శాస్త్రాలు, సిద్ధాంతాలు, నాగరికతలు పెరిగిపోయిన దరిమిలా సిద్ధాంతవేత్తలు, తాత్త్వికులు 'లాభం' అంటే మరేం కాదు. 'దోపిడి' అన్నారు. అదెలాగంటే 'మిగులు విలువ' గురించి తెలుసుకోవాలన్నారు. ఇది అందరూ అర్థం చేసుకోవాల్సిందే ననిపిస్తుంది. కాని, పిల్లి అంటే ఏమిటంటే మార్జాలం అని, మార్జాలమంటేనో అనడిగితే బిడాలమని అర్థం చెప్పేసి మన దేవవాళీ మార్క్సిస్టులు దీన్ని మేడ్ డిఫికల్ట్ చేసేశారు. దీన్ని సున్నితంగా, చక్కగా, సుఖంగా వివరించడానికి చేసిన గొప్ప యత్నమే రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'బల్ల చెక్క' కథ.

ఎవరు ఏ సిద్ధాంతాన్ని నమ్మినా 'దోపిడి' అనే దాని ఉనికి మీద భేదాభిప్రాయాలు వుండకపోవచ్చు. అభిప్రాయాలు వ్యక్తం చేయడంలో మాత్రమే భేదాలుంటాయి. ఇంతటి సార్వజనీనమైన ఒక అంశాన్ని కవిత్వానికి పనికిరాని సరంజామా జాబితాలోకి తోసేసిన (బుక్కుల ప్రకారం) ఒక పదార్థం (బల్ల చెక్క)తో ఎంతో గొప్పగా, రమ్యంగా, స్పటికమంత స్పష్టంగా వివరించగలగడం రావిశాస్త్రిగారికి మాత్రమే చెల్లు.

'రొట్టె ముక్కా, అరటి తొక్కా, బల్ల చెక్కా- నీవేపే చూస్తూ ఉంటాయ్! తమ లోతు కనుక్కోమంటాయ్!' అన్న శ్రీశ్రీ రెండో బుక్కులోని 'బల్ల చెక్క'నే మన వచన కథా మేస్త్రి స్వీకరించారని వేరే చెప్పనక్కరలేదు. 'బల్ల చెక్క'ను రాచకొండ చెక్కిన తీరు ఇలా వుంది.

కాంతయ్య అనే సాదా సీదా గృహస్థుకి 'పండులో పురుగు ప్రవేశించినట్లు లాభం యెడల దాహం' ప్రవేశించడంతో కథ మొదలవుతుంది. 'ప్రతి వెధవగాడు' మేకుల్లా బిగిసిపోయి తాటి చెట్లలా పెరిగిపోయి మర్రి చెట్లలా విస్తరించుకు కూర్చోడమే అతడి దాహానికి ఒక కారణం. వాళ్ళంతా శ్రీరామ చంద్రుళ్ళు, సత్యహరిశ్చంద్రులూ (వీధుల్లో కీర్తి చంద్రికలతో ఊరేగేవాళ్ళు) కారని భోగట్టా తెలియడం రెండో కారణం. దానితో లాభ జపంతో ఊగిపోతుంటాడు. అలాంటి దశలో అసలు 'లాభం' అంటే ఏమిటని అతడి కూతురు సావిత్రి తల్లిని అడుగుతుంది. తల్లి అంటుంది కదా- "రెండువేల కట్నానికి నీకు రెండు లక్షల మొగుడొస్తే అది మనకు లాభం" అని. ఇదే అర్థం కాక తండ్రిని అడిగి చూసింది. అతడే

మంటాడో చూడండి- "కిందపేడు ధాన్యం రూపాయ కు్కంచెడు చొప్పున కొన్నావా? కొని కుంచె(రెండ్రూపాయాల కమ్మేవా ? లాభం ఒర్చింది కద, అదే లాభం!" అంటాడు. దానికా పిల్ల అంటుంది- "ధాన్యానికి రూపాయి తీసుకున్నావు. కాని మరి ఆ రెండో రూపాయి ఎందుకు తీసుకున్నావు?" అని. దేనికి, ఒట్టినే తీసుకున్నాం. అదే సంగతి" అని తేలుస్తాడు కాంతయ్య. అర్థం చేసుకోలేక పోతుంది సావిత్రి.

అయితే దీనినే తన బావ సత్యమూర్తి ఇంకొంచెం పై స్థాయిలో అయినా, జీవితానుభవంలోంచి చెబితే విని, మూర్ఛ వచ్చినంత పనవుతుంది సావిత్రికి.

సత్యమూర్తి కాంతయ్య మేనల్లుడు. వడ్రంగి. చుట్టం చూపుగా వచ్చాడు. చలాకీ అయిన వాడు కావడంతో సాల్లో పడి వున్న దేవదారు పేకేజీ పెట్టెలు చూసి నాలుగు రూపాయిలకు బేరమాడతాడు మావతో. పన్నెండు రూపాయిలైతే ఇస్తానంటాడు కాంతయ్య. చివరికి ఆ పెట్టెలనే-చాల షోకైన బల్లలుగా తయారు చేస్తాడు సత్యమూర్తి. కాంతయ్య సంతానం బల్లలని, బావని అపురూపంగా చూసుకొంటూ వుంటే ముచ్చటపడి ముగ్గుర్నీ (ఆడ, మగ, మగ') సినిమాకి తీసుకెళతాడు. తిరిగొచ్చేసరికి కాంతయ్య బల్లలు అమ్మేసి సొమ్ము లెక్కెస్తుంటాడు. విషయం తెలిసి పిల్లలు గొల్లుమంటారు. ఈ దృశ్యంలో మామా అల్లుళ్ళ లెక్కల సంభాషణ ఎంతో గొప్పది.

వచ్చిన యాభై లో పది రూపాయలుతీసి 'నీ కష్టం'అని ఇస్తాడు కాంతయ్య. కూలిగా ఇవ్వదలిస్తే ఇదేనని గుర్తు చేస్తాడు. చెక్కలకి కాంతయ్య చెప్పిన రేటుని అలాగే వుంచి, తన కూలి, ముప్పావలా మేకులు- కలిపి మొత్తం పదిహేడ్రూపాయిల ముప్పావలా (అసలు విలువ)గా తేల్చి చెబుతాడు సత్యమూర్తి. మిగిలిన ముప్ఫయ్ రెండు రూపాయిల పావలా సంగతి చెప్పి అంత లాభం కొట్టేశావు అంటాడు. నక్క వికవిక నవ్వినట్టు నవ్వాడు కాంతయ్య. అప్పుడే ఓ ప్రశ్న వేస్తాడు అల్లుడు.

"మావా! ఆ లాభం ఏంటో తెలుసా ?" అని "నువ్వే చెప్పు" అంటాడు.

"నా కష్టమే నీ లాభం కాదా మావా ?" సత్యమూర్తి అనుభవం వేసిన ఈ ప్రశ్నకి కాంతయ్య అంటాడూ, "ఒహడు నష్టపోతేనే ఇంకొకడికి లాభం" అని. దానిని ఇంకొంచెం స్పష్టంగా చెబుతాడు చెలాకీ అల్లుడు- "కష్టపడ్డవాడు నష్టపోతేనే మిగతా వాళ్ళకి లాభాలు" అనేసి.

ఈ బేరీజులు, క్లాజులతో సావిత్రి హడలెత్తి పోతుంది. నాన్న నాన్నే కాబట్టి మంచివాడే. బావ బావే కాబట్టి అతడూ మంచివాడే కాని మంచి నాన్న, మంచి బావలని ఎవరో దుర్మార్గులు చంపేసి, ఆ శవాల్లో వాళ్ళు దూరి ఇలాంటి రాక్షసప్ప

సులు చేయిస్తున్నారని, తను చూసిన ఓ ఇంగ్లీషు సినిమా కథ ఆధారంగా ఒక నిర్ణయానికి వచ్చేస్తుంది. గజ గజ వణికింది.

"ఆ రాత్రి జాలిగా అతి జాలిగా భగవంతుణ్ని ప్రార్థించి నిద్రపోయింది సావిత్రి. భగవంతుడామె ప్రార్థన వింటూ నిద్రపోయేడోలేక నిద్రలో ఆమె ప్రార్థన వినలేకపోయేడో ఆమెకి తెలియలేదు." అని కథ ముగిసిపోతుంది.

సిద్ధాంతాలను, సిద్ధాంతాలుగానే పాత్రల చేత ఊకదంపుడు కొట్టించడం ఎవరేమన్నా సృజనాత్మక సాహిత్యం కానేరదు. అదే సాహిత్యమని ఎవరైనా బల్లగుద్దితే, కాలగతిలో అది నిలబడదని చెప్పడం తప్ప చేయగలిగేది లేదు. సజ్జల సామెతను గుర్తు చేయడమూ తప్పదు. జీవన సత్యాలను, సంఘర్షణలను ప్రతిభావంతంగా పట్టుకొనడం ద్వారా, కాంతా సమ్మతంగా ఆయా సిద్ధాంతాల సారాంశాన్ని వ్యక్తీకరించడం అత్యున్నత కళా ప్రక్రియ అని భావించవచ్చు. అది కొద్ది మందికే సాధ్యం. అందులో అగ్రతాంబూలం రాచకొండ విశ్వనాథశాస్త్రి గారిదే.

---

## రా.వి. శాస్త్రి మృతికి సంతాపం

శ్రీకాకుళ గిరిజనోద్యమ సందర్భంగా ఏర్పడిన తెలుగు రచయితల పోలరైజేషన్‌లో పీడిత ప్రజలవైపు నిల్చి, విప్లవ రచయితల సంఘానికి ఉపాధ్యక్షునిగా పని చేసిన ప్రముఖ కథా, నవలా రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి. తాను కలం పట్టిన నాటి నుండీ సమాజంలోని బడుగు జనాల సమస్యలను, బడుగు జనుల భాషలో, యాసలో విశిష్టమైన శైలీ విన్యాసంతో చిత్రించాడు రావిశాస్త్రి. కథను మహాస్త్రంగా మలిచి దోపిడీవర్గాలపై దాన్ని సంధించాడు. దోపిడీవ్యవస్థపై కసిని, క్రోధాన్ని కల్గించే విధంగా రచనలు సాగించాడు. 1960వ దశకంలో మార్క్సిస్టు సిద్ధాంతంవైపు ఆకర్షితుడై, తన రచనలను మరింత నిశితం చేసాడు. పేదవారు 'ధాత్రిబాబు'గా పిల్చుకునే రాచకొండ విశ్వనాథ శాస్త్రి తేది10-11-1993న మరణించారు.వారి మృతికి జన సాహితి తీవ్ర సంతాపాన్ని తెలియచేస్తోంది. వారి కుటుంబ సభ్యులకు తన సానుభూతిని ప్రకటిస్తోంది.

— కొత్తపల్లి రవిబాబు
ప్రధానకార్యదర్శి, జ న సా హి తి

# నిశ్శబ్ద నిషేధం

ఇప్పుడు
ఇక్కడంతా నిశ్శబ్దమే
అనుమానాల ఆవలింతలు తప్ప
ఇనుప బూట్ల కవాతులు తప్ప
ప్రశ్నించే చూపుల్ని కాల్చే
తుపాకి మోతలు తప్ప

ఇప్పుడు
ఇక్కడంతా నిషేధమే
సారాయి అంగళ్లు తప్ప
అవినీతి ముడా బేరాలుతప్ప
బూటకపు ఎన్‌కౌంటర్
హత్యలు తప్ప

ఇక్కడ
శ్వాస పీల్చడం నేరమై
జీవితం వధ్య శిలకు వేలాడుతుంది
ఇక్కడ
బతుకు చెల్లాచెదురై
తుపాను బీభత్సం సృష్టిస్తోంది
అంతా నిశ్శబ్దమే
ఇప్పుడు
నిశ్శబ్దం భయంకర శబ్దమైంది
ఇక్కడ
నిషేధం దిన దిన గండమైంది

— శోధన్

# రావిశాస్త్రి లేఖలు

★★
★



(1962-65 మధ్య రావిశాస్త్రిగారు సుప్రసిద్ధ నవలా రచయిత శ్రీ మహీధర రామ్మోహనరావు గారికి రాసిన వుత్తరాల నుంచి కొన్ని ఎంపిక చేసి 'ప్రజాసాహితి' పాఠకుల కోసం ఈ దిగువ యిస్తున్నాం.

రామ్మోహనరావు గారితో రావిశాస్త్రి గారికి 1960 నుంచి పరిచయం. ఆ పరిచయం ఆత్మీయంగా ఎదిగింది. ఆ రోజుల్లో విజయవాడలో రామ్మోహనరావు గారు విశాలాంధ్ర దినపత్రిక సంపాదక వర్గంలో పని చేసేవారు. విజయవాడలో తనకు కావలసిన పనులను శాస్త్రిగారు రామ్మోహనరావు గారికి పురమాయిస్తూ వుండేవారు.
సం॥)

విశాఖపట్నం 2, 9–12–1962

శ్రీ మహీధర రామమోహనరావుగారిక్కి నమస్కారాలు. మీ జాబు అందింది. "నిజం" బాగా ముద్రించేరు. నావి కథా సాగరం కథలు విశాలాంధ్రవారు వేయిస్తే బావుంటుందని అనుకున్నాను. దేశి వాళ్ళతో correspondence లోగడ పంపేను. మిగతావి నా కథలు అట్టేలేవు. ఆరు కథలు, "ఆరు చిత్రాలు" అనే పేరుతో ప్రగతి ప్రచురణల వారు పుస్తకంగా అచ్చొత్తేరు. 2 వారం పదిరోజుల్లో మార్కెట్లోకి రావొచ్చుననుకుంటాను. కుక్కపిల్లా వగైరా కథలు 'యువ' వాళ్ళే వేస్తామన్నారు. కుక్కపిల్ల, అగ్గి పుల్ల, సబ్బు బిళ్ళ, అరిటి తొక్క కథలు 'యువ' లోనే వచ్చేయి. రొట్టె ముక్క, బల్ల చెక్క, తలుపు గొళ్ళెం, హారతి పళ్ళెం కథలకి ప్లాట్లు ఆలోచించెను, రాయడానికి బద్ధకిస్తున్నాను. 'గుర్రపు కళ్లెం' కింద ఏం రాయడానికి

ఇంకా కుదర్లేదు. ఆ series కథలు ప్రజలు ఎలా రిసీవ్ చేసుకొంటున్నారో తెలీదు. 'అగ్గిపుల్ల' కథ మాత్రం బావుందని చాలామంది అన్నారు. నవలేమీ రాయడానికి అవకాశం చిక్కడం లేదు. ఐతకాలంటే తినాలి. తినడానికి పడే తాపత్రయం నన్ను తినేస్తోంది. అంటే, పని తక్కువా తాపత్రయం ఎక్కువా అయిపోతోంది. ఏ కాఫీ హోటేల్ వ్యాపారంలోకైనా ఎందులోకైనా దిగుదాం అంటే కాపిటల్ లేక గిజగిజ లాడుతున్నాం. అప్పు కోసం ఈ మధ్య హడావిడిగా తిరుగుతున్నాం.

రామారావుగారు ఏ నవలా రాయడం లేదన్నారు. అంగర కృష్ణారావుగార్ని ఓసారి అడిగి చూడండి. ఆయన బ్రూక్‌బాండ్స్ వారి వైజాగ్ ఆఫీసులో పని చేస్తున్నారు. బలివాడ కాంతారావుగారు ఇక్కడ లేరు. ముప్పాళ రంగనాయకమ్మ గారు ఇక్కడే ఉన్నారు కాని వారితో నాకు పరిచయం లేదు. మీరు కులాసాగా ఉన్నారని అనుకుంటాను.

విశాఖపట్నం—2, 8-4-63.

శ్రీ రామమోహనరావు గార్కి నమస్కారాలు. మీ జాబు అందింది. వెంటనే జవాబు రాయలేకపోయినందుకు క్షమించాలి. శ్రీ బుచ్చిబాబుగారు చెప్పిన దానితో నేను ఏకీభవించగలనని అనుకోను. రాసిన దానితో సంఘానికి సంబంధం లేకపోతే ఆ విషయం గురించి తిరిగి సంఘంలో ఏర్పాటయిన సమావేశాల్లో చెప్పుకోడం దేనికి ? సంబంధం ఉన్నదనుకొని రాసినా లేదనుకొని రాసినా, resultant writing మాత్రం సంఘంతో సంబంధం గలదిగానే ఉంటుంది కదా A husband and wife may go to bed for their own pleasure, but the child d·ops out of the womb into a sociey, inescapable. I think it is idle pretension to say that an artist create for himself alone. If so, let them, i.e such artists, just keep mum, or indulge in soliloquies or draw invisible lines or now-existent paper..

"నిజం" నాటకం ఎలా ఉందని అభిప్రాయ పడ్డారు తెలియజేసినందుకు సంతోషం. ఆ ఖుదో సీను ఉండాలనే నేను అనుకొంటున్నాను. అది లేకపోతే డ్రామా purpose చెడుతుందని కూడా నేను అనుకుంటాను. లోగడ S.R మంత్రిగారు కూడా ఆ అంకం తీసేయొచ్చునని అంటే నేను ఇదే సమాధానం చెప్పేను. సార్వభౌమరావులు తమంతట తాము మారిపోతారనుకోడం naivety అని నేననుకుంటాను. వాళ్ళు అబద్ధాలెందుకు ఆడతారో నిజం ఎందుకు చెప్పరో, ఏ విధంగా వారి వారి conscience ని సమాధాన పర్చుకోగలరో తెలియవలసిన అవసరం ఉంది.

ఆ విషయాలతో ఆ నాటకానికి చాలా సంబంధం ఉంది. ఆ సీసులో డ్రామా ఉన్నదని కూడా నేను అనుకుంటాను. ఎంచేతనంటే: తొల్త ఆ కథ చాలా మందికి చెప్పినప్పుడు, సార్వభౌమరావు తన ప్రతి చర్యనీ ఎలా సమర్థించు కోగలడో తెలుసుకోడంలో ప్రతివాళ్ళూ curiosity and interest చూపించి follow అయేరు. Regarding meetings of writers కలుసుకొంటూనే ఉన్నాం కదా! వీరే సభ్య సంఘాలు దేనికి ?— సారా కథల కాపీలు సెంట్రల్ లైబ్రరీకీ Registrar of Booksకీ కలెక్టర్ వగైరాలకీ పంపించేరా ? పంపించకపోడం నేరం అనుకుంటాను. దయచేసి ఆ విషయం కనుక్కోండి. పంపకపోతే ఇప్పుడు వెగిరం పంపించ గోర్తాను.

"విషాదం" అనే నాటిక ప్రచురణార్థం నవ భారత్ బుక్ హవుస్ వారికి పంపించేను. రెండు ఉత్తరాలు కూడా రాసేను. మీరోసారి దయచేసి వార్కి ఫోన్ చేసి గాని లేదా వార్ని వీలున్నప్పుడు కలుసుకుని గాని దాని గురించి కనుక్కోగలరా? వారి దగ్గర్నుంచి ఏ సమాధానమూ! లేదు.

విశాఖపట్నం-2, 15-8-63.

శ్రీ మహీధర రామమోహనరావుగారికి నమస్కారాలు. మీరు దయతో రాసిన రెండు ఉత్తరాలూ కూడా అందేయి. వెంటనే జవాబు రాయనందుకు క్షమించాలి. శారదా గ్రంథాలయం అనకాపల్లిలో ఉపన్యసించడం గురించి మీరు రాసేరు. తోచిన ట్రాష్ కథలు ఏదో మాదిరిగా తెలిసీ తెలియని విధంగా బక్కరడం తప్ప మిగతా విషయాలు నాకేమీ తెలియవని మీకు తెలుసు. అందుచేత ఎవరికైనా ఏ విషయం గురించైనా నేను ఉపన్యసించడం అనేది చాలా అసందర్భమైన సంగతి. అందులోనూ కథానికా సాహిత్యం గురించి కాని అందులోని "social content" గురించి కాని నాకేమీ తెలియదు. అందుచేత అందుగురించి నేనే మీ ఉపన్యసించలేను. ఎవరైనా able personని fix చేయడం మంచిది. మొన్న ఈ మధ్య సోమసుందర్‌గారు వస్తే వారితో కూడా ఇదే విషయం చెప్పేను. జ్యేష్టగారు తన అడ్రసు ఇస్తూ మీకు జాబు రాసేమని చెప్పేరు. ఇక్కడంతా కులాసాగా ఉన్నాము. మీ క్షేమం తరచు రాయగోర్తాను. కుమారి విజయలక్ష్మిగార్ని ఆ మధ్య meet అయేను.

* * *

విశాఖపట్నం-2, 14-11-1963.

శ్రీ మహీధర రామ్మోహన్రావుగార్కి నమస్కారాలు. మీరు దయతో రాసిన జాబు అందింది. మీరు కులాసాగా ఉన్నందుకు సంతోషం ఈ మరో ఆరు చిత్రాలు చూసేను. అట్ట తప్ప అంతా బావుంది. గణపతిరాజు అచ్యుత రామరాజుగార్కి

ఆ పుస్తకం అంకితం ఇచ్చేను. అది ప్రింటు చెయ్యడం మానీసేరు. remind చేసేను. జవాబు లేదు.

నేను రాయడం మానీసేను. మరింక కథలకోసం కల్పనా సాహిత్యంకోసం (వ్యాసాల్తో సహా) వాటి వేటి కోసం కలం ముట్టకూడదనే అనుకొంటున్నాను. ఇక్కడ రచయితల సంఘంలో ఓ వ్యాసం చదివేను దాన్తో ఆఖరు. ఇక్కడ రచయితలంతా కులాసాగా ఉన్నారు. యంగ్ రైటర్సంతా హుషార్‌గా ఉన్నారు. మసూనాగారు మాత్రం దూరంగా ఉన్నారు.

విశాఖపట్నం-2, 18-5-1965.

శ్రీ రామమోహనరావుగార్కి నమస్కారాలు. ఇక్కడంతా క్షేమం. మీరు క్షేమంగా ఉన్నారని తలుస్తాను. మీ జాబు అందింది. "నిజం" నాటకం గురించి ముగ్గురు నలుగురు. అడిగేరు వారికి పర్మిషన్ ఇచ్చేను. ప్రొద్దుటూరి వారికి కూడా ఇచ్చేను. ఈపాటికి వారికి అంది ఉంటుంది. నేనొక నవల రాస్తున్నాను. నూట ముప్ఫయ్ పేజీలు రాసిన మట్టుకు చాలా బావుందని శ్రీ కాళీపట్నం, శ్రీ అచ్యుత రామరాజు, శ్రీమతి బీనాదేవి, శ్రీ మసూనా, ఇంకా చాలామంది అన్నారు. నవల పేరు "రాజు, మహిషి, ప్రేమ, మనిషి - అంతేకాక - దైవం, న్యాయం, ధర్మం, సత్యం. ఇంకా కనీసం 300 పేజీలు రాయవలసి ఉంది. ఆ నవల మీద అడ్వాన్సుగా ఏమైనా సొమ్ము ఇవ్వగలరేమోనని నవోదయా పబ్లిషర్స్ వార్కి రాసేను. 10% రాయల్టీ తీసుకుంటానని అన్నాను. మీరు కూడా ఎవర్నయినా భోగట్టా చేయమని కోరుతున్నాను. "విశాలాంధ్ర" వారు serialise చేస్తే అందు గురించి ఏమైనా ఇవ్వ గలరా? సారా కథలకంటె interesting గా ఉంటుందని promise చెయ్యగలను. Serialise చెయ్యడానికి విశాలాంధ్రవారు ఏమీ ఇవ్వజాలని పక్షాన, "ఆంధ్రజ్యోతి" వారిని ఏమైనా కదిల్చి చూడగలరా? నేను ప్రస్తుతం కొన్ని చిక్కుల్లో చిక్కుకొని ఉన్నాను. అందుచేత ఈ విధంగా రాయవలసి వచ్చింది. ఇక్కడ "విశాఖ" రెండు సంచికలు కూడా బాగున్నవని చాలామంది అన్నారు. ప్రతి మీకు అందే ఉంటుంది. శ్రీ కంభంపాటి వారినీ శ్రీ కోనయ్యగార్ని అడిగేనని చెప్పగోర్తాను.

---

"నన్నేదో గొప్ప చేస్తూ మీరు మాట్లాడటం, రాయటం చేస్తారు గాని, నేను పెద్దగా చేసిందేం లేదు. ఇంట్లో పడి కొట్టుకుంటున్న కథని బయటకు తీసుకొచ్చేనను కుంటున్నాను. సెక్సులోను, సంసారంలో పడి కొట్టుకుంటున్న కథకి కొత్త ఒరవడి పెట్టేనని నమ్ముతున్నాను."

—రావిశాస్త్రి

పా ట:

# గోచి కన్న దరిద్రమ్మ్యాడిది ?

— అప్పన్నగారి గోపాలరావు

అన్న రారా రైతన్న
తెరా పారా పల్గు
తందాం బొంకులోడిని
అహా, నర్కుదాం దంకెలోడిని,
అరె, గోచికన్న దరిద్రమ్మ్యాడిది ॥అన్న॥

ఇత్తు నాదంటడు
పత్తి నాదంటడు
పల్గు పార నాయెనంటడు
రెప్పొద్దున మననే తన సొత్తంటడు
అరె ఊర్కుంటే ఉట్టి కెక్కుతడు ॥అన్న॥

తైదలు కరు వాయెను
సామాలు కరు వాయెను
ఎర్రోడ్లు యాడి బాయెనో
నేడు బొస్పతి పంద బట్టినో
అరె ఇత్తిత్తు యాడి బుట్టినో ॥అన్న॥

యూరియ చల్లంటడు
మందుల కొట్టంటడు
ధరలను ఉసొక్కు మంటడు
పీడు సబ్సిడీలు వద్దంటడు
అరె మన నోట్ల మన్ను బోస్తాడు ॥అన్న॥

అకులె తొక్కలెదా
పెండనె కొట్టలెదా
పసుపు నీళ్ళు చల్లలెదా
మనకు పంటలె పండలెదా
అరె వ్యవసాయం ఎవడి సొత్తురా ॥అన్న॥

పేటెంటు లంటడు
రాయల్టి లంటడు
పురుగు మీద హక్కంటాడు
వీడు తలకాయలప్రము మంటాడు
అరె, చాప కింద నీరౌతాడు ॥అన్న॥

(కోడ్ల రారా ఈరన్న, తెరా పాత కత్తి ఎక్కుత మేడ మీదికి అహ దుంకుతిగ అరబ్బు మీదికి, పోదాం పాణమెట్ల పోతాది .... అనే బాణిలో)



## డా॥ నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు మరణానికి సంతాపం

ప్రముఖ సాహితీ విమర్శకులు, చరిత్ర పరిశోధకులు డాక్టరు నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు గారు 25-11-93న గుంటూరులో తమ 73వ ఏట మరణించారు.

మార్క్సిస్టు దృక్పథంతో భారతదేశ చరిత్రనూ, తత్వ శాస్త్రాన్నీ, కళలనూ విస్తృతంగా అధ్యయనం చేసి వివిధ గ్రంథాలను రచించారు. "భారతీయ తత్వ శాస్త్రం - ఒక పరిశీలన," "బుద్ధ బోధ - బౌద్ధమతం" మొదలగు గ్రంథాలను రచించారు. భారతదేశ కళలను విశ్లేషిస్తూ రాసిన సుదీర్ఘమైన వ్యాసం 'కళ' పత్రికలో వెలువడింది. ఆదిమ దశ నుండి గుప్త రాజుల వరకు భారతదేశ చరిత్ర పరిణామాన్ని విశ్లేషిస్తూ రచించిన గ్రంథం అముద్రితంగానే వుండిపోయింది.

తెలుగు నవలా రచయిత చలంపై వారు రాసిన విమర్శనాత్మక వ్యాసాలు 'చలం స్మశాన సాహిత్యం' పేరిట ప్రచురించారు.

అభ్యుదయ దృక్పథంతో వారు చేసిన సాహిత్య కృషిని గుర్తిస్తూ, జన సాహితి వారి మరణానికి ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తోంది. వారి కుటుంబ సభ్యులకు తన సానుభూతిని ప్రకటిస్తోంది.

— కొత్తపల్లి రవిబాబు
ప్రధానకార్యదర్శి, జన సాహితి

# అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి (AILRC) దశాబ్ది ఉత్సవాల మహాసభకు - జనసాహితి సందేశం

కామ్రేడ్స్,

అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి దశాబ్ది ఉత్సవాల సందర్భంగా, ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ప్రజా సాహిత్య సంస్థ "జనసాహితి" తన సంఘీభావాన్ని ప్రకటిస్తోంది. మత తత్వానికి వ్యతిరేకంగా నిర్వహింపబడుతున్న అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి నాల్గవ మహాసభ సందర్భంగా సమావేశమైన కళాకారులకూ, రచయితలకూ, మేధావులకూ మా హృదయపూర్వకమైన విప్లవాభినందనాలు తెలియచేస్తున్నాము.

శ్రామిక ప్రజానీకం కోసం పోరాడుతూ, నూతన ప్రజాతంత్ర సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించడానికి సాంస్కృతిక రంగంలో మెరుగుగా కృషి చేస్తున్న రచయితల సంస్థలు మనవి. ఆ విధంగా మనందరం ఒకే రంగానికి చెందిన వారం. అర్ధవలస, అర్ధ భూస్వామ్య విధానం సృష్టించే మత తత్వవాదం సామ్రాజ్యవాదంతో చేతులు కలిపి, నేడు దేశంలోని అత్యధిక సంఖ్యాకులైన శ్రామిక జనావళికి ఒక బలమైన శత్రువుగా రూపు దాల్చింది. అత్యధిక భారత ప్రజలకు, బాబ్రీ మసీదును కూల్చివేసిన డిశంబర్ 6వ తేదీ ఒక మాయని మచ్చగా మిగిలిపోయింది. భారతీయ జనతాపార్టీ, విశ్వ హిందూ పరిషత్తు, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, శివ సేనల కూటమి ఐన సంఘ పరివార్ వివిధ అల్ప సంఖ్యాక వర్గాలపై దాడులను ముమ్మరం చేసింది. ఈ కూటమి, అల్పసంఖ్యాక వర్గాలపై కుట్ర పూరితమైన ఉద్దేశాలతో గోబెల్స్ తరహా అబద్ధపు ప్రచారానికి పాల్పడటమేగాక, దేశ రాజకీయంలోకి తన అదృశ్య హస్తాలను విస్తరిస్తోంది. బాబ్రీ మసీదు విధ్వంసం హిందూ ఛాందస శక్తుల దుర్మార్గమైన కుట్రలకు పైశాచిక సాక్ష్యంగా మిగిలింది. వారి సిగ్గుమాలిన చర్యలను సమర్థించుకుంటూ, బాబ్రీ మసీదును కూలగొట్టిన తర్వాత సంఘ పరివార్ అల్ప సంఖ్యాక వర్గాలకు వ్యతిరేకంగా తన దుష్ప్రచారాన్ని మరింత తీవ్రతరం చేసింది. సారాంశంలో, మత తత్వం అనేది పాలక వర్గాల సిద్ధాంతంగానూ, రాజకీయ ఆచరణగానూ వుంది. హిందూ మత తత్వ సిద్ధాంతం, దేశంలోని దళితులు, ఇతర వెనుకబడిన వర్గాలు, స్త్రీలు, అల్పసంఖ్యాక వర్గాలతో కూడిన అత్యధిక ప్రజలకు వ్యతిరేకమైనట్టిది. దేశంలోని అర్ధ ఫ్యూడల్, అర్ధ వలస విధానం వల్లనే ఈ హిందూ ఛాందసవాదం పుట్టింది. ఇది దోపిడీ విధానం యధాతథంగా వుంచాలనే ధ్యేయం కల్గి వుంటుంది. దీని మూలాలను మనం అమానుషమైన కులవ్యవస్థలోనూ, చాతుర్వర్ణ సిద్ధాంతంలోనూ, మను ధర్మ శాస్త్రంలోనూ చూడగలం. మత తత్వం అన్ని ప్రజాస్వామిక విలువలకూ, సంస్థలకూ స్వస్తి వాక్యం పల్కుతుంది. దీనివల్ల హిందువులు— ముస్లిముల మధ్య విభజన మరింత తీవ్రమౌతుంది. ఆ పరిస్థితి

దోపిడీ వర్గాలకు మాత్రమే ఉపయోగపడ్తుంది.

మత తత్వానికి వ్యతిరేకంగా సాగే పోరాటాన్ని గాలిలో చేయలేం. మత తత్వానికి మూల కారణమైన అంశంపై పోరాటాన్ని ఎక్కుపెట్టాలి. హిందూ సనాతన వాదంపై పోరాటం, కుల వ్యవస్థపై పూర్తి శక్తితో పోరాటం చేస్తేనే విజయవంత మౌతుంది. హిందూ సనాతన వాదానికి కీలకాంశమైన కుల వ్యవస్థ, బ్రాహ్మణీయ సంస్కృతి, మను ధర్మం, కర్మ సిద్ధాంతం భావజాలానికి వ్యతిరేకంగా ప్రజాతంత్ర వాదులూ, లౌకికవాదులూ, అణచివేతకు గురైన ప్రజానీకమూ ఒక సుదీర్ఘమైన, సుస్థిరమైన పోరాటాన్ని సాంస్కృతిక రంగంలో చేయాలి.

మన దేశాన్ని కొల్లగొట్టడానికి సామ్రాజ్యవాదం దేశంలోని అత్యంత ప్రతీఘాతుక శక్తులతో చేతులు కలిపి, మత తత్వవాదంతో స్నేహం చేస్తోంది. ప్రైవేటీకరణ, సరళీకరణ, నూతన ఆర్థిక విధానాలూ, డంకెల్ డ్రాఫ్టు మొదలైన వాటన్నిటినీ రామరాజ్యం సాకుతో ప్రజలపై పాలకవర్గాలు రుద్దటాన్ని ఈ నేపథ్యంలోమనంఅర్థం చేసుకోవాలి. ప్రజలను అణచడానికి, దోపిడీ చేయడానికి మత తత్వంలో పాలక వర్గాలు ఒక ప్రత్యామ్నాయ భావజాలాన్ని కనుగొని, రాజ్యాంగ యంత్రాన్ని మొత్తంగా మత తత్వంతో నింపాలని చూస్తున్నారు. ఈనాటి బడా పెట్టుబడిదారీ, బడా భూస్వామ్య భారత రాజ్యాంగ యంత్రాన్ని, కుల తత్వ, మత తత్వ యంత్రాంగంగా స్పష్టంగా చెప్పవచ్చు. ప్రజలపై దీని ప్రభావం, ప్రత్యేకంగా సాంస్కృతిక రంగంలో దారుణంగా వుంది. ఈ నేపథ్యంలో విలువలు, నీతి సూత్రాలు, సమాజ సంస్కృతి ఎన్నడూ లేనంతగా పతనమై, దిగజారిపోతున్నాయి.

ఈ పరిస్థితిలో భావ సారూప్యం కల్గిన ప్రజాతంత్ర, లౌకిక విప్లవ కళాకారులు, రచయితలు, మేధావులు సాంస్కృతిక రంగంలో సమైక్య పోరాటం చేయాల్సి వుంటుంది. జనసాహితి అటువంటి సమైక్య పోరాటాని సిద్ధంగా వుంది. ఈ మహాసభకు వచ్చిన ప్రతినిధులందరినీ ఒక బలీయమైన ఐక్య సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించి, శత్రువును ఓడించాలని జనసాహితి కోరుతుంది. శత్రువు చాల బలంగా వున్నాడు. చురుకుగా వున్నాడు. అయినా ప్రజలు అజేయులు. మనం విప్లవ పోరాటాల పతాకం పట్ల మన విశ్వాసాన్ని ప్రకటిస్తూ, నూతన ప్రజాస్వామిక సాంస్కృతిక ఉద్యమంలో ముందుకు సాగుదాం. అంతిమ విజయం మనదే.

ఐక్య కార్యాచరణనూ, విప్లవ సాంస్కృతిక, సాహిత్య సంస్థల వ్యక్తుల ఐక్యతనూ మరొక్కసారి కోరుతూ, అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితికి విజయాన్ని కాంక్షిస్తూ, ఈ ఉత్సవాలు జయప్రదం కావాలని వాంఛిస్తూ—

విప్లవాభినందనలతో

సురేష్

సంయుక్త కార్యదర్శి, జనసాహితి (ఆంధ్రప్రదేశ్)

# అరుణోదయ సందేశం

కామ్రేడ్స్ !

అఖిల భారత విప్లవ సాంస్కృతిక సంస్థ పదవ మహాసభ నిర్వాహకులకూ, దేశంలోని వివిధ ప్రాంతాలనుండి ఈ మహాసభకు ప్రతినిధులుగా విచ్చేసిన విప్లవ సాంస్కృతి కోద్యమ కార్యకర్తలకూ 'అరుణోదయ' విప్లవాభివందనలు తెలియ పరుస్తోంది.

ఈ మహాసభ ఒక ప్రత్యేక చారిత్రక పరిస్థితులలో జరుగుతోంది. అంతేకాక ప్రకృతి వైపరీత్యాలు — మహారాష్ట్ర భూకంపంలాంటివి - సాటి ప్రజానీకంలో దయనూ, జాలినీ, మానవతత్వాన్నీ ప్రేరేపిస్తుంటే, సామాజిక వైపరీత్యాలు వివిధ మతస్తుల మధ్య ద్వేషాన్నీ, కలహ వాతావరణాన్నీ సృష్టిస్తున్న పరిస్థితుల్లో మనం ఇక్కడ సమావేశమవుతున్నాం. దేశం రోజు రోజుకీ తీవ్రమైన ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో కూరుకుపోతోంది. పాలకవర్గాలు సామ్రాజ్యవాదం ముందు మోకరిల్లి **IMF, World Bank** విధిస్తున్న షరతులన్నిటికీ తలలూపి దేశాన్ని మరింత సామ్రాజ్యవాదుల అప్పుల విష వలయంలో చిక్కుకునేట్టు చేస్తున్నారు. డంకెల్ ప్రతిపాదనలు పూర్తిగా అమలులోకి వస్తే మరొకసారి మనం వలస ప్రజలుగా మారిపోయే ప్రమాదం పొంచివుంది. పారిశ్రామిక, వ్యవసాయ రంగాలన్నీ సామ్రాజ్యవాదుల, వారి తాబేదార్ల దోపిడీ స్థావరాలుగా రూపొందుతున్నాయి. చేతివృత్తుల వారూ, పేద రైతాంగం వ్యవసాయ కూలీలుగా మారిపోతున్నారు. నూతన పారిశ్రామిక విధానాలు అమలు పర్చటం పేరుతో వేలాది చిన్న, చిన్న పారిశ్రామిక సంస్థలు మూతపడి లక్షలాది మంది కార్మికులు రిట్రెంచ్ చేయబడుతున్నారు. పాలకులు తప్పనిసరి పరిస్థితులలో మండల్ కమీషన్ రిపోర్టులోని రిజర్వేషన్లని అమలు పరచటానికి ఒక మేరకు అంగీకరించినా - ఉపాధి కరువై ఉద్యోగావకాశాలు మృగ్యమై పోయాయి. విద్యారంగాన్ని ప్రైవేటైజ్ చేసి, రిజర్వేషన్ అవకాశాలను ఆచరణలో లభించనివ్వకుండా చేస్తున్నారు.

విత్తనాలు, ఎరువులు, పురుగులమందులు, నీటి పారుదల ప్రాజెక్టులపై సామ్రాజ్యవాదుల ఆధిపత్యం పెరుగుతున్నందువల్ల వ్యవసాయరంగం మరింత సంక్షోభానికి, దోపిడీకి గురయి గ్రామీణ ప్రజానీకం పట్టణాలకు వలసపోయే పరిస్థితి ఏర్పడుతున్నది. కొనసాగుతున్న అర్ధ ఫ్యూడల్ వ్యవస్థ అందుకు ముఖ్యకారణంగా వుంటోంది.

ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా వివిధ వర్గాల ప్రజానీకం పోరాడుతున్నారు. వారిని సంస్కరణల క్రమల్లో 'అధికార మార్పిడి' పొందినకొంత కాలం వుంచినప్పటికీ చివరికి సంపూర్ణ నిర్బంధం మీదే ఆధారపడవలసిన స్థితి పాలకులు చేరుకున్నారు.

అంతేకాక ప్రజా పోరాటాలను, ఆందోళనలనూ పక్కదారి పట్టించటానికీ ప్రాంతీయ, భాషా, కుల, మతతత్వాలను రెచ్చగొడుతున్నారు.

కనుక నిరంకుశ ఫాసిస్టు పద్ధతుల్లో పరిపాలన సాగించటానికీ, ప్రజల్ని చీల్చి వారి ప్రజాస్వామిక ఆకాంక్షలనూ, కోర్కెలనూ, పక్కదారి పట్టించడానికీ అవసరమైన భావజాలాన్ని సృష్టిస్తున్నారు. అది హిందూ మతోన్మాద రూపంలో పెరిగి పెరిగి దేశాన్నంతా విషబీజాలు నాటి మతకలహాల ఎరువులతో, మానవ రక్త మాంసాలు ఆరగిస్తూ ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించటానికి అర్రులు చాస్తోంది.

గత 46 సం॥లుగా కొనసాగుతున్న దళారీ, భూస్వామ్య పరిపాలన, మతోన్మాద వ్యాప్తికి దోహద పడుతూవస్తోంది. లౌకిక ప్రజాస్వామ్య విలువలకు వ్యతిరేకంగా పాలకులు రేడియో, టి. వి. కార్యక్రమాల ద్వారా, ప్రభుత్వ కార్యకలాపాల్లోనూ మతానుకూలంగా వ్యవహరిస్తున్నారు. రక రకాల పీఠాధిపతులు, మోసకారి బాబాల చుట్టూ దేశ ప్రధానులూ, అధ్యక్షులూ, సుప్రీం కోర్టు జడ్జీలే తిరుగుతున్నారు. ఇవన్నీ మత భావజాల వ్యాప్తికే సహాయపడ్డాయి.

పాలకులు సామ్రాజ్యవాదానికి మరింతగా లొంగుబాటు చూపుతూ, వారు విధించిన దుర్మార్గమైన దేశద్రోహ షరతుల్ని ఆమోదిస్తున్న కాలంలోనే ప్రజలు మతకలహాల మారణకాండలో విలవిలలాడిన వాస్తవాన్ని మనం గ్రహిస్తే తప్ప సామ్రాజ్యవాదానికీ, దళారీ పాలకులకూ మతోన్మాద శక్తులకూ మధ్యగల అంతః సంబంధం మనకు అర్థంకాదు.

కామ్రేడ్స్ !

హిందూ మతోన్మాదులు తాము భారతీయులందర్నీ సమైక్యం చేయటానికీ, ఒకే దేశం - ఒకే ప్రజగా రూపుదిద్దుకునేలా చేయటానికే ఈ "మహాయజ్ఞాన్ని" తల పెట్టామని ప్రచారం చేసుకుంటున్నారు. దీన్ని నిజమేనని నమ్మేశక్తులూ, వ్యక్తులూ వున్నారని మనం గ్రహించాలి.

హిందువుల్ని ఐక్యం చెయ్యటానికి ముస్లిం ద్వేషాన్ని రెచ్చగొట్టాలా? వారు చెప్పే హిందువులు అనైక్యంగా ఎందుకున్నారు? ఏ చరిత్రా....సామాజిక వ్యవస్థా దానికి కారణం ?

పుట్టుక కారణంగా హెచ్చు తగ్గులను పాటిస్తూ వచ్చిన చాతుర్వర్ణ్య వ్యవస్థా, అంటరానితనాన్ని సృష్టించి సాటిమనుషుల్ని నిర్దాక్షిణ్యంగా ఊరువెలుపలికి గెంటేసి వర్ణాల్లో, కులాల్లోకూడా అడుగడుగునా ఎక్కువ తక్కువలను నిర్ణయించి అమలు పరుస్తూ వచ్చిన ఫ్యూడల్ దోపిడీ వ్యవస్థా, దాని సామాజిక నిర్మాణమూ, సంస్కృతులే ఈ దేశంలోని ప్రజలు "అనైక్యం"గా వుండటానికి ప్రధాన కారణమన్న విషయాన్ని వారు పనిగట్టుకుని విస్మరిస్తున్నారు. ఈ దేశంలో కులస్పృహ

గుర్తించనివ్వకుండా కుల పీడనా అణచివేతా, సాంఘిక వివక్షతకు మూలాధారంగా వున్న అర్ధ ఫ్యూడల్ సామాజిక సంబంధాల్ని చెక్కు చెదరనివ్వకుండా చేయటమే హిందూమతోన్మాదుల ముఖ్యోద్దేశం. అందుకేసమస్త అభివృద్ధి నిరోధకభావజాలాన్నీ, మూఢవిశ్వాసాలనూ ప్రాణం పోసి బతికిస్తూ ప్రజలయొక్క ప్రజాస్వామిక వాంఛల నన్నింటినీ మత వ్యతిరేకమైనవిగా, విదేశీయమైనవిగా, దేశద్రోహకరమైనవిగా చిత్రిస్తున్నారు.

ఒకే జాతిపేరుతో సాంస్కృతిక వైవిధ్యాన్ని గుర్తించ నిరాకరిస్తున్నారు. కుల నిర్మూలనా పోరాటాల్ని, పితృస్వామిక వ్యవస్థకు వ్యతిరేకమైన పోరాటాల్ని, జాతీయ స్వయం నిర్ణయాధికార ఆందోళనల్నీ, దేశ విచ్ఛిన్నకర చర్యలుగా ప్రచారం చేస్తున్నారు. మైనారిటీలు అణిగి, మణిగి లొంగివుండాలనే వాదన చేస్తున్నారు. దోపిడీ సాంస్కృతిక విశ్వాసాలే సమస్త ప్రజానీకం తమవిగా స్వీకరించి తీరాలని ఆదేశిస్తున్నారు.

పైకి చూడటానికి హిందూ మతోన్మాదం ముస్లిం వ్యతిరేకతా స్వభావం గలదీ మాత్రంగానే కనిపించినా దీని అసలుసారం సమస్త ప్రజాస్వామిక, లౌకికభావనల్నీ, చైతన్యాల్నీ, పోరాటాల్నీ తుడిచిపెట్టడంగా వుందనేది ప్రజలకి గుర్తింపచెయ్యాల్సిన అత్యవసర సమయం యిదీ. కనుక హిందూమతోన్మాదానికి ప్రత్యామ్నాయం దానికి మూలమైన అర్ధఫ్యూడల్ వ్యవస్థనూ, దాని సామాజిక సంబంధాలనూ రద్దు చేయటమూ, సామ్రాజ్యవాదాన్నీ దాని వందిమాగధులైన దళారీ బూర్జువా పరిపాలననూ తుదముట్టించటమే అవుతుంది. అందుకు కార్మిక కర్షక ఐక్యత పునాదిగా గల నూతన ప్రజాస్వామిక విప్లవపోరాటమే సరైన సమాధానం కాగలుగుతుంది. కుల పీడనకూ, పురుషాధిక్యతకూ వ్యతిరేకంగా సాగుతున్న దళితుల, మహిళల ప్రజాస్వామిక పోరాటాలూ, స్వయం నిర్ణయహక్కులకూ, తెగల ఉనికిని కాపాడుకోడానికి సాగుతున్న వివిధ జాతుల గిరిజనుల పోరాటాలతో మమేకం కావటం అవసరం అవుతుంది. దోపిడీ అణచివేతలకూ, వివక్షతలకూ మూలమైన వ్యవస్థకు వ్యతిరేకంగా ఎక్కుబెట్టిన ఈ పోరాటాలు మాత్రమే హిందూ మతోన్మాదాన్నీ - అది కాపాడదలుచుకున్న దోపిడీ వ్యవస్థనూ తుద ముట్టించ గలుగుతుంది.

రాజ్యం కూడా మతోన్మాద పూరితంగా తయారయి మతకలహాల నివారణ సాకుతో హిందూ తత్వాన్ని ప్రదర్శిస్తోంది. పీడిత ప్రజల పోరాటాలను అణచివేయటానికి దోపిడీ వర్గతత్వంతోపాటు అగ్రకుల దురహంకారాన్ని వ్యక్తంచేస్తోంది. అందుకే మనలాంటి ప్రజాస్వామిక విప్లవశక్తులపై నిర్బంధాన్ని తీవ్రతరం చేస్తున్నది.

సాంస్కృతికోద్యమ కార్యకర్తలుగా హిందూ మతోన్మాద భావజలానికి వ్యతిరేకంగా మనం సాహితీకళా రంగాలద్వారా కృషి చేయవలసివుంటుంది. లౌకిక ప్రజాస్వామ్య జీవన విధానాన్ని నెలకొల్పడానికి వర్గ, వర్ణ, లింగ ఆధిపత్య సంస్కృతులకు వ్యతిరేకంగా పోరాడాల్సి వుంది.

కొన్ని దురదృష్టకర చారిత్రక పరిస్థితలలో ఒకే లక్ష్యం కలిగి కూడా వేరు వేరు సంస్థలుగా ఉంటున్న మనలాంటి సాంస్కృతిక శక్తులు హిందూ మతోన్మాదం లాంటి సమస్యల సందర్భంలోనైనా ఐక్య కార్యాచరణకు సంసి ద్ధంకావాలి. ఈ ఐక్య భావన విప్లవ సాంస్కృతిక శక్తుల సమైక్యతకు దోహదపడాలి. అందుకు 'అరుణోదయ' తన వంతు కర్తవ్యాన్నీ, బాధ్యతనూ నిర్వహిస్తుందని ప్రకటిస్తున్నాము. ఈ మహాసభ విజయవంతం కావాలని మనసారా వాంఛిస్తున్నాము.

హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా పోరాడండి! కూల్చబడిన బాబ్రీ మసీదు స్థానంలో మరొక మసీదుని నిర్మించి దాన్ని ముస్లిం ప్రజానీకానికి అప్ప చెప్పాలి.

భూస్వామ్య సామ్రాజ్యవాద సంస్కృతులకు వ్యతిరేకంగా పోరాడండి!

విప్లవం వర్ధిల్లాలి!

విప్లవ సాహితీ సాంస్కృతికోద్యమం వర్ధిల్లాలి!

— దివికుమార్

హైదరాబాదు  
9-10-93

రాష్ట్ర అధ్యక్షుడు  
'అరుణోదయ'

రాచకొండ రచనల్లో కనిపించే పాత్రలు ఏ వర్గాలకు చెందినవో, ఆ వర్గాల వారి కోసం ఆయన కథలు రాయటం లేదు. అందుచేత ఆయన మధ్య తరగతి వారి హృదయాలు కింది తరగతి వారి పట్ల ద్రవించేటట్టు చేయటానికే పని చేస్తున్నారు. అది కూడా ఒక దృక్పథమే. ఆయనలాగా అందరూ కింది తరగతి పాత్రలను తీసుకు రాయలేరు. చాలా మంది తమ తరగతి గురించే రాయాలి. రాసేటప్పుడు జీవితంలో వారికి కనిపించే "బూచు"లను గురించి భయం పోగొట్టటం కంటే మంచి పద్ధతి ఏముంటుంది. చందమామలో దయ్యాల కథలు చాలా వేశాం. అని చదివితే పిల్లలకు దయ్యాలంటే భయం పోతుంది. వాటి ఉపయోగమే అది.

— కొడవటిగంటి కుటుంబరావు

# మూడు నవలలు

## — జె.పి.ఎల్. గ్విన్

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి షష్టిపూర్తి వేడుక జరుపుకొనే సందర్భంలో ప్రచురిస్తున్న ప్రత్యేక సంచిక కోసం వ్యాసం రాయమని కోరినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. గర్వపడుతున్నాను. శాస్త్రిగారి రచనలో నేను చదివినవి మూడే నవలలు. అవి నాకు ఎంత ఆనందాన్ని యిచ్చేయో యిక్కడ క్లుప్తంగా రాస్తాను. తెలుగు సాహిత్య విమర్శ నేను ఎక్కువగా చదవలేదు. గనుక నా అభిప్రాయాలతో ఇతరులు ఏకీభవిస్తారో లేదో చెప్పలేను.

ఈ మూడు నవలలూ- మూడు వేరు వేరు పద్ధతులలో నడిచేయి. 'అల్పజీవి' ఎంతో అందంగా రాసిన ఒక అమాయకుడి జీవిత చరిత్ర. అమాయకుడే కాకుండా, చార్లీచాప్లీన్ లాగా పిరికివాడూ, భయస్థుడూ కూడాను; అయినప్పటికి అతను ఒక అపరిచితమైన స్త్రీతో ప్రేమకలాపం సాగిస్తాడు. ఈ నవలలో రచయిత యొక్క రెండు ప్రధాన లక్షణాలు కనిపిస్తాయి. మొదటిది బలహీనుల మీదా, దరిద్రుల మీద ఆయనకి గల ప్రగాఢ సానుభూతి. రెండోది స్వార్థపరులైన కొన్ని పాత్రలను చిత్రించడంలో ఆయన ప్రదర్శించిన చమత్కారమైన వ్యంగ్యం.

'అల్పజీవి' కంటే 'రాజు-మహిషి' చాలా పెద్ద నవల-ఎంత పెద్ద నవలో యింకా మనకు తెలియదు. దీని నిర్మాణం ఒక పెద్ద విచిత్రం. ఇందులో ఎంతో కొత్తదనం. అసంఖ్యాకంగా కొత్త కొత్త పాత్రలనీ, వాళ్ళ చరిత్రలనీ, మనకి రచయిత పరిచయం చేస్తాడు. అదలా జరుగుతూ వుండగానే, కథ నెమ్మదిగా విడుతుంది. కాని కథకి ఎక్కువగా ప్రాముఖ్యత ఉన్నట్టు కనపడదు. వివిధమైన పాత్రల చేష్టలూ, అనుభవాలూ వర్ణించటంలో రచయిత చూసించిన నైపుణ్యం, చెప్పే ధోరణిలోగల వ్యంగ్యం, పాఠకులకి పరమ ఆనందాన్ని కలిగిస్తుంది. ఈ కథకి ఇతివృత్తం మున్సిపల్ రాజకీయాలు— ఆ పట్టణంలో ఉన్న వ్యవహారాలు నడిపించటంలో కొందరు పెద్దలకు గల బలమూ, పలుకుబడి, ఈ నవల అంతా ఎన్నో చిన్న చిన్న కథల సముదాయంలాగ ఉన్నా, వీటన్నిటినీ కలుపుతూ అంతర్గతమైన ఒక దారం లేకపోలేదు. అదే అసంపూర్ణంగా ఈ నవలకి ఒక నిర్దిష్టమైన పరిపూర్ణత ఇస్తుంది. ఇంత వరకు రాసిన కథ, థాకెరే రాసిన 'వేనిటీ ఫేర్' లాగే, కథానాయకుడు లేని నవలగా కనపడుతుంది.

'రత్తాలు-రాంబాబు' లో కథానాయకుడు, నాయకి, ఎంతో మంది దుష్టులూ వున్నారు. ఇందులో ఒక విశదమైన కథ వున్నది. అందుచేతే ఇది యింకా అసంపూర్ణంగానే ఉండిపోవడం దురదృష్టం. ఈ కథలో ఎన్నో పాత్రలు సంఘంలో

మరీ తక్కువ స్థాయినుంచి వచ్చిన వాళ్ళే. గత్యంతరం లేక శరీరాలు అమ్ముకొని చివరికి వ్యభిచార వృత్తికి అలవాటు పడిపోయిన అనాథ స్త్రీల చుట్టూ అల్లుకొని ఉంది ఈ కథ. ఇందులో ఇతర పాత్రలు మోసగాళ్ళూ, లంచాలు మరిగిన ఆఫీసర్లూ ఆశకీ మోసాలకీ అంతు తెలియని రాజకీయ నాయకులూ, స్వార్థపరులైన కార్మిక నాయకులూ. 'రత్తాలు—రాంబాబు' మొదటి నూరు పేజీలు చదివేసరికి మానవజాతిమీదే రోతపుడుతుంది. కాని అక్కడితో ఆపేయవద్దు. యింకా చదవండి. కథానాయకుడూ నాయకీకూడా సాధారణ జీవితంలో సగటు మనిషికన్న ఎన్నో రెట్లు మంచి వాళ్ళని తెలుసుకొంటారు. అంచేత నిజ జీవితంలో కూడా చెడ్డవాళ్ళనుపించుకొనే మనుషులు 'రత్తాలు-రాంబాబు'లోని దుష్టులంత చెడ్డవాళ్ళు కారని నేను అనుకొంటాను.

శాస్త్రిగారి రచనలలో ఒక సందేశం లేకపోలేదు. బలవంతుల బాధల నుండి బలహీనులను రక్షించలేకపోవడంలో నేటి సమాజపు నిస్సత్తువ ఇది. ఈ విషయం కుండ బద్దలు కొట్టినట్టూ 'రత్తాలు రాంబాబు'లో కనబడుతుంది. ఐతే రచయితగా గాని, పాత్రల ద్వారాగాని ఆయన హితోపదేశాలు చేయరు-మరైతే తన సందేశాన్ని ఎలా వ్యక్తపరచ గలుగుతున్నారు ? హాస్యాన్ని, బాధని మిక్కిలి నేర్పుతో సమయానుకూలంగా నడుపుతారు. అత్యంత ప్రతిభ గలిగిన ఎంతో తక్కువ మంది రచయితలు ఈ విధంగా రాయగలరు. ఈ సందర్భంలో ఐర్లాండుకు చెందిన నాటక రచయిత "షాన్ ఓకేసి" నాకు గుర్తుకు వస్తున్నాడు. అరవై ఏళ్ళకు పూర్వం అతను రాసిన నాటకాలలో పక్కలు చెక్కలయ్యేటట్టూ నవ్వూ, గుండెలు బద్దలయ్యే టట్టూ దుఃఖం మేళవించి వుంటాయి. శాస్త్రిగారు కూడా, ఓకేసీ లాగే, ప్రాంతీయ పదాలని ఎక్కువగా వాడుతారు.

మానవ స్వభావాన్ని పరిపూర్ణంగా పరిశీలించినవారు శాస్త్రిగారు. నవ్విస్తూ చమత్కారంగా కథలు చెప్పే చాకచక్యం ఉన్నా, సంఘంలోని నైతిక, సామాజిక సమస్యలని మన ముందు పెట్టి మన చేత వాటి గురించి లోతుగా ఆలోచింప చేస్తారు. ఈ గుణాలు వుండబట్టే వారి నవలలను చదివి ఆనందిస్తాం. తప్పనిసరిగా అందరూ చదువుతారని ఆశిస్తున్నాను. ●

("జులై 30" రావిశాస్త్రి షష్టిపూర్తి సంచిక సౌజన్యంతో)

---

"ప్రజలకు, పేద ప్రజలకు పనికొచ్చే రచనలు నాకుబాగా నచ్చుతాయి. రచయితలు ప్రజల పక్షం వహించాలి. వారిని సమర్థిస్తూ రాయాలి."

— రావిశాస్త్రి

# దేశభక్త రైతాంగ వాలంటీరా!....

— ఉదయ్

నడవర .... నడవర .... నడవరా ....
దేశ భక్త రైతాంగ వాలంటీరా - నడవర నడవర నడవరా ....

ఎర్రటోపి పెట్టుకోని - ఎర్ర బ్యాడ్జి కట్టుకోని
కర్ర చేత పట్టుకోని - డంకెలోన్ని తరమరా
తరమర....తరమర....తరమరా....దేశ భక్త రైతాంగ వాలంటీరా
॥నడవరా॥

గాలికి రేషనూ - నీరుకి అనుమతి యంటు
పంటకు పేటెంటుతో - మన బతుకును పీడు చేసిన
సామ్రాజ్య వాదులను తరమరా ....
తరమర .... తరమర .... తరమరా .... దేశ భక్త రైతాంగ వాలంటీరా
॥నడవరా॥

మన నెత్తురు సత్తువతో - మన చెమటల సారంతో
పంట లిచ్చి బువ్వ పెట్టె - విత్తనాలు పుట్టెర
ఆ విత్తులపై హక్కు మనకు లేదనే
డంకేల్‌కి అంకుల్ ఈ అమెరికోణ్ని తరమరా ....
తరమర .... తరమర .... తరమరా .... దేశభక్త రైతాంగా
వాలంటీరా ॥ నడవరా ॥

తల్లిపాలు తాగి తల్లి రొమ్ము గుద్దెటోళ్ళ
పాలకులై దళారులై విదేశాల బంటులై
మన నేలను మన విత్తును మన చెట్టుని
విదేశాల కమ్మేసే పాలకులను తమరా
తరమర .... తమర .... తరమరా .... దేశ భక్త వాలంటీరా ॥ నడవరా ॥

అమరుడు సుబ్బారావు పాణిగ్రాహి వర్ధంతి సందర్భంగా (22 డిసెంబరు)

క థ నం

# మేలుకొలుపు !

—నిశితాసి

నిద్ర నుండి మేల్కొని ఒళ్ళు విరిచి ఎర్రని తన కళ్ళతో భూమి వంక చూస్తున్నాడు ఉదయ భానుడు. రాత్రంతా శరీరాన్ని కొరిక్కి తిని .... తిని యింకా వదలదు చలి. పంచి అంచులో మూడు ముళ్ళేసి దాచిపెట్టి వుంచిన మూరడి పొడగాటి పొగాకు ముక్క తీసి నమలబోయి ఆగాడు గొర్రెల మంద వద్ద వున్న నారిగాడు-

"మహిళా సంఘం వర్ధిల్లాలి!"

"కూలిరేట్లు పెంచాలి!"

నినాదాలు విని నిదానంగా చూసాడు. అందరు ఆడోళ్ళే! ఎర్ర జెండాలు అందరి చేతుల్లోనూ వున్నాయి. మర్రిపాడు, బొడ్డపాడు, రాజాము మొదలయిన గ్రామాలకు చెందినవారు. సుమారు 150 మంది. వాళ్ళంతమందీ నారిగాడికి బాగా తెలుసు. వాళ్ళలో పంచాది నిర్మల నాయకురాలు.

"మయిలా సంగమోలు, కోత లొత్తన్నాయి కదా! కూలి పెంచాలని ఊరేగుతున్నా" రనుకొని తన పెళ్ళాము కూడా ఉన్నదేమోనని చూడటానికి వెళ్ళాడు. వీడెళ్ళే సరికి గరుడ బద్రలోనికి అందరూ వెళ్ళి పోయినారు. ఊరు చివర నుండి చూస్తున్నాడు నారిగాడు.

"ఆగండే! లంజా కూతల్లారా!" అని అడ్డగ నిలబడ్డాడు మద్ది కామేసు. తోసుకుంటు ముందుకు పోతున్న నిర్మలమ్మ రవిక పట్టి చించి వేసాడు కామేసు.

"భూసామి మద్ది కామేసు నశించాలి!"

"భూసాములు దౌర్జన్యం నశించాలి" అని చుట్టుముట్టారు స్త్రీలు. ఇది చూసిన నారిగాడు పరుగులు తీసాడు. వీడికి ముందుగా బొడ్డపాడు కుర్రోలు ముగ్గురూ ఊరు దిక్కే పరుగెత్తున్నారు. నారిగాడు మధ్యలోనే ఉన్నాడు. ఆడ మగ చిన్నా పెద్ద తేడా లేకుండా వందలాది మంది కర్రలు, కత్తులతో వస్తున్నారు. వాళ్ళలో కలసి పోయినాడు నారిగాడు. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు గరుడ బద్రని చుట్టుముట్టారు. భూస్వామి, అతని గూండాలు డీకొన్నారు. ప్రజలపైన ఇటుకల వర్షం కురిపిస్తున్నారు. యుద్ధ భూమిలా మారింది గరుడ బద్ర. ముందు కురుకుతున్న ప్రజలను "ఆగండి!" ఆగండి కామ్రేడ్సు !" అని ముందు కెల్లి ఆపుతున్న పాణిగ్రాహి తల పగిలింది. రక్తంతో శరీరం తడిసి పోతుంది.

దెబ్బ తగిలిన పాణిగ్రాహిని ఎత్తుకుంటు ప్రజలు ఊరు బయటకి వచ్చారు.

పాణిగ్రాహికి పట్టు తగలకపోయింపై ప్రజలు భరించలేరు. ప్రజల తమ హృదయాల్లో గూడు కట్టుకొని దాచుకున్న పాణిగ్రాహి కవి, వాగ్గేయ కారుడు, గొప్ప ఉద్యమకారుడు. ఇతనికి రక్తంకారింపనే వార్త ప్రతి పల్లెను కదిలించివేసింది. అంతా సమావేశమయ్యారు.

"వరి పంట కోతకు సిద్ధంగా వున్నది. మనం దానిని ఇప్పుడే కోసెయ్యాలి" లచ్చుమయ్య అన్నాడు

"కరువొచ్చిన సంవత్సరం అర బస్తా బియ్యం అప్పు తెచ్చాను. అది ఏడాది తిరిగే సరికి అరింతలు చేసి, నా రెండు మళ్ళూ తీసుకున్నాడు" రాములయ్య చెప్పాడు.

"నా పెద్ద కొడుకు పెళ్ళికి పుట్టెడు బియ్యం వంద రూపాయలు యిచ్చాడు. మూడు సంవత్సరాల తర్వాత ఎకరం నర పొలము తీసుకున్నాడు"- భీముడు మాట.

"కోతకు వెళ్తే నడుము పీకి నిలబడి నట్టయితే, నడ్డి మీద తన్నే వాడు"— రాజమ్మ అంది.

"మన శ్రమ శక్తితో వాడు మేడలు కట్టాడు. మనం మెతుకులులేక ఉపవాసాలతో ఉన్నాము"— అప్పన్న అన్నాడు.

"ప్రజల శక్తి ముందు ఏ శక్తి ఆగదని ఋజువు చేయాలి".—చౌదరి. దృఢ స్వరంతో అన్నాడు.

"కామ్రేడ్స్! మీరన్నట్టుగానే వాడికి సరైన గుణపాఠం నేర్పాలి వరి చేను కోయాలంటే అంత తేలిక కాదు. పోలీసులు వొస్తారు. వాడి గూండాలు వస్తారు. మన దగ్గర వాళ్ళ నెదిరించే ఆయుధాలు లేవు. వాళ్ళను తిప్పి కొట్టాలంటే మనో ధైర్యం ఒక్కటే మన ఆయుధం. ఇది మన రైతాంగ పోరాటానికి ప్రారంభం. కేసులు పెడతారు. మన ఆడవాళ్ళను అవమానం చేస్తారు."

"బాధలు, అవమానాలు మాకేమి కొత్త కాదు. రోజూ చూస్తున్నవే. ఏది ఏమైన వరి పంట మన స్వాధీనం కావాల్సిందే!" అన్నారంతా ముక్తకంఠంతో.

ప్రజలు ఆవేశానికి ఆవేదనకూ మరో మార్గం లేని కమ్యూనిస్టు నాయకులు కోతకు సిద్ధపడ్డారు. నిముషాల్లో దొడ్డపాడు చేయకొని కొడవల్లు చేత పట్టారు.

"దున్నేవానిది భూమి! ఎవ్వడురా భూస్వామి" నినాదాల హోరులో చీమల బారులా కదిల్లారు ప్రజలు. "చెపురు బంద" దాటారు. గట్టెక్కి చూసారు. వరిచేను కనిపిస్తుంటే పొలంలో పడిన కష్టం, పోగొట్టుకున్న పొలాలూ, పొలంలోని పంట పొంగి [illegible] ది.

సూర్య కిరణాలు ఏటవాలుగా పడుతున్నాయి. ఆవులు, గొర్రెలు మేతకు ఎంకాయి చెరువు" గట్టు మీదగా పెంటె బిల్ల కొండ మీదకి పోతున్నాయి. పొలం గట్టుల మీద చుట్టు పక్కల ఎర్ర జెండాలు పాతివుంచారు. పొలానికి కిలోమీటరు దూరంలో చుట్టు పక్కల రహదారుల మధ్య కొంతమంది సెంట్రీ కాసారు. కొంత

ముంది కొస్తుంటే మరి కొంత మంది మోస్తున్నారు. మద్రాసు మెయిలు ఆగిపోయింది. బండిలో నుంచి జనం వింతగా చూస్తున్నారు.

"కామ్రేడ్స్! పోలీసు రొత్తున్నారు" తూర్పు నుండి సెంట్రీ కాసిన వాళ్ళు కబురు తెచ్చారు. గట్టెక్కి చూసారు. సుమారు 100 ఎర్ర టోపీలు కనిపించాయి.

"కామ్రేడ్స్! మీలో కొంత మంది వరిసేను మోయండి. సూర్చి ఊరికి తీసుకు వెళ్ళండి. మిగతా వారు మీ దగ్గరున్న ఆయుధాలతో ఒకే దగ్గర నిలబడండి—" పంచాది ఆదేశించాడు.

"కామ్రేడ్స్! వాళ్ళు వచ్చేసారు. సిద్ధం కండి చేతిల్లో రాళ్ళు పట్టండి. మహిళా కామ్రేడ్స్ మిరపగూడ తీయండి—" చౌదరి పురమాయించాడు.

వంద గజాల దూరం నుండి లౌడ్ స్పీకర్‌తో "లొంగి పొండి!" పదిసార్లు అదే మాట పలుకుతూ అక్కడే నిలుచున్నాడు సబ్ ఇన్స్‌పెక్టరు.

ఓ పక్క లౌడ్‌స్పీకర్లో పోలీసులు, ఇంతకంటే రెట్టింపుగా ప్రజల నినాదాలు తుఫాను పట్టి సముద్రుడి ఘోషలా వినిపిస్తోంది. మద్రాసు మెయిలు "హూం...." అంటూ కదిలింది.

"భూస్వాముల దోపిడి నశించాలి! రైతుకూలీ సంఘం వర్ధిల్లాలి!" నినాదాలు యిచ్చుకుంటు ముందు కురుకుతున్న ప్రజలను చూసారు పోలీసులు.

"చేతిలో రాళ్ళున్నాయ్ !"

"కర్రలు కత్తులున్నాయి !"

"అబ్బో! వేలాది మంది సార్!"

"ఫైరింగ్ ఆర్డరు కూడా లేదు?"

"ఉంటే మాత్రం ఏమి చేస్తాం ?"

సి.ఐ. మొదలుకొని కానిస్టేబుల్ వరకూ ప్రతి ఒక్కరూ వొణికిపోయారు. ముందు కొస్తున్న జనాలను చూసి నాలుగడుగులు వెనుకకి వేసారు. వచ్చిన దారిన మరలిపోయారు.

"వ్యవసాయక విప్లవం వర్ధిల్లాలి!" "రైతుకూలీ పోరాటం వర్ధిల్లాలి!" నినాదాలు యిచ్చుకుంటూ జనాలు చీపురు బండ గట్టెక్కి బొడ్డపాడులోకి కదిలినారు. అందరు అరగంట కూర్చోవాలని పంచాది ఆర్డరు జారీ చేసాడు. ఇతను పార్టీ నాయకుడు. రహస్య జీవితం గడుపుతున్నాడు.

"కామ్రేడ్స్! ఈ రాత్రి పోలీసులు పెద్ద ఎత్తున గ్రామాల మీద దాడి చేస్తారు. ముఖ్యమైన కార్యకర్తలు స్థలం మార్చి పడుకోవాలి. గ్రామాల చుట్టు సెంట్రీ కాయాలి. తోక తెగిన తాచు పాము భూస్వామి కామేసు. ఎంతటికయినా తెగిస్తాడు. మనలని మనం ప్రస్తుతం రక్షించుకొని దాడికి ప్రతి దాడి చేయవలసిన అవసర ఉంటుందని అందరూ గ్రహించాలి"- పంచాది అంటుంటే మధ్యలో పాణిగ్రాహి→

## దృష్టి కోణం

ఇ. మోజ్

వొక పెద్ద ప్రపంచాన్ని
ఈ వొడ్డున వొదిలి
వెనక్కి వెళ్ళిపోయింది పడవ
ఇక్కడేమో
మసి పాతలాంటి వెన్నెలా మనమూ
పడవకీ నదికీ మధ్య నలిగి హోరెత్తిన నీటి పాటా
రక్తమాంసాలు నింపుకొని
చుట్టూ తొక్కిసలాడుతున్న
అసంఖ్యాక పాత్రల సమూహమూ!

పేదవాడి గూటి దీపం మలిగిపోయింది
దీపం ఆర్పేసినట్టుగా
వొక్కసారిగా మాయమైంది వెన్నెల
ఎంత చీకట్లోనూ
దీపం నీడ బతికే వుంటుంది
దీపం ఇచ్చిన చూపు బతికే వుంటుంది
నిజంగా
అక్షరం నీడ నిజంలోనే బతుకుతుంది
పది అబద్ధాల మధ్యన
నిటారుగా వెలిగే నిజంలోనే బతుకుతం

→"దిక్కు మొక్కు లేని జనం ఒక్కొక్కరు అగ్ని కణం! సింహ కంఠనాదంతో వస్తారిక కాచుకోండి"ని పాడుతుంటే వీరోత్సాహంతో కోరస్ అందుకొని కొన్ని వందల కంఠాలు కంచు గంటల్లా మారుమ్రోగాయి. కథనం ముగిసింది. నక్సల్‌బరి పిలిచింది.

# రా.వి.శాస్త్రి రచనలూ-జీవితం నుండి

— పి. చంద్రశేఖర్ అజాద్

మన మంచి రచయిత రా వి.శాస్త్రి ఇప్పుడు లేరు.

ఆయన మిగిల్చి వెళ్ళిన 'సంపద' ఉంది. అతని రచనలు ప్రజలందరి ఆస్తులే. ఆయన జీవితం మన ముందుంది. విభిన్న కోణాల నుండి తిరిగి ఇప్పుడు సమీక్ష జరుగుతోంది ఎవరెవరి దృష్టికోణం నుండి వారు చూస్తారు. కాలం గడిచాక మరి కొన్ని కోణాలు స్ఫురించ వచ్చు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే 'రచయిత' అయిన ప్రతి వ్యక్తీ ఇంత అభిమానానికీ, ఆరాధనకూ, ప్రేరణకూ, అంతిమంగా వివాదానికీ నోచుకోడు. ఎవరైతే తమ జీవితాన్ని తాను ఎన్నుకున్న రంగానికి అర్పిస్తారో, ఎవరైతే 'మంచి' మాత్రమే చెప్పాలనుకుని అందుకుగాను నిజాయితీగా జీవితంలోకి తొంగి చూస్తారో వారే అర్హులు. 'మంచి' ఎప్పుడూ అందరిదై ఉండదు. అంచేత ప్రతి గొప్ప వ్యక్తీ వివాదాస్పదుడు కావటం సహజమే.

నేనిప్పుడు వారి రచనల గురించి సమీక్ష చేయాలనుకోవటం లేదు. ఆ పని పెద్దలు చేస్తారు. ఆయన రచనల నుండీ, జీవితం నుండి నేర్చుకోదగిన అంశాలుగా నేను భావిస్తున్న వాటిని చెబుతాను.

రా.వి.శాస్త్రి గారిని ఇతరులకు భిన్నంగా నిలబెట్టింది ఆయన శైలి. ఏ విషయం గురించి చెప్పినా ఆయన తనదైన శైలిలో చెప్పారు. ప్రతి రచయితకూ అలాంటి స్వంత వ్యక్తిత్వం అవసరం.

అదే సమయంలో శైలి ప్రభావంలో పడిపోవడం తెచ్చే ప్రమాదం సైతం ఆయన రచనల మీద పడింది. జీవితం మన చేతుల్లో ఏ రకంగా లేదో, ఆయన పాత్రలు సైతం ఆయన నుండి దూరంగా వెళ్ళిపోయాయి. కాబట్టి రచయితలు తమ శైలిపట్లా, పాత్రల పట్లా ఎంత ప్రేమనూ, సానుభూతిని కలిగి ఉన్నా అవి తమను నిస్సహాయ స్థితికి నెట్టే స్థితికి రాకుండా చూసుకోవటం అవసరం.

రా.వి.శాస్త్రిగారి పాత్రలు అట్టడుగువి. ఆ పొరల నుండి వచ్చిన వారి జీవితాలను ఎంతో పరిశీలన చేయకపోతే అంత గొప్పగా ప్రతిబింబించటం సాధ్యం కాదు. "అలగా" జనంగా పిలవబడే ఆ పాత్రల్ని ఆయన చిత్రించిన తీరు మీద విమర్శ ఉంది నిజానికి ఆయనతో సహా, అందరూ అధ్యయనం చేసి ఉండాల్సిన సమస్య అది. ఇప్పటికయినా అలాంటి ప్రయత్నం జరగాలి.

ముఖ్యమైన విషయం తన చివరి కాలంలో 'రచనలు చదివి మనుషులు మారరు' అనే నిర్ణయాన్ని ఆయన వివిధ సందర్భాలలో ప్రకటించటం జరిగింది.

తన రచనల ద్వారా ఎందరికో ప్రేరణ ఇచ్చిన ఓ గొప్ప రచయిత నిరాశలోకి దొర్లారు. ముందుగా గమనించ వలసింది కేవలం రచనల ద్వారా మాత్రమే ఈ ప్రపంచం మారుతోంది అనుకోవటం ఓ భ్రమ. సాహిత్యాన్ని ఓ దశకు మించి హైలైట్ చేయటం అది. దానికి వ్యతిరేకమైనది అసలు సాహిత్యం మనుషుల మీద ఎలాంటి ప్రభావం చూపించదు అనటం. అంటే ఒకానొక దశలో ఏ గొప్ప వ్యక్తి అయినా ఈ రకమైన వాటికి గురి కావచ్చు అనేది దృష్టిలో ఉంచుకోవాలి.

మన సాహిత్య విమర్శలో రెండు కోణాలు తరచుగా కనిపిస్తుంటాయి. అవి తీవ్ర విమర్శ. తీవ్ర ప్రశంస. రెండూ కనిపించీ, కనిపించని 'డామేజ్' చేస్తుంటాయి. సంస్థలు కూడా ఇందుకు తక్కువేం కాదు. మొదటి నుండి సంయమనంతో కూడిన విమర్శ ఉంటే వ్యక్తులు అభివృద్ధి చెందుతారు. అది లోపించటం వలన ఎంత గొప్ప వ్యక్తులయినా అవసర కాలంలో మౌనంగా ఉండవలసి రావటం మనకి కన్పిస్తూనే ఉంది.

రా.వి.శాస్త్రి గారికి ఫెమినిస్టు ఉద్యమం నచ్చక పోవచ్చు. అలాగే దళితుల సాహిత్య విమర్శ నచ్చక పోవచ్చు. అందుకు ఆయన ప్రతి స్పందించిన తీరు సరయింది కాదు. వారు ఎందుకు నచ్చలేదో, వారి లోపాలు ఏమిటో చెప్ప గలిగితే వారు ఆలోచిస్తారు. వ్యంగ్యం ఎప్పుడూ సరైన సాహితీ విమర్శ కాదు.

ముఖ్యంగా యువతరపు రచయితలు అర్థం చేసుకోవాల్సిందేమిటంటే, నువ్వు ఎంత గొప్ప పదాల్ని పేర్చుకుంటూ పోతున్నావని కాదు. నీలో సంయమనం ఉందా లేదా అనేది ప్రధానం. తెలుగు సాహిత్యంలో ప్రతి సందర్భంలోనూ ఆయా ఉద్య మాలకు ఎనలేని ప్రచారం లభించింది. అదంతా ఆ ఆవేశం చల్లారాక తిరిగి సమీ క్షించ బడింది. ఈ విషయం రచయితలూ, విమర్శకులూ దృష్టిలో ఉంచుకోవటం చాలా అవసరం.

ఆయన తొమ్మిదో సంవత్సరంలోనూ, తిరిగి పెద్దయ్యాక ఆయన్ని వెంటా డిన, 'అద్భుతం'. అనిపించిన కథ ఒకటుంది. "ఆ గదిలో" అనే కథ అది. చాలా సరళమైన, సుందరమైన చిన్న కథ. ఆ ప్రభావం తన మీద చాలా గాఢంగా ఉందని ఆయన చెప్పుకున్నారు. తిరిగి ఇక్కడ రెండు అంశాలున్నాయి. ఆ కథను అందరూ ఆ స్థాయిలో ఆమోదించలేదు. రెండు- ఆయనకి నచ్చిన కథ 'సెంటిమెంట్'తో కూడుకుని ఉంది. ఆ రచయిత్రి ఎవరో తెలియదు. చాలా కాలానికి అనేక మంది ప్రయత్నాల వల్ల ఆ కథ వెలుగులోకి వచ్చింది. గుర్తింపుకి నోచుకోని అనేక మంది రచయితలూ, రచయిత్రులూ ఎంతటి ప్రేరణను అందిస్తారో యువతరం రచయితలు గమనిస్తే నిరుత్సాహం కలగదు.

వ్యక్తిగత జీవితంలో ఆయనకు చాలా బలహీనతలున్నాయి. వాటిని అధిగమించటానికి ఏ ప్రయత్నాలు చేసారో దగ్గరుండి చూసే వారికి తెలుస్తుంది. ఏ మనిషి కూడా బలహీనతకు అతీతుడు కాడు. వాటిని సమర్ధించుకోవటం దానికో సిద్ధాంతం అల్లటం మంచిది కాదు. రా.వి.శాస్త్రి గారు తన బలహీనతల్ని బలంగా ప్రచారం చేసుకోలేదనే నేననుకుంటున్నాను. ఇంక ఆయన రచనలు ప్రధానం. ఆయన లోపాలు ద్వితీయం.

తాను రాస్తున్న తొలి దినాల్లో 'ఎందుకు' రాస్తున్నానో నాకే తెలియదు అన్నారాయన. అటు తర్వాత రకరకాల అనుభవాలు వచ్చాయి. ఆయన మారారు. కొంత కాలం మౌనం వహించారు. తిరిగి ఇటీవల కాలంలో 'ఇల్లు' నవల రాసేరు. ఆ నవలను పండితులూ, విమర్శకులూ మాత్రమే కాక సామాన్య పాఠకులు చదివి అర్థం చేసుకొన్నారు.

ఈ రచన రెస్పాన్స్‌ని బట్టి మరి కొన్ని రచనలు చేయాలనుకుంటున్నాను అని ఆయన అన్నారు.

ఆయన అలా అనటం వెనక 'పాఠకుడి' ఎన్నిక ఉంది. పత్రికల కాలమ్స్‌లో కీర్తించబడటమే కాదు ప్రతి రచయిత లక్ష్యం. తన పాఠకుడు కూడా కావాలి. ఏక కాలంలో అటు సామాన్య పాఠకులనూ, ఇటు మేధావి వర్గాన్ని అలరింప చేయగలగటం సాహిత్యంలో పరిణతి సాధించిన శిల్పం. ఈ విషయాన్ని అంగీకరించని వారు 'పాఠకుడు' విభిన్న స్థాయిల్లో ఉంటారని అంగీకరించరు. అలా అంగీకరించకపోవటం వారి వ్యక్తిగతం. అయితే అదో సిద్ధాంతంగా ప్రచారం చేయటం వల్ల ఇతరులు ఆ ప్రభావంలో పడతారు. ఫలితంగా పాఠకుడు నష్టపోతాడు. అంతిమంగా అది రచయితల నష్టంగా మారుతుంది.

'అహం' అనేక రూపాల్లో ఉంటుంది. సూక్ష్మ అంశాల గురించి రాయాలనిపించకపోవటం— రాయాలంటే 'మాస్టర్‌పీస్' మాత్రమే రాయాలనటం 'అహం'లో భాగాలే. సామాజిక బాధ్యత కల రచయితకు కొలమానం తన ప్రజలు. వారి జీవితం. వారికి సమస్య ఏర్పడిన ప్రతి సందర్భంలోనూ తను తన శక్తి మేరకు స్పందిస్తారు. అలా స్పందించటమే ప్రధానం.

'మాస్టర్‌పీస్'లు రాస్తున్నాననుకుని ఎవరూ రాయలేరు. రా.వి.శాస్త్రిగారు కూడా అంతే. అది కాలం, జీవితం, సందర్భం అందిస్తుంటుంది కొందరు గుర్తించవంత మాత్రాన ఎవరూ నిరాశ చెంద నవసరం లేదు. రచయితలకు నిజమైన గుర్తింపు తాను ఎవరి కోసం రాస్తున్నాడో ఆ పాఠకుల నుండి వస్తుంది.

ఆ రకంగా రా.వి.శాస్త్రి ధన్యుడు. ఆయన పాఠకులు ఆయన్ని గుర్తించారు. గౌరవించారు.

ఆయన చివరి వరకూ రాస్తూ, అన్వేషిస్తూ కాలం గడిపాడు. ఆయన రచనలు చదివాక ఆ ప్రభావం లేకుండా ఉండటం అసాధ్యం. అలానే రాయాలని పిస్తుంది కూడా. జీవితం ఎప్పుడూ వివాద భరితమే!

అందుకే రచయితలూ, వారి రచనలూ, వారి జీవితం కూడా వివాదాలకు అతీతంగా ఉండవు.

వాటిని విశ్లేషించే వారిని కూడా మనం ఈ దృష్టితో చూస్తే మేలు జరుగుతుందేమో!

ఇంతకూ విశ్లేషణ మంచికా ? చెడుకా ?

సృజనకా ? విధ్వంసానికా ?

విశ్లేషకే కాదు ప్రతి రచయితా, ప్రతి మనిషి కూడా ఈ ప్రశ్నల నుండి ఆరంభం అయితే తనకు తానూ, ఈ సమాజానికి మేలు చేసిన వాడవుతాడు.

రా.వి.శాస్త్రి ఏ ప్రజల కోసం ఆరాట పడ్డాడో వారందరూ ఆయన్ని మరచిపోరు. 'ఆయన మరణించటం నిజమే. ఆయన జీవించటమూ నిజమే'.

## మహారాష్ట్ర భూకంప బాధితులకు "అక్షర విరాళం"

సమస్త సాహితీ మిత్రుల కెల్లరకు తెలియపరచడము ఏమనగా ఈ మధ్య మహారాష్ట్రలోని లాతూర్, ఉస్మానాబాదు జిల్లాల్లో జరిగిన భూకంపములో ఆప్తులను, ఆస్తులను సర్వస్వాన్ని కోల్పోయి హృదయ విదారకంగా విలపిస్తున్న భూకంప బాధితుల కన్నీటి గాథలకు అక్షర రూపకల్పన చేస్తూ సాహితీ మిత్రులెల్లరు స్పందించి ఆ యొక్క కన్నీటి ధారలను మీ అమూల్య అక్షరాల ఓదార్పుతో కవితలు, పాటలు ఆహ్వానిస్తూ, ఒక కవితా సంకలనము వెలువరించడానికి నిర్ణ

కావున సాహితీ మిత్రులెల్లరు సహకరించి ఈ ప్రకటన వెలువడిన వారం పది రోజులలోగా తమ కవితలనూ పాటలను ఈ క్రింది చిరునామాకు పంపగలరని మనవి చేయుచున్నాము. గూడ అంజయ్య, 4-45, బెయవాడ, ఉట్నూరు 504 311 ఆదిలాబాద్ జిల్లా.

డిసెంబర్ 6, బాబ్రీ మసీదు కూల్చివేతకు నిరసనగా...

# మతోన్మాదులను తరిమి కొడదాం

మతోన్మాదులు చెలరేగి మతోన్మాదులు చెలరేగి
మనుషులను చంపసాగె మనుషులను చంపసాగె హా....
మేలుకోవాలి మేలుకోవాలి కూలన్నలారా మేలుకోవాలి
ఈ మతోన్మాద బీజేపోడి ఘోరీకట్ట సాగి రావాలి
రాముడి పేరు చెప్పి గుడినను కడతనంట
కూడూ గూడూ లేని వాల్లనూ కుక్కలా చంపిచా సాగె హా....
రాముడిపై భక్తి కాదన్నా ఈ దొంగ కొడుకులు రాజ్యమేలుటంకు కోరన్నా
॥మేలుకోవాలి॥

భారత దేశంలోన బహు మతాలు ఉండరాదు
హిందు మతమె ఉండాలంటు హిందు రాజ్యం స్థాపిస్తామంటు
హిందువులను కాని వాల్లనూ కూలన్నలారా
హింసించి చంపుతా అంటాడు ॥హింసించి॥ ॥మేలుకోవాలి॥

అరె బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు
దళితులు బానిసలంటు ముడ్డికి తాటాకు కట్టి
నోటికి ముంతను కట్టి చెవులో సీసాము పోసిన
హిందు మతము గొప్పదంటు ఇకిలిస్తు బతికెటోడు
అంబేద్కర్‌ను పొగడ్తున్నడు ఓ అన్నలారా వాడు కొత్త ఎత్తు వేస్తుండు
॥అంబేద్కర్॥ ॥మేలుకోవాలి॥.

మానవత్వాన్ని మంటగలిపె హిందు మతోన్మాదం మహమ్మదీయ మతోన్మాదం
క్రైస్తవ మతోన్మాదం సిక్కు మతోన్మాదం హా....
ఏ మతోన్మాదం పెరిగినా ఓ అక్కల్లారా ఒక్క మనిషి మిగలడోరన్నా
॥మతోన్మాదం॥ ॥మేలుకోవాలి॥

మతం ఒక మత్తు అని కులం ఒక కుల్లు అని
మార్క్స్ చెప్పిన మాటనేమో మదిలోన తలచుకొని
మనమంత పోరు చెయ్యాలి ఓ అన్నలారా మతోన్మాదులు తరిమి కొట్టాలి
॥మనమంత పోరు॥

— రసూల్



# రచయితలపై, పాత్రికేయులపై మత తత్వవాదుల వీరంగం

— కె. రవిబాబు

మత తత్వవాదుల ఉన్మాద చర్యలు ఏ విధంగా పాసిజాన్ని గుర్తుకు తెస్తున్నాయో గతంలో ఈ శీర్షికలో ప్రస్తావించాం. పాసిస్టు పోకడలు రానురాను ఉధృతమౌతున్న దృష్ట్యా లౌకికవాదులు మరింత సంఘటితంగా తీవ్రమైన ప్రతిఘటన ప్రదర్శించాల్సిన అవసరం కనబడ్తోంది.

తాము నమ్మిన 'రామ జన్మభూమి నిషేధాన్ని' తిరస్కరిస్తూ, బాబ్రీ మసీదు కూల్చివేతను ఖండించే పాత్రికేయులూ, కళాకారులూ, రచయితలపై ఇటీవలి కాలంలో జరిగిన దాడులను ముందు స్థూలంగా ప్రస్తావిస్తాను.

బ్లిట్జ్ (వుర్దూ) వార పత్రిక సంపాదకుడు హరూన్ రషీద్ ఇంటిపై పడి, ధ్వంసం చేసారు బొంబాయిలోని శివసేన 'సైనికులు'. ఉజ్జయిని ఉమెన్స్ కాలేజి ప్రిన్సిపాల్, సుప్రసిద్ధ హిందీ కవి చంద్రకాంత్ దేవతాలాకుఅజ్ఞాత వ్యక్తులు ఫోన్‌లు చేసి బెదిరించారు. సాహిత్య అకాడమీ పత్రిక 'సమకాలీన భారతీయ సాహిత్య' సంపాదకుడు, కవి గిరిధర్ రాఠీ 'అయోధ్యలో జరిగింది హైందవం కా'దని రాస్తే ఆయనను ముస్లిములలో కలిసిపొమ్మని వెక్కిరిస్తూ, బెదిరింపులు చేశారు. హిందూ మత తత్వవాదులు హిందీ దిన పత్రిక 'జనసత్తా' సంపాదకుడు ప్రభాష్ జోషికి 600 బెదిరింపు ఉత్తరాలూ, 60 ఫోన్ చేసి వచ్చి చికాకు పెట్టాయి. ప్రముఖ చిత్రకారుడు ఎమ్.ఎఫ్. హుస్సేన్ బొంబాయి నగరం వదిలి ఢిల్లీ వెళ్ళాల్సిన పరిస్థితి వచ్చింది. చిత్రకారుడు, రచయిత ఫోన్‌కాల్స్‌లోని బెదిరింపులతో కేరళకు 'విశ్రాంతి'కి వెళ్ళాల్సి వచ్చింది. మళయాళ రచయిత సుకుమార్ అళికోడ్ పై దాడి జరిగింది. తబలా కళాకారుడు ఉస్తాద్ అల్లా రాఖా ఇంటిపై దాడి జరిగింది. 'అయోధ్యలో రావణకాష్టం' రచయిత, అరుణోదయ (విప్లవ సాంస్కృతిక సంస్థ) అధ్యక్షుడైన దివి కుమార్‌కు కుటుంబ సభ్యులతో ఆ పుస్తకం ప్రచురించిన ప్రచురణకర్తలతో సహా చంపివేస్తామని బెదిరింపు లేఖ వచ్చింది. దేశ వ్యాప్తంగా పాత్రికేయులపై, ఫోటోగ్రాఫర్లపై, కళాకారులపై ఇటువంటి ఆంక్షలను మతతత్వ వాదులు విధించి దాడులు చేసి, చేస్తున్న సంఘటనలు ఎన్నో వున్నాయి.

ఇవన్నీ ఒక ఎత్తుకాగా, బొంబాయి నగరంలో వున్న ఫాసిస్టు మత సంస్థ 'శివసేన' ఆగడాలు మరొక ఎత్తుగా వున్నాయి. రాష్ట్ర ప్రభుత్వమే ఈ శివసేనకి భయపడి పోతోంది! దీని ఆగడాలకు పరాకాష్టగా, ఇరాన్‌కు చెందిన ఖొమైనీ రుష్దీ అనే రచయితకు మరణశిక్ష విధించినట్లుగా, శివసేన 'సేనాధిపతి' బాల్‌థాకరే తమను విమర్శిస్తున్న 'మహానగర్' పత్రిక సంపాదకుడు నిఖిల్ వాగ్లేలాంటి 'దేశద్రోహు' లను చంపేయమని పిలుపిచ్చాడు! శివసేన బొంబాయిలోని తమకు వ్యతిరేకంగా వున్న వేదికలపై 1970 నుండి దాడులు చేస్తూనే వుంది. అప్పటి నుండి ఎవరు ముఖ్యమంత్రిగా వున్నా శివసేనను అదుపు చేయడానికి ప్రయత్నించలేదు. మత హింసతో అతలాకుతలమౌతున్న బొంబాయిలో శాంతిభద్రతల పునరుద్ధరణకోసం ముఖ్యమంత్రిగా వచ్చిన శరద్‌పవర్ కూడా శివసేనకు కళ్ళాలు వేయటానికి ప్రయత్నించలేదు .... డిసెంబర్ 92, జనవరి 93 అల్లర్లలో అరెస్టయిన శివసేన కార్యకర్తలలో అత్యధికులను చడీ చప్పుడు లేకుండా విడుదల చేశాడు. బాల్‌థాకరేను ఒక హెచ్చరిక చేసి వుంచే - శివసేన ఒళ్ళు దగ్గర పెట్టుకునేది. ముఖ్యమంత్రీ, కేంద్ర ప్రభుత్వమూ నిమ్మకు నీరెత్తినట్లు కూర్చున్నారు. జాతీయ చలన చిత్రాభివృద్ధి సంస్థ నిర్మించిన 'ధారవి' సెన్సార్ సర్టిఫికెట్ పొందినా శివసేన సర్టిఫికెట్ దీనికి లభించని కారణంగా, చిత్రాన్ని ప్రదర్శించలేక పోయారు. సరే - అంతకు ముందు పాకిస్తాన్ క్రికెట్ టీం బొంబాయిలో ఆడటానికి వీలులేదని ప్రకటించి ఆటస్థలాన్ని త్రవ్వి పారేసారు ఈ సైనికులు!

1966 లో ప్రారంభమైన నాటినుండీ, ఈ ఫాసిస్టు సంస్థ - శివసేన, నిర్మాణ యుతమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి వ్యతిరేకంగా దాడులు, హత్యాకాండ నిర్వహించింది. బొంబాయిలో వున్న మహారాష్ట్రేతరులకు వ్యతిరేకంగా, దళితులకు వ్యతిరేకంగా, ప్రజాస్వామ్య వాదులకూ, లౌకికవాదులకూ, సహనశీలురకూ వ్యతిరేకంగా, హింసాయుత చర్యలను చేపట్టింది. 1968 నుండి 1993 వరకు అంటే దాదాపు పావు శతాబ్దంపాటుశివసేన, ఇతర పాత్రికేయులపైచేసిన దాడులనుది "సండే టైమ్స్ఆఫ్ ఇండియా" పరిశీలించింది.

1968 లో 'మరాఠీ' పత్రికకు చెందిన ఆచార్య అత్రేపై; 1968లో నవశక్తి ఎడిటర్ పి. ఆర్. బెహరేపైనా; 1970లో 'సోబత్' ఎడిటర్ జి. వి. బెహరేపైనా; 1991లో 'ముంబై సకాల్' ఎడిటర్ ఎమ్. గద్కారి; అదే సంవత్సరం "ఇండియా టుడే" పత్రిక ప్రతినిధి కుశ్వంత్ సింగ్‌పైనా, 1993 ఏప్రిల్‌లో "ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా"కు చెందిన నాన్సీ లిడ్జానియా మొదలగు వారిపై శివసేన దాడులు జరిపింది. వాంఖేడ్ స్టేడియాన్ని తవ్వేసి, ఇండియా - పాకిస్తాన్ క్రికెట్ పోటీ

జరక్కుండా చేసినందుకు 'మహానగర్' సంపాదకుడు నిఖిల్‌వాగ్లే 1991 అక్టోబరులో శివసేనను విమర్శించినందుకు ఆ పత్రికపై దాడి చేసారు.

నిఖిల్‌వాగ్లే శివసేనకు బద్ధ శత్రువయ్యాడు. అతను ఏనాడూ శివసేనకు భయపడలేదు. ఫలితంగా ఈ సంవత్సరం ఆగస్టు 8న, హిందీ పత్రకార్ సంఘంలో వున్న నిఖిల్ వాగ్లేపై శివసేన గూండాలు దాడి చేసారు. 'జనసత్తా'కు చెందిన బద్ధియ మహా ప్రాత్రికేయులపై శివసేన గుండాలు దాడి చేశారు. [illegible] శివసేనకు చెందిన కార్మిక సంస్థకు వ్యతిరేకంగా రాసినందుకు 'ఆజ్ దినాంక్' మరాఠీ పత్రిక కార్యాలయంపై దాడి చేశారు. ఆగస్టు 23న జర్నలిస్టులు ఏర్పాటు చేసిన సమావేశాన్ని భగ్నం చేయాలని శివసేన ప్రయత్నించింది. ఆగస్టు 28న వనమాలి హాలులో 'పత్రికలపై దాడులకు వ్యతిరేకంగా కార్యాచరణ కమిటీ' ఏర్పాటు చేసిన సభలో బి. బి. సి. కి చెందిన నరేష్ కౌశిక్‌పై దాడి జరిగింది. నిఖిల్‌వాగ్లే కారును ధ్వంసం చేశారు. ఆగస్టు 31న ఈ దాడులను నిరసిస్తూ వాగ్లే చేసిన ప్రదర్శనపై సమావేశంపై దాడి చేశారు. గుర్‌గావ్‌లో 'పర్యాయ్' పత్రిక మాజీ సంపాదకునిపై దాడిచేసి అతని కారుపై రాళ్ళ వర్షం కురిపించారు. సెప్టెంబర్ 5న మజ్‌గావ్‌లో ఈ దాడులపై నిరసన తెలియచేస్తూ ఏర్పాటు చేసిన సభలో 'ఉర్దూ టైమ్స్' సంపాదకుడు సాజిద్ రషీద్, హిందీ 'మహా నగర్' సంపాదకుడు అనురాగ చతుర్వేది, రిపబ్లికన్ పార్టీ నాయకుడు – పీరిపై సోడా సీసాలతో, రాళ్ళతో దాడి చేశారు. ఈ దాడిలో 'మహానగర్' రిపోర్టర్ దివాకర్ పిణ్ణాలె బలి పగలగా హాస్పిటల్లో చేర్చారు. ఈ సంఘటనల పరంపరను దృష్టిలో వుంచుకొని సెప్టెంబర్ 11న బొంబాయిలో ఉదయం 11 నుండి సాయంత్రం 5 వరకు శివసేన ప్రధానకార్యాలయం 'సేనాభవన్' ముందు దేశ వ్యాప్తంగా తరలివెళ్ళిన 500 మంది పాత్రికేయులు తమ నిరసన తెలియచేశారు. ధర్నా నిర్వహించారు. మతతత్వ వాదుల దాడులకు గురౌతున్న బాధితులకు తమ సంఘీభావం తెలియచేసే ఈ ధర్నా, ఈ ప్రదర్శన అపూర్వమైనవి. మతతత్వ వాదులు విధిస్తున్న ఆంక్షలూ – నిషేధాలను ఈ విధంగా ప్రతిఘటించడం లౌకిక వాదులకు ఎంతో ఆనందదాయకమైన విషయం.

### రుష్దీ గురించి మరి కొంత :

ఖొమైనీ విధించిన మరణశిక్షకు పాత్రుడైన రుష్దీ గత నాలుగున్నరేళ్ళుగా అజ్ఞాతంలోవున్నాడు. అప్పుడప్పుడు బయటికి వస్తుంటాడు. ఖొమైనీ – రుష్దీని చంపిన వారికి 1.3 మిలియన్ల పౌండ్లు బహుమతి ప్రకటించాడు. గత 4 1/2 ఏళ్ళుగా రుష్దీ 80 చిరునామాలు మార్చాడు. నార్వేలో రుష్దీ పుస్తకాన్ని ప్రచురించిన విలియం

సైగార్డ్‌పై ఇరానీ టెర్రరిస్టులు కాల్పులు జరిపారు. ఓస్లోలో రుష్దీని బహిరంగంగా సమర్థించిన వానిపై కాల్పులు జరిగాయి. రుష్దీ పుస్తకాన్ని జపనీస్ భాషలోకి అనువదించిన వానిపై రెండేళ్ళ క్రితం కత్తితో దాడి జరిగింది. తీవ్రమైన గాయాలు తగిలాయి. రుష్దీ నవలపైవిధించిననిషేధాన్ని-విమర్శించినందుకు—జామియా మిలియా విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ ముషిరుల్‌హసన్ ఇంటిపై రాత్రిపూట దాడి చేసారు — ఆయన్ని చంపివేయడానికి.

## సునీల్ గంగోపాధ్యాయపై జార్ఖండ్ అంక్షలు :

ఇటీవల సునీల్ గంగోపాధ్యాయ బెంగాలీ పక్ష పత్రిక 'దేశ్'లో రాస్తున్న సీరియల్ నవల 'ప్రథమ అలో' (మొదటి కాంతి)లో మహేంద్రలాల్ సర్కార్ అనే పాత్ర కాళీ దేవతను 'భీభత్స సంతాలీ మాఝీ' అని వర్ణించాడు. ఈ వర్ణన జార్ఖండ్ పార్టీశాసనసభ్యుడు నరేన్ హంస్‌దామా, ఆయన అనుచరులైన గిరిజనులకూ ఆగ్రహాన్ని కల్గించింది. సంతాలీల భీభత్స దేవత అనడం గిరిజనులను అవమానించడమే ననీ, దీనికి వ్యతిరేకంగా నిరసన తెలియచేస్తూ ఒక బహిరంగ ప్రదర్శనకు పిలుపు ఇవ్వడమేగాక, సునీల్‌ను ఖైదు చేయాలని డిమాండ్ చేశారు.

## బంగ్లాదేశ్‌లో తస్లీమా నస్రీన్‌పై ఫత్వా :

గతంలో ఇస్లాం మతం గురించి చేసిన వ్యాఖ్యానాలకు బంగ్లాదేశ్ ప్రధాన మంత్రి షేక్ ముజిబుర్ రహమాన్ దావూద్ హైదర్ అనే కవిని బంగ్లాదేశ్ నుంచి బహిష్కరించాడు.

ఇక ఇప్పుడు సరికొత్తగా, సిల్హెట్‌లో వున్న ఒక చిన్న మత సంస్థ. బంగ్లాదేశ్ సాహాబా సైనిక పరిషత్' తస్లీమా నస్రీన్ (31) అనే రచయిత్రికి మరణశిక్ష విధించింది. 5000 మంది ప్రజలు హాజరైన సభలో, మౌల్వీలు ఈ శిక్ష విధించారు. దీన్ని అమలు చేసిన వారికి 50 వేల టాకాలు బహుమతి ప్రకటించారు. అక్టోబర్ 8న ఒక హర్తాళ్ కూడా చేశారు.

నిజానికి 2 1/2 సంవత్సరాల క్రితం తస్లీమా నస్రీన్ పేరు ఎవరికీ తెలియదు. ఆమె జనరల్ హెచ్. ఎమ్. ఎర్షాద్ పతనం తర్వాత 1990 లో తన రచనావ్యాసంగాన్ని, వ్యాసాలు రాయడం ద్వారా ప్రారంభించింది. పురుషాధిపత్యం, స్త్రీల అణచివేత - ప్రత్యేకంగా ఇస్లామిక్ చట్టాల్లోగల అసమానత్వం మొదలగు అంశాలను ధైర్యంగా ప్రశ్నించింది. గతంలోనూ స్త్రీ స్వేచ్ఛ కొరకు పోరాడిన వారున్నారు. కాని నస్రీన్ పట్ల వ్యతిరేకత రావడానికి కారణం ఆమె వాడే దూకుడు శైలి. ఇది ఛాందసులకు ఆగ్రహాన్ని తెప్పించింది. ముందు చిన్న చిన్న వూరేగింపు

లతో నిరసన మొదలైంది. తస్లీమా రచనలను పత్రికలు బహిష్కరించాలన్నారు. నిషేధించాలన్నారు. చివరికి ఆమెను విచారించి వురి తీయాలన్నారు.

నస్రీన్ ఇప్పటికి ఆరు కవితాసంకలనాలను, మూడు వ్యాసాల సంకలనాలను, ఆరు నవలలను రచించారు. ఇటీవల 1993 ఫిబ్రవరిలో ఢాకాలో జరిగిన బంగ్లా అకాడమీ బుక్ ఫెయిర్‌లో ఆమె రాసిన 79 పేజీల నవల 'లజ్జ' (సిగ్గు)ను విడుదల చేసారు. దీనిని ఆమె కలకత్తా నవలా రచయిత బుద్ధదేవ్ గుహాకు అంకితం ఇచ్చారు ఈమె వ్యాసాల్లో లైంగిక వర్ణనలూ, సెక్స్ భాగాలను పచ్చిగా వర్ణించ టాలూ వుండటాన్ని నిరసించిన వారి ఆగ్రహం, 'లజ్జ' నవలలోని కథా వస్తువు మరింత కోపాన్ని తెప్పించింది. బాబ్రీ మసీదు కూల్చివేత సంఘటన తర్వాత బంగ్లా దేశ్‌లో మైనారిటీగా వున్న హిందువులపై జరిగిన దురాగతాలు ఈ నవల కథా వస్తువు మత విద్వేషాలను రెచ్చగొట్టే స్వభావం వుందని, ఈ పుస్తకాన్ని విడుదల అయిన ఏడు నెలల తర్వాత ఖలీదా జియా ప్రభుత్వం నిషేధించింది. అయితే ఈనిషేధాన్ని ప్రజా సాహితీ సాంస్కృతిక సంస్థలు, వ్యక్తులు-ప్రొఫెసర్ అహ్మద్ షరీఫ్, జస్టిస్ కె. ఎమ్. సోభన్ తదితరులు విమర్శించారు.

బంగ్లాదేశ్‌లో ఫత్వా (మతసంస్థలు జారీచేసిమరణశిక్ష) ఒక మేధావిపైఉపయోగించటం ఇదే మొదటిసారి. "ముస్లిం ఛాందస సంస్థలకు క్రమంగా తగ్గుతున్న పలుకుబడిని రక్షించుకోవానికే ఇలా చేసా"రని నస్రీన్ అభిప్రాయపడింది. ఈ మత సంస్థలు చిన్న చిన్న పట్టణాలల్లో, గ్రామాలల్లో ఈ ఫత్వాలు విధిస్తూనే వున్నారు. సిల్హెట్‌లోనే ఇటీవల నూర్జహాన్ అనే యువతి ఈ ఫత్వా బాధితురాలైంది. మరో సందర్భంగా ఇద్దరు స్త్రీలను రాళ్ళతో కొట్టి చంపే శిక్ష విధించారు.

నస్రీన్‌పై ఛాంద సవాదుల బెదిరింపులను నిరసిస్తూ, స్నేహాకల్ సేన్ అనే యువ కవి నాయకత్వాన సంతకాల సేకరణ ఉద్యమం ప్రారంభమైంది. బెంగాలీ రచయిత శీర్షేందుముఖర్జీ, అభ్యుదయ, ప్రజాస్వామిక శక్తులన్నీ తస్లీమాను బల పర్చాలని విజ్ఞప్తి చేశారు - కలకత్తాలోని బంగ్లాదేశ్ డిప్యూటీ హైకమీషనర్ కార్యాలయం ముందు ఆనంద శంకరరాయ్,శంఖుఘోష్, ప్రొఫెసర్ హీరేంద్రనాథముఖర్జీ డా॥ అన్వర్ ఖాయిూన్, మైత్రేయీ చటర్జీ మొదలగు వారు నస్లింఛాంద సంస్థలకు వ్యతిరేకంగా తగుచర్యలు తీసుకోవాల్సిందిగా కోరుతూ ప్రదర్శన జరిపారు.

ఢాకా మెడికల్ కాలేజి హాస్పిటల్‌లో గైనకాలజీలో డాక్టరుగా పనిచేస్తున్న తస్లీమా, ఇటీవల జనవరిలో ప్రభుత్వం తన పాస్‌పోర్టును ఉపసంహరించినందుకు నిరసన సూచకంగా తన ఉద్యోగానికి రాజీనామా చేశారు. తనను గనుక దేశం

నుంచి బహిష్కరిస్తే, దాన్ని నేను అంగీకరించననీ, విదేశాలలో రక్షణ కోరను, తన దేశంలోనే చనిపోతాననీ, తన నుండి ఉత్తేజాన్ని పొందే వందలాది తస్లీమాలు పుడతారు అన్నారు. 'రచయితలు సామాజిక మార్పుకు ప్రతినిధులు, వారికి భావ స్వాతంత్ర్యం, వాక్స్వాతంత్ర్యం వుండాలి. రచనల బాగోగులు పాఠకులకు వదిలియాలి. రుష్దీ పైపై ఫత్వా విధించాడాన్ని ఖండిస్తాను." అన్నారు నస్రీన్.

మృణాల్ సేన్ ఈ ఫత్వాను 'అనాగరికమూ, అనైతికమూ' అన్నారు. రచయిత, పాత్రికేయుడు అమితాబ్ చౌదరి, "మత గురువులకు సాహిత్య విషయాలలో కలుగ చేసుకునే హక్కు" లేదు అన్నారు. ఢిల్లీలోని జామామసీదు చెందిన నయీబ్ ఇమామ్ నస్రీన్‌కు శిక్షవిధించడాన్ని ఖండించారు. "ఏ మతమైనా అణచివేతను సమర్థించదు మైనారిటీలపై అణచివేతను – అది ఇండియాలో కావచ్చు బంగ్లాదేశ్‌లో కావచ్చు. బోస్నియాలో కావచ్చు – ఖండిస్తాం. గత డిసెంబర్‌లో హిందూ దేవాలయాలను ధ్వంసం చేయడాన్ని ఖండించాం." అన్నారు. 'సయీదాలియా' అనే ఉర్దూ పత్రిక ఎడిటర్ షహీద్ సిద్దికీ, అక్టోబర్ 13న తానే అధ్యక్షునిగా 'మతతత్వ వ్యతిరేక రచయితల వేదిక'ను ప్రారంభించారు. మార్కానీ జమాయత్ ఉలేమా అనే ఆధ్యాత్మిక సంస్థ ప్రధాన కార్యదర్శి అయిన మౌలానా ముజైబ్ అహ్మద్, "ఆ పుస్తకంలో ఏమివున్నా, మరణ శిక్ష విధించడం సరైనది కాదు. చట్టాల ప్రకారం కేసు పెట్టి ఏ శిక్షనైనా విధించుకోవచ్చు" అన్నారు.

ముస్లిము సంస్థలకు సలహాలిచ్చే సంస్థ మజ్లిస్ - ఎ. ముషారత్‌కు చెందిన మౌలానా అహ్మద్ అలీ కాసిం ఈ మరణశిక్షను ఖండించారు. ప్రొఫెసర్ ముషిరుల్ హుసేన్ ఈ విషయమై తీవ్రంగా స్పందిస్తూ "ఆధునిక రాజ్యంలో ఈ ఫత్వాలు ప్రకటించడం ఆశ్చర్యంగా వుంది. రచయితలకు భావ స్వాతంత్ర్యం వుండాలి. దాన్ని ప్రభుత్వంగానీ, మత నాయకులు కానీ హరించ కూడదు" అన్నారు.

ఢిల్లీలోని మహిళా సంఘాలన్నీ తస్లీమా నస్రీన్‌కు తమ సంఘీభావాన్ని తెలియచేసాయి. అఖిలభారత ప్రజాతంత్ర మహిళా సంస్థకు చెందిన బృందా కరాత్ "మా సంస్థ కలకత్తాశాఖ ద్వారా బహిరంగ సభలు నిర్వహించి తస్లీమాకు సహకారాన్ని ప్రకటించాం. ఫత్వా విధించిన వారిపై చర్యతీసుకోవాలని, నస్రీన్‌కు రక్షణ కల్పించాలనీ" కోరాం అన్నారు. "ఫత్వా విధించి ఒక స్త్రీని చంపాలని అన్నవాడు నేరస్తుడు, హంతకుడు అవుతాడు. వాడిది మత వాదమూ కాదు. ఛాందసతత్వమూ కాదు. వాడిది నేర మనస్తత్వం - బంగ్లాదేశ్‌లోనే నస్రీన్‌ను బలపరిచేవారుండటం ఆనందదాయక"మని మానుషి సంపాదకురాలు మధుకిష్వర్ ప్రకటించారు.

ాార్మిక సంస్థకు చెందిన సుభద్రా బుటాలియా "బాబ్రీమసీదు సంఘటనకు ఇది ప్రతిస్పందన అన్న విషయాన్ని మరచిపోగూడదు. గతంలో ఇంగ్లాండ్‌లో థామస్ హార్డీ నవలలు తగులబెట్టబడ్డాయి. కేరళలోని ఒక స్కూలు ప్రిన్సిపాల్ తన విద్యార్థులు టోపీ ధరించడాన్ని అనుమతించక పోవడంతో, ఆయనకు బెదిరింపు లేఖలు వచ్చాయి. ఈ ధోరణిని అణచి వేయాలి" అన్నారు.

ముస్లిములను కించపరచిందని నస్రీన్‌పై ముస్లిం మత ఛాందసులు ఆమెపై ధ్వజమెత్తితే, మరోవైపు హిందువులను సమర్థించిందన్న భావంతో భారతీయ జనతా పార్టీ (బి. జె. పి) దాని అనుబంధ సంస్థలు నస్రీన్‌ను సమర్థిస్తూ ప్రకటనలు ఇచ్చి మత విద్వేషాన్ని రెచ్చ గొడ్తున్నాయి. ఈ సంస్థలే మరల తమ మత విశ్వాసాలకు భంగం కల్గించదంటూ - రాముడు - సీతలను అన్నా చెల్లెళ్ళుగా చూపించారనీ - "సహమత్" ప్రదర్శనపై ఆగ్రహాన్ని కురిపించారు. తమ దేవుళ్ళనుకార్టూన్లలో ఇరికించినా వారికి కోపం వచ్చేస్తోంది. ఏ మత తత్వ వాదాన్నైనా సమానంగా ఎదుర్కోవడమే సరైన మార్గం.

తస్లీమా నస్రీన్ తన రచనల్లో వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ సమర్థించడం సాధ్యం కాదు - పురుష స్వేచ్ఛపై కొన్ని అభ్యంతరకరమైన భావాలను కూడా ఆమె వెలిబుచ్చారు - రచయితలపై మత సంస్థలు కానీ, ప్రభుత్వాలు కానీ విధించే ఆంక్షలనూ, నిషేధాలనూ ఖండిస్తున్నాం. భావ ప్రకటనా స్వేచ్ఛకు ఎవరూ అటంకం కల్గించరాదు. అటువంటి ఆంక్షలకూ, నిషేధాలకూ వ్యతిరేకంగా ఉద్యమించుదాం.

"రావిశాస్త్రి ఈ దేశపు, ఈ కాలపుమేధావివర్గం చేత బ్రహ్మారథం పట్టించుకో గల రచయిత. ఆయన కథలు చదివినాక, చదవక ముందున్న స్థితిలోనే ఉండ గలవాడు పరమ జడుడై ఉండాలి. ఆయనలో ప్రచార గుణం ఉన్నది. పాఠకుణ్ణి కాలరు పట్టుకు నిలవేసే లక్షణం ఉన్నది. శిల్ప వైవిధ్యం ఉన్నది. నూతన ప్రయోగాలు చేసే సమర్థత ఉన్నది...."

— కొడవటిగంటి కుటుంబరావు

# రా. వి. శాస్త్రి కథలలో స్త్రీ పాత్రల చిత్రణ

— కావూరి అనూరాధ

"రా.వి శాస్త్రి కథల్లో పలికించిన ప్రజా జీవితం ఆ ప్రజల జీవితాన్ని మనకు పరిచయం చేయడం కోసం రాసినట్టు తోచదు. వాళ్ళ జీవితాన్ని సాధనంగా తీసుకుని సమాజాన్ని, మాయను విమర్శించడం వాటి ప్రయోజనం. కథకునిగా రావి శాస్త్రి బలమూ అదే, బలహీనతా అదే."

—సురా

రావి శాస్త్రి సాహిత్యం గురించి ప్రత్యేకించి పరిచయం చేయవలసిన పని లేదు. కల్పనా చాతుర్యంలో రావి శాస్త్రిది అందెవేసిన చెయ్యి. సురా చెప్పిన "బలమూ, బలహీనత" శిల్పం విషయంలో కూడా అన్వయించుకోవచ్చు. రావి శాస్త్రిని అభ్యుదయ రచయితగా కొందరు చెబితే, అభివృద్ధి నిరోధక భావజాలం గల మరి కొందరు "ఆయన బాగానే రాస్తాడు. కాని కమ్యూనిజం చెబుతాడు" అంటారు. రావి శాస్త్రి శిల్పం సాధించిన విజయం, అపజయం కూడా ఇదేనంటే అతిశయోక్తి కాదు. భౌతిక ప్రపంచంలో 20వ శతాబ్దంలోనూ, మానసిక ప్రపంచంలో ఇంకా వెనుక జీవిస్తున్న వాళ్ళు రావి శాస్త్రిని మెచ్చుకున్నారంటే ఆయన తన రచనా వైవిధ్యం కన్నా శిల్పంతోనూ, నోరూరించే వర్ణనలతోనూ ఆకట్టుకుంటున్నారని మనం భావించక తప్పదు.

ఇక రావి శాస్త్రి పాత్రల విషయానికి వస్తే అవన్నీ ఒక్కొక్క ఫక్కీలో ఒక్కొక్క రకమైన ముడి సరుకులు. అందులో స్త్రీల పాత్రల గురించి చెప్పాలంటే అవి ఒక్క మాటలో "ఉండనట్లు" ఉంటాయి రావి శాస్త్రి కథల్లో స్త్రీలకు దొరికిన స్థానం గొప్పదేం కాదు. వాటికి పెద్దగా ప్రాముఖ్యం ఉండదు. మామూలు రచయితల సాహిత్యంలో స్త్రీలు ఎట్లా అయితే వచ్చి వెళ్ళి పోతారో, రావి శాస్త్రి కథల్లో కూడా స్త్రీలు అట్లా వచ్చి వెళ్ళిపోతుంటారు. అంటే రావి శాస్త్రి స్త్రీ పాత్రలకు ఒక స్వతంత్ర ప్రతిపత్తి వంటిది ఏమీ కనిపించదు.

రావి శాస్త్రికి ప్రజలూ రిఫరెన్స్ పాయింట్సే - స్త్రీలూ రిఫరెన్స్ పాయింట్సే. అంటే ఆయన సమాజంలోని నీతినీ, న్యాయాన్నీ, చట్టాన్నీ, పోలీసులనీ, సారా కమామిషులనీ వివరించడానికి ఎలా అయితే కొందరు సామాజిక జీవులను ఎంపిక చేసుకున్నారో స్త్రీ పాత్రల్ని సైతం అలాగే ఎంపిక చేసుకున్నారు. ఆయన నిర్దిష్టమైన స్త్రీ సమస్యలకు నిర్దిష్టమైన స్త్రీ పాత్రల్ని తీసుకోలేదు.

స్త్రీ పట్ల రావి శాస్త్రి దృక్పథాన్ని ఈ వ్యాసం పరిశీలిస్తుంది. రావి శాస్త్రి రచనల్లో కొన్ని ముఖ్యమైన స్త్రీ పాత్రల్ని తీసుకుని, వాటి చిత్రీకరణ ఆధారంగా

# మత తత్వానికి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎలా పోరాడాలి ?

[AIFTU, నౌజవాన్ భారత సభల అధ్వర్యంలో సెప్టెంబరు 29, 30 తేదీలలో లక్నోలో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక, మతతత్వ వ్యతిరేక సదస్సుకు హాజరైన విప్లవ సంస్థలు, ప్రజాస్వామిక వాదులచే ఆమోదించబడిన తీర్మాన పాఠం]

శత్రువు గురించీ, నీగురించీ సరైన అంచనా వేసుకుంటే, శత్రువులను ఎదుర్కొని, విజయం సాధించడం సులభమౌతుంది" అన్నది బహుళ ప్రచారంలో వున్న సూక్తి. దేశాన్ని మొత్తంగా మత తత్వంలో ముంచెత్తుతున్న ఈనాడు, మైనారిటీలపై (అల్ప సంఖ్యాకులపై) దాడులు ఒక సాధారణ విషయంగా మారిన ఈనాడు మత అల్లర్లు క్రమబద్ధంగా జరుగుతున్న ఈనాడు, మతతత్వం అంటే నిజమైన అర్థం ఏమిటి? దాని మూలాలు ఎక్కడవున్నాయి? అన్నది తెలుసుకోవడం అత్యంత అవసరం. అంతేగాక మత తత్వానికి వ్యతిరేకంగా సమీకరించవలసిన శక్తుల గురించి ఒక అవగాహన ఏర్పరచుకోవాలి.

ఒకే రకమైన విశ్వాసం కల్గి వున్న - ఇండియాలో ఐతే ప్రధానంగా ఒక మత విశ్వాసం కల్గి వున్న గ్రూపు ప్రజలు కాని, ఒక కుల ప్రజలుగాని సంఘటితంగా చేసే ఏ పనినైనా మతతత్వ చర్యగా పిలుస్తున్నాం. అయితే ఇది మరీ అతి సరళీకరణతో కూడిన అవగాహన. ఒక మతాన్ని అణచివేస్తే, లేక దాని హక్కులను కాలరాస్తే, ఆ మతం వారు అణచివేతను వ్యతిరేకిస్తే తన హక్కులు భగ్నం కావడానికి వ్యతిరేకంగా నిరసన తెలియజేస్తే అటువంటి చర్యలను మత తత్వ చర్యలుగా ముద్ర వేయరాదు.

అణచివేత గానీ, హక్కులు భగ్నం చేయడం గానీ లేని సమయంలో, ఒక తప్పుడు భావాన్ని సృష్టిస్తూ, మతం ఆధారంగా ఒక గ్రూపు ప్రజలను సమీకరించడానికి ఉపయోగపడే సైద్ధాంతిక ఆయుధం మత తత్వం అనేది. అటువంటి సమీకరణలు సాధారణంగా మరొక మతానికి వ్యతిరేకంగా గురిపెట్టబడి వుంటాయి. తప్పుడు భావాలూ, చరిత్ర కల్పనలూ, దురభిమాన ప్రచారమూ మతతత్వాన్ని వ్యాపింపచేయడానికి పనికి వచ్చే సాధారణ పరికరాలు. దేశ ఆర్థిక రాజకీయ జీవితం

లోని సాధారణ సంక్షోభం, మతతత్వాన్ని వ్యాప్తిచేయడంలో ఉత్ప్రేరక(Catalist) పాత్రను వహిస్తుంది.

కొన్ని సందర్భాలలో, అణచివేతకు గురయ్యే మతం, అణచివేతను వ్యతిరేకించే ప్రయత్నంలో లేక తన హక్కులను కాపాడుకునే ప్రయత్నంలో, మరోమతానికి వ్యతిరేకంగా జరిగే ఉద్యమానికి నాయకత్వం వహించి, దురభిమాన ప్రతీఘాతుకత్వాన్ని సృష్టించే దృక్పథాన్ని అభివృద్ధి చేయడం జరగవచ్చు. ఇది మొదట పేర్కొన్న తరహా మతతత్వం కాకపోయినా అటువంటి చర్యలు కూడా మతతత్వ పరమైనవిగానే పరిగణించాలి. మొదట పేర్కొన్నది జగడాలమారిదైతే రెండోది ఆత్మ సంరక్షణార్ధకమైనది. మొదటిది తరచుగా రెండో దానికి కారణ భూతంగా వుంటుంది.

ఇండియాలో నేటి పరిస్థితిని పరిశీలిస్తే భారతీయ జనతాపార్టీ, విశ్వహిందూ పరిషత్తు, రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, భజరంగదళ్, శివసేనలు కలిసిన ముఠా, మైనారిటీలకు (అల్ప సంఖ్యాక మత ప్రజలకు) వ్యతిరేకంగా హిందువులను సమీకరించడాన్ని మనం తేలిగ్గా అర్థం చేసుకోవచ్చును. 'మైనారిటీల పట్ల బుజ్జగింపు ధోరణి' ప్రదర్శించబడుతోందన్న తప్పుడు భావాన్ని ఈ ముఠా సృష్టిస్తోంది. బ్రిటీషు సామ్రాజ్యవాదులు సృష్టించిన కట్టుకథల చరిత్రను తమ ప్రచార సాధనంగా ఈ ముఠా వాడుకుంటోంది. ఇరుగు పొరుగు దేశాలకు వ్యతిరేకంగానూ దేశంలోని జాతీయ, మత అల్ప సంఖ్యాక వర్గాలకు వ్యతిరేకంగానూ హిందూ దురభిమానాన్ని రెచ్చగొట్టటానికి ప్రయత్నిస్తోంది. ఈ ముఠా వారు కాంగ్రెస్ (ఐ) చేత ప్రేరేపించబడి, 1980 ప్రారంభం నుంచి అల్పసంఖ్యాక వర్గాలకు వ్యతిరేకంగా హిందువులను సమీకరించడం ప్రారంభించారు. అంటే 1980 లకు ముందు మతతత్వం లేదని కాదు కాని ఇటీవలి కాలంనాటి మతతత్వం తీవ్రతరం కావడం ఆ సమయంలో ప్రారంభమైంది. అంటే దీని అర్థం ఈనాటి ఇండియాలో హిందూమత తత్వమే, మతతత్వ వ్యాప్తికి కారణభూతంగా వున్నది. అది కూడా కలహశీలమైన మతతత్వముగా వుంది. ఇండియాలో నెలకొనివున్న ఈ నిర్దిష్ట పరిస్థితిలో ఈ రకపు మత తత్వానికి వ్యతిరేకంగా పోరాడటం అంటే హిందూమత తత్వానికి వ్యతిరేకంగా పోరాడటమే అవుతుంది.

అయితే ఇవి కేవలం బాహ్య వ్యక్తీకరణలే. ఈ మత తత్వపు మూలాలను కనిపెట్టాల్సి వుంది. మతతత్వానికి వ్యతిరేకముగా జరిగే పోరాటంలో వాటిని బయటకు లాగి, భస్మం చేయాలి. ఇండియాలో బ్రిటీషు సామ్రాజ్యవాదులు, స్వాతంత్ర్య ప్రియులైన భారతదేశ ప్రజలను విభజించడం ద్వారా తమ పరిపాలన కొనసాగించుకోడానికి, పాలన పరిపుష్ట మొనర్చుకోడానికి, మతత్వపు బీజాలను నాటారు.

వారు కావాలని ఒక మతానికి వ్యతిరేకంగా మరో మతాన్ని నిలిపారు. ఇండియాలో వున్న రెండు ప్రధాన మతాల మధ్య చీలిక తేవడానికి వారు చరిత్రలో కాకమ్మ కథలను సృష్టించారు. అంతిమంగా వారు మతం ఆధారంగా ఇండియాను విభజించారు. 1947 తర్వాత భారత పాలకవర్గాలు తమ సామ్రాజ్యవాద యజమానుల చెప్పుల్లో తమ కాళ్ళు దూర్చారు. వారి అడుగుజాడల్లోనే, బ్రిటీషువారు తమ పాలన కొనసాగించుకోడానికి, ప్రజలను చీల్చడానికి ఉపయోగించుకున్న ఆ ఆయుధాన్నే వాడుకోవడం ప్రారంభించారు. ఈనాడు భారత రాజ్యాంగ యంత్రాంగం సామ్రాజ్యవాదులకూ, బడాపెట్టుబడిదారీ భూస్వామ్య విధానానికి సేవలు చేస్తూ ప్రజలపై మొత్తంగా నిరంకుశత్వాన్ని అమలు జరుపుతోంది.

రాజ్యాంగ యంత్రమే మతతత్వాన్ని బాహాటంగా అచరిస్తోంది. ఒక ఉదాహరణ : ఇటీవల ఉత్తర ప్రదేశ్‌లో 240 మంది కానిస్టేబుల్స్‌ను రిక్రూట్ చేసుకుంటే, మైనారిటీ జాతులకు చెందిన ఏడుగురు అభ్యర్థులు వ్రాత పరీక్ష వ్యక్తిత్వ పరీక్షలలో ఉత్తీర్ణత సాధించినా, ఇంటర్వ్యూలలో వారిని తిరస్కరించడం జరిగింది. పోలీసు కానిస్టేబుల్ ఉద్యోగానికి మైనారిటీ జాతికి చెందిన ఒక్కడు కూడా అర్హుడు కాలేకపోయాడు. జాతీయ మైనారిటీ కమీషన్ ఇటీవల ఇచ్చిన ప్రకటన ప్రకారం ప్రభుత్వ ఉద్యోగాలలో ముస్లిముల శాతం 1.5 మాత్రమే వుండటం ఏమాత్రం విచిత్రమైనవిషయం కాదు.

హషీంపురా, మలియానాలలో మైనారిటీలపై జరిపిన హత్యాకాండలో 'ఆపరేషన్ బ్లూస్టార్' లో, బాబ్రీ మసీదును ధ్వంసం చేస్తుంటే మౌన ప్రేక్షకురాలిగా మిగిలిపోయిన రాజ్యాంగ యంత్రమూ, 1954తో ఢిల్లీలో జరిగిన అల్లర్లూ, ఇటీవల బొంబాయితో జరిగిన అల్లర్లు - మొదలగు సంఘటనల్లో భారత రాజ్యాంగ యంత్రమూ, దాని సాయుధ బలగాల పాత్రను కూడా పైవాటికి తోడుగా చేర్చవచ్చు.

పాలక వర్గాలు మత తత్వాన్ని మూడు స్పష్టమైన లక్ష్యాలకు వాడుకుంటు న్నారు. పాలక వర్గాలలో ఏ పార్టీ ప్రభుత్వాధికారాన్ని కైవసం చేసుకుంటుందో తేల్చి వేయడానికి, మత ప్రాతి పదికపై ప్రజలను సమీకరించి ఓటు బ్యాంకులను సృష్టించడం మొదటి లక్ష్యం. అయితే రెండవ లక్ష్యం అత్యంత ముఖ్యమైనది. మొదటిది దీని అనుబంధిత మైనట్టిదే. ఎవరు అధికార పీఠాన్ని అధిష్టించినా, ప్రజాభిప్రాయానికి కొంతైనా ప్రాముఖ్యత ఇవ్వాలన్న విషయం జగద్విదితమే. సానుకూలమైన ప్రజాభిప్రాయాన్ని సాధించాలంటే, పాలక వర్గాలు పాటిస్తున్న సాధారణ పాలనా నియమాల ప్రకారం- ప్రజలకు కొన్ని మినహాయింపులు ఇవ్వడం.... ఈ మినహాయింపులు ఒక్కోసారి సంస్కరణల రూపంలో వుంటాయి. మరోసారి

ప్రజలకు వారి నుంచి తరచు కొల్లగొట్టబడే సాధారణ ప్రజాస్వామిక హక్కులను అనుమతించడంగా వుండవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత సామ్రాజ్యవాద ప్రపంచానికి ఏర్పడిన సాపేక్షమైన సుస్థిరతా, పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి ఇండియాకు సామ్రాజ్యవాదులు పెద్ద ఎత్తున ఇచ్చిన ఆర్థిక సహాయాలూ, బ్రిటీషు వారి ప్రత్యక్ష పాలన అంతమైన వెంటనే భారత ప్రజలలో పెరిగిన చొరవా, ఆశావాదమూ, పైరు పచ్చ విప్లవం అని పిలువబడే కార్యక్రమం యొక్క ప్రథమ దశా, ఇవన్నీ కలసి భారత పాలక వర్గాలకు, అణచబడ్డ కులాలు, జాతుల వారికి గతంలో అనుమతింపబడని మినహాయింపులు ఇచ్చే అవకాశాన్ని కల్గించాయి. కాని సామ్రాజ్య వాదులు 1960 దశకం మధ్య నుంచీ ఒక తీవ్రమైన సంక్షోభాన్ని ఎదుర్కోవడం ప్రారంభించారు. దాని నుంచి వారు బయట పడలేక పోయారు. సామ్రాజ్యవాద దేశాల్లో కనబడే అభివృద్ధి అంతా, ఆ దేశాల వారు మూడవ ప్రపంచ దేశాలపై తమ బరువంతా బదిలీ చేసినందువల్ల వచ్చినటువంటిదే. భారతదేశం దీనికి మినహాయింపేమీ కాదు. కనుకనే ఇండియాలో ఆర్థిక, రాజకీయ సంక్షోభం నానాటికీ తీవ్రతరమైంది. 1980 ప్రారంభ సంవత్సరాల నుంచీ సామ్రాజ్యవాద దేశాల సంక్షోభం మరింత నూతనమైన ఉన్నత దశకు చేరుకుంది. అక్కడ నుండి అవి దిగి రాలేవు. ఇండియాలో సంక్షోభం భరింపరానిదైంది. (Unmanagable). ఈ పరిస్థితిలో సామ్రాజ్యవాదుల ప్రయోజనాలను పరిరక్షించే భారత పాలక వర్గాలకు గతంలో అనుమతించిన రాయితీలను కొనసాగించడం అసాధ్యమైంది అప్పుడు వారు ఒక చిన్న ఆధారం (base) వైపు తమ చూపు మరల్చారు. హిందీ ప్రాంతంలోని హిందు అగ్రకుల స్థావరం (base) చాల ముఖ్యమైనదనీ, దాన్ని జాగ్రత్తగా కాపాడుకోవాలనీ వారు కనిపెట్టారు. సామ్రాజ్యవాదులు తమ విధానాలను ఎంత శక్తివంతంగా భారతదేశంపై రుద్దుతున్నారో, పాలక వర్గాలు ఈ స్థావరాన్ని రక్షించుకోవడంలో అంత ఖచ్చితంగా వున్నారు. నూతన ఆర్థిక విధానమూ, నూతన పారిశ్రామిక, వ్యవసాయ విధానాలు, డంకెల్ డ్రాఫ్టు చేత ఇటీవల ఆదేశింపబడిన విధానాలూ, ఇండియాలోని శ్రామిక శక్తిని పీల్చి పిప్పి చేసాయి. 'నిష్క్రమణ విధానం' (Exit policy) పేరుతో ఎన్నో పరిశ్రమలు మూత పడేట్లు చేసాయి. భారత ఆర్థిక గర్భకోశాన్ని విదేశీ పెట్టుబడికై తెరచి వుంచేట్లు చేసాయి. వీటికి తోడు మత తత్వాన్నీ, కుల తత్వాన్నీ తీవ్రతరం చేయడం వారి విధానాలలో ఒక భాగమై పోయింది. జాతులను అణచి వేయడం, జాతీయ పరమైన, భాషా పరమైన మైనారిటీలనూ, తెగలనూ అణచి వేయడం కూడా ఈ విధానంలో భాగమే. అందుకనే పాలక వర్గ పార్టీలన్నీ హిందీ భాషా ప్రాంతంలోని హిందువులలో ఒక స్థావరాన్ని సృష్టించుకోవడంలో ఒక

దానితో మరొకటి పోటీ పడుతూ వుండటాన్ని మనం గమనించగల్గుతున్నాం., పాలక వర్గ పార్టీలన్నీ హిందూ మత తత్వ వాదాన్ని బలపరుస్తున్నాయి, రెచ్చ గొడుతున్నాయి. సి.పి.ఐ, సి పి.ఎమ్ లాంటి పార్టీలు కూడా లౌకిక వాదాన్ని నోటి మాటగా సమర్థిస్తున్నాయి. అన్ని రకాల మతతత్వ వాదాలకూ, ఛాందస వాదాలకీ అభివృద్ధి నిరోధక వాదాలకూ వ్యతిరేకంగా నిర్దిష్టమైన లక్ష్యంగా పెట్టుకోవడం ద్వారా, సి పి.ఐ, సి.పి ఎం. పార్టీలు హిందూ మతతత్వ వాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటం పదును కోల్పోయేటట్లు చేస్తున్నాయి. వోటు బ్యాంకుల కొరకు జరిపే పోరాటం ఈ విధానంలో భాగమే.

కనుకనే భారతీయ జనతా పార్టీకి నరసింహారావు ప్రభుత్వపు ఆర్థిక విధానాల పై మౌలికమైన తేడాలేవీ లేవు. అలాగే సి.పి.ఎమ్. నాయకత్వాన గల పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం, కేంద్రం అనుసరిస్తున్న విధానాలనే రాష్ట్రంలో అనుసరిస్తోంది.

ఇక మూడోది జగత్ప్రసిద్ధమైన, పాతకాలపు 'విభజించి-పాలించు' సిద్ధాంతం. భారతదేశంలో అయితే ప్రజలను మతపరంగా విభజించి పాలించడమన్న మాట. సామ్రాజ్యవాద ప్రయోజనాలను రక్షించి ఈనాటి పాలకవర్గం కూడా ఇదే విధా నాన్ని అనుసరిస్తోంది.

భారత పాలక వర్గాలు మత తత్వాన్ని తీవ్రతరం చేయడమేగాక, కుల తత్వాన్ని ఉపయోగించుకుని ప్రజలను చీలిస్తున్నాయన్న విషయం అ విధంగా స్పష్ట మైంది. మతతత్వాన్నీ, కులతత్వాన్నీ ఆచరణలో పెట్టడానికి హిందూమత సిద్ధాంతం చాలా ఉపయోగకరమైన సాధనంగా ఉంది. హిందూమతానికీ ఇతర మతాలకూ ఒక తేడా వుంది. హిందూ మతమనేది ఒక విశ్వాసం మాత్రమే కాకుండా, దానికి ఒక సామాజిక చట్టం (రూపం) కూడా వుంది. ఈ చట్రం యొక్క మౌలిక సిద్ధాంతం ప్రకారం అధమ కులాలవారు అగ్రకులాలకు సేవలు చేయాలి. ఆ విధంగా 'హిందూత్వ' అనేది (హిందూ మతతత్వానికి ఇది మరో పేరు) అల్ప సంఖ్యాక మతా లకు వ్యతిరేకమేగాక, హిందూ మతానికే చెందిన నిమ్నకులాలకు కూడా వ్యతిరేకంగా పనిచేస్తుంది. భారత దేశంలో భూస్వామ్య విధానం శాశ్వతంగా కొనసాగడానికి ఈ చట్రం ఒక పునాదిగా వుంది.

భారత దేశంలో సామ్రాజ్యవాదుల, బడా పెట్టుబడిదారుల, భూస్వామ్య దోపిడీ పరిపాలన కొనసాగించడానికి, మతతత్వం, కులతత్వం ఉపయోగించుకో

బడుతున్నాయన్నది ఈ విధంగా స్పష్టమైంది. మతతత్వానికి, కులతత్వానికీ వ్యతిరేకంగా సాగే పోరాటం వర్గపోరాటానికి వ్యతిరేకమూ కాదు — అదే సమయంలో దానికి సమాంతరమైనదీ కాదు. పైగా ఈ పోరాటాలు అనివార్యంగా వర్గపోరాటాల యొక్క వ్యక్తీకరణలే. ఈ పోరాటాలూ, వర్గపోరాటాలూ దోపిడీ దారులకు వ్యతిరేకంగా సాగేవేగాక, పరస్పరం ఒకదాని నొకటి సహాయ పడేవిగా వుంటాయి.

ఈ పై పరిశీలన అనంతరం— మతతత్వానికి వ్యతిరేకంగా జరిపే పోరాటపు ఎత్తుగడలను మనం రూపొందించుకోవచ్చు. ఈ ఎత్తుగడలలో ప్రధానమైనవి ఇవి :-

1. మతతత్వం అనేది భారతదేశంలోని కులతత్వంతోనూ, జాతుల అణచివేతతోనూ, జాతీయ భాషాపరమైన అల్ప సంఖ్యాక వర్గాల, తెగల అణచివేతతోనూ, విడదీయలేని సంబంధం కలిగి వుంది.

2. మతతత్వానికి వ్యతిరేకంగా జరిపే పోరాటాన్ని, సామ్రాజ్యవాదానికి, దానికి భారత దేశంలోగల మురాకి వ్యతిరేకంగా జరిపే పోరాటాన్ని విడదీస్తే, ఆ పోరాటపు లక్ష్యాన్ని పోగొట్టుకున్నట్లే.

3. మతతత్వానికి వ్యతిరేకంగా జరిపే పోరాటంలో ప్రధానంగా పోరాటాన్ని మతతత్వ భావజాలపు ఆయుధాలైన తప్పుడు భావనలు, కల్పిత చరిత్ర, దురభిమానాలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టాలి.

4. అణచబడ్డ మతాల వారిని సమీకరించడం ద్వారా మాత్రమే మతతత్వానికి వ్యతిరేకంగా పోరాడటం సాధ్యం కాదు. అటువంటి చర్యలు మతతత్వాన్ని మొత్తముగా తీవ్రతరం చేయవచ్చు — ఆశించిన దానికి విరుద్ధ ఫలితాలు రావచ్చు.

ఇది మతతత్వం గురించీ, దాని ప్రధాన నేరస్తులైన సామ్రాజ్యవాదులూ, వారి సేవకులూ, వారితో జరిపే పోరాటపు ఎత్తుగడల గురించీ. ఇక ఇప్పుడు వీరిని ఎదుర్కోవడానికి ఐక్యపరచవలసిన శక్తుల గురించి తెలుసుకుందాం.

సామ్రాజ్య వాదమూ, దాని మురా మత తత్వాన్ని, కుల తత్వాన్నీ శాశ్వతంగా వుండేట్లు చేస్తారనీ, జాతులను అణచివేస్తారనీ, జాతీయ, మైనారిటీలను, భాషాపరంగా అల్ప సంఖ్యాక వర్గాలను అణచివేస్తారనీ మనం ఇప్పటికే చర్చించాం. శ్రామికులనూ, రైతాంగాన్నీ, చిన్న పెట్టుబడి దారులనూ, జాతీయ బూర్జువా వర్గాన్ని

మత పరంగా, కుల పరంగా, జాతిభాష పరంగా విడదీయడమనేది సాధించాలని ప్రజా శత్రువులు కోరుతారు. అంతేకాదు. అణచబడ్డ మతాలు, కులాలు, జాతులు, భాషా పరంగా అల్ప సంఖ్యాకులూ, పీడనకు గురయ్యే కులాలు, తెగల వారు అణచి వేతకూ, పీడనకూ వ్యతిరేకంగా పోరాటంలో నిమగ్నులై వుండాలనీ, సామ్రాజ్య వాదులు, బడా పెట్టుబడి దారులూ భూస్వామ్య దోపిడీని పట్టించుకోకుండా వుండాలని వీరు కోరుకుంటారు. కనుక మత తత్వానికీ, దాన్ని శాశ్వతంగా నిలబెట్టాలని చూసే సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగా, శ్రామిక వర్గం మొత్తం, రైతాంగం, చిన్న పెట్టు బడి దారులు, జాతీయ పెట్టుబడిదారులు, మతపరమైన, భాషా పరమైన అల్ప సంఖ్యాక వర్గాలు, అణచివేతకు గురైన జాతులు, కులాలు, తెగలు మొదలగు శక్తులు ఐక్యమై పోరాడాలి. సామ్రాజ్యవాదపు పని విధానంగా నిర్దుష్టంగా తెలిసిన కార్మిక వర్గం, ఈ శక్తుల నన్నిటినీ ఐక్యపరచడంలో నాయకత్వ పాత్ర వహించాలి. ఈ శక్తులలో ఒక మైత్రీ సంబంధాన్ని నిర్మించడం, ఒక విశాల ప్రాతిపదికపై ఐక్యతను సాధించడం కష్టసాధ్యమైన విషయంగా కనబడవచ్చు. కాని సహనంతో, పట్టు విడువని దీక్షతో ఈ శక్తులన్నిటినీ ఐక్యపరచడం ద్వారానూ, పోరాటాన్ని కొనసాగించడానికి ఒక ఉమ్మడి కారణాన్ని కనుగొనడం ద్వారానూ కష్టాలన్నిటినీ అధిగమించవచ్చు. పోరాటాన్ని నిర్మించడానికి ఈ క్రింది డిమాండ్లు సహాయంగా వుండవచ్చు.

1. అన్ని జాతుల, భాషల, మతపరమైన అల్ప సంఖ్యాక వర్గాల హక్కులు రక్షింపపడాలి.
2. మతం, కులం, జాతి పేరుతో సాగే అన్ని రకాల వివక్షతలనూ ఆపుచేయాలి.
3. ఢిల్లీలోనూ, దేశంలోని ఇతర ప్రాంతాల్లోనూ, సిక్కులను ఊచకోత కోసిన వారిని తక్షణం శిక్షించాలి.
4. బాబ్రీ మసీదు కూల్చివేతకు బాధ్యులైన వారినందరినీ తక్షణం శిక్షించాలి.
5. బాబ్రీ మసీదును వెంటనే పునర్నిర్మించాలి.
6. గిరిజన భాషలతో సహా అన్ని భాషలకూ అభివృద్ధి కావడానికి తగిన అవకాశాలు కల్పించాలి.
7. అన్ని జాతుల వారికీ స్వయం నిర్ణయ హక్కును విస్తరింప చేయాలి. కాశ్మీరు నుంచి ఇండియా, పాకిస్తాన్‌లు ఉపసంహరించుకోవాలి. కాశ్మీరు

ప్రజలకు తమకు ఏమి కావాలో తమే నిర్ణయించుకొనే అవకాశం ఇవ్వాలి

8. షెడ్యూలు కులం, షెడ్యూలు తెగల రిజర్వేషన్ కోటాలను పాటించాలి.

9. విద్యా సంస్థల్లోనూ, ఉద్యోగాల్లోనూ 'ఇతర వెనుకబడిన వర్గాలకు' (OBcs) రిజర్వేషన్ ఇచ్చే చట్టం చేయాలి. దీన్ని ఏ రూపంలో నైనా దాటివేయాలనుకునే ఏ చర్యనైనా ప్రతిఘటించాలి.

10. మతతత్వాన్ని ప్రేరేపించే అంశాలు లేకుండా చరిత్రను తిరిగి రాయించాలి.

11. ప్రభుత్వ వ్యవహారాల్లో మతాన్ని— ప్రత్యేకంగా హిందూ మతాన్ని పాటించడం ఆపివేయాలి.

12. దేశభక్తి ముసుగుతో ఇరుగు పొరుగు దేశాలకు వ్యతిరేకంగా హిందూ మతతత్వంపై ఆధారపడిన జాతీయ దురహంకారాన్ని రెచ్చగొట్టడాన్ని స్వస్తి చెప్పాలి.

13. దేశ ఆర్థిక, రాజకీయ, మిలటరీ సాంస్కృతిక వ్యవహారాల్లో సామ్రాజ్యవాద పెత్తందారీ తనానికి భారత వాక్యం పల్కాలి.

14. నూతన ఆర్థిక విధానం, నూతన పారిశ్రామిక విధానం, డంకెల్ ముసాయిదాపై సంతకం చేయడం లాంటి సామ్రాజ్యవాదుల వత్తాసు కల్గిన ప్రతి విధానానికీ వ్యతిరేకంగా పోరాడదాం.

15. మతతత్వాన్నీ; కులతత్వాన్నీ సృష్టించే, భూస్వామ్య విధానాన్ని అంతమొందించే విధంగా భూముల పునః పంపకం కొరకు పోరాడదాం

మతాలకూ, కులాలకూ, జాతులకూ అతీతంగా, సామ్రాజ్యవాదులకు, వారి మురా వారికీ వ్యతిరేకంగా, భుజం భుజం కలిపి పోరాటం చేసే మహత్తరమైన సంప్రదాయం భారతదేశ ప్రజలకు వుంది. ఆ సంప్రదాయాన్ని సమున్నతంగా నిలబెడదాం. ఇండియా, భారతదేశ ప్రజలకు చెందినదే గాని, మతతత్వ వాదులది, కులతత్వ వాదులదీ, సామ్రాజ్యవాద సేవకులది కాదు. భారత ప్రజల ఐక్యత సామ్రాజ్యవాదాన్నీ, వారి మురాలనీ, ఆ మురాల వారి మతతత్వాన్నీ, కుల తత్వాన్నీ తుడిచి పెట్టి వేస్తుంది.

రావి శాస్త్రి స్త్రీ పాత్రల్ని విశ్లేషించే ప్రయత్నం ఇందులో జరిగింది. ఇందుకు రావి శాస్త్రి రచనల నుండి ఏడు పాత్రల్ని ఏడు కథల నుండి తీసుకున్నాం.

ఇందులో మొదటి మూస 'న్యాయం' కథలోని స్త్రీ పాత్ర. ఆమె వేశ్యావృత్తి చేస్తున్నదన్న ఆరోపణపై పోలీసులు పట్టుకుంటారు. ఆమె దొంగ సారా అమ్ముతుంది. కోర్టు విచారణలో నేరం చేయలేదు గాని తప్పు ఒప్పుకుంటానంటుంది. **ఆమెది [illegible] ధోరణి. ఇవీ పాత్ర లక్షణాలు.** ఆమె నాలుగు వేర్వేరు రంగాలలో పురుషాధిపత్యానికి గురవుతూ ఉంటుంది. ఆమె పురుషాధిపత్యానికి ప్రత్యక్షంగా లొంగి ఉండే వృత్తిలో ఉంటుంది. అలాగే ఆమె న్యాయానికి, రాజ్యానికి బద్ధురాలై కూడా వుంటుంది. మొత్తంగా ఆమె పురుషాధిపత్య భావ జాల కట్టుబడికి లోబడి ఉంటుంది.

రెండవ మూస 'మాయ' కథలో ముత్యాలమ్మ పాత్ర. ఇది అన్నిటికంటె మంచి పాత్ర. ఈమె గూడా దొంగ సారా అమ్ముతుంది. కాని తెలివి, అనుభవం, లోక జ్ఞానమే ఆమె ఆస్తి. "నా కన్నీ తెల్సు. ఈ సారా యాపారంలోకి దిగిన తర్వాత బాబు నాకెన్ని యిసయాలు తెలిసొచ్చినాయో సరీగా చెప్పలేదు....ఈ నోకం డబ్బు యాపారం తప్ప మరేట్నేదు....డబ్బు కోసరం నోకం నోకవంతా నడుచు కుంటుంది" అంటుంది ముత్యాలమ్మ. ఆమెకు నీతిలో నమ్మకం వుంది. ఒకరి కష్టం మీద ఇంకొకరు బతగ్గూడ దంటుంది. "ఈ కేసు ఒక వాయిదాతో తేలిపోతే నీకో గంట పని.... కసేరీలో నువ్వు పడ్డ గంట కష్టానికి నీ ఇంట్లో అర్నెల్లు అంట్లు తోమి మరీ నీ రుణం తీర్చుకుంటాను. ఒకరి కష్టంమీద ఇంకొకరు బతగ్గా డదు" అంటుంది మూర్తితో.

ఈ తెలివి, జ్ఞానం, నీతి ఆమెకు ఎక్కడ నుండి వచ్చాయి? ఖచ్చితంగా అవి జీవితానుభవం వల్ల వచ్చినవే. అయితే నిజానికి ఇవన్నీ ఆమెకు స్త్రీగా నిరుప యోగం. మూడవ మూస "పాపి" కథలో నూకాలమ్మ పాత్ర. ఆమె ఉంపుడు గత్తె. కథలో అమె సహధర్మచారిణి. ఆమె తను నమ్మిన వాడికి అన్ని పనులలోనూ "సహా" కనిపిస్తుంది. అలా సహకరించడంలో ఆమె మంచీ, చెడు వివక్షత లేకుండా, వాటి గురించి తనుగా ఆలోచించకుండా అన్ని దగుల్బాజీ వ్యాపారాలలోనూ భాగం పంచుకుంటుంది. కట్టుకున్న భార్య అయినా, ఉంపుడుగత్తె అయినా ఇద్దరూ పురుషుని మీద ఆధారపడ వలసిందే. ఒక్కటే తేడా. అదేమంటే ఉంపుడుగత్తెకు కొంతవరకు స్వతంత్రంగా వ్యవహరించే అవకాశం ఉన్నట్టు కనిపిస్తుంది. ఈ తేడా వల్ల సామాజిక నీతి నుండి ఎదురయ్యే సమస్యలు ఎన్నో ఉంటాయి. నూకాలమ్మ తనకు సంబంధించిన ఒక వ్యక్తిగత సమస్యలో తనకు తాను గాక తను నమ్ము కున్న ఒక పురుషుని ద్వారా ప్రతీకారం తీర్చుకుంటుంది. అంటే పురుషాధి

పత్యాన్ని ఎదుర్కోవడానికి ఆమెకు మళ్ళీ మరో పురుషుడే అవసరమయ్యాడు. స్వతంత్రంగా వ్యవహరించడానికి సూకాలమ్మకు గల ఆ కాస్త అవకాశం ఒరగ బెట్టింది ఏమీ లేదు.

నాలుగో మూస లంపెన్ స్త్రీ పాత్రలు. వర్గ సమాజం సంక్షోభ నప్పుడు కొన్ని వర్గాల్లోంచి కొందరల్లోగల శక్తులు బయటకు విసరివేయబడతాయి. విలువలు విశదీకరించబడతాయి. ఈ పరిణామాలు 'లంపెనైజేషన్'కి దారి తీస్తాయి. లంపెన్‌లకు ఒక విలక్షణం ఉంది. ఇవి సంఘటితంగానే ఉంటాయి. కాని తమకు తామే సంఘీభావం చెప్పుకో లేకపోవడం లంపెన్ లక్షణం.

ఈ పరిణామం స్త్రీలకు అన్వయించి నప్పుడు ఆ స్త్రీ 'ప్రాస్టిట్యూట్' కథ లోలా [illegible]గానో, కాకా వ్యాపారిగానో, 'తలుపు గొళ్ళెం'లో లాగా ఆడిదొంగ గానో, [illegible] ఒక స్త్రీ వేశ్యగా మారడానికి సమాజంలో అందుకు దారి తీసే పరిస్థితులు రెండే రెండు ఉన్నాయి. మోసం, దారిద్ర్యం - మోసం వల్ల నిస్సహాయ స్త్రీ వేశ్యగా మారుతుంది. దారిద్ర్యం వల్ల వేశ్యగానో, దొంగగానో మారుతుంది. ఈ సమాజంలో స్త్రీ దొంగగా కంటే వేశ్యగా పరిణమించే అవకాశాలే ఎక్కువ. ఎందుకంటే స్త్రీకి చిన్నప్పటి నుండి ఇస్తున్న శిక్షణ అటువంటిది. సమాజాన్ని తెలుసుకునే స్థానం మొదటి నుండీ దీని పెంపకంలో పొందదు. ఈ సమాజపు సంస్కృతి, దాని భ్రష్ట ప్రభావమే. దాని దుష్టరూపం స్త్రీని వేశ్యగా మారుస్తాయి. అందువల్లే నిస్సహాయ స్త్రీ కాయకష్టం లేకుండా ఉపాధి పొందగలిగే మార్గాన్ని ఆ వృత్తిలో అన్వేషిస్తుంది.

అయిదవ మూస "అగ్గిపుల్ల" కథలో సముద్రాలు పాత్ర. ఆమె బలాత్కారానికి గురి అయిన ఒక నిస్సహాయ అమాయక స్త్రీ. అమాయకత్వం అనేది ఈ సమాజంలో స్త్రీలకు ఆపాదించబడిన లక్షణం. సమాజంలో స్త్రీ స్త్రీగా పుట్టదు. తయారు చేయబడుతుంది. లాలిత్యం, అబలత్వం, సౌకుమార్యం, వినయం, అందం, సౌశీల్యం, సహనం, శాంతి మొదలైనవి స్త్రీ లక్షణాలుగా స్త్రీ మనసులో నాటబడినాయి. ఆమె అలాగే తీర్చిదిద్దబడింది. ఈ లక్షణాల వంటిదే అమాయకత్వం కూడా. అమాయకులు పురుషులలో కూడా ఉండవచ్చు. కాని అది వారి తెలివి తక్కువతనంవల్ల వస్తుంది. కాని స్త్రీల అమాయకత్వం తెలివితో సంబంధంలేని సంస్కృతికి భ్రష్టరూపమైన సామాజిక లక్షణం.

ఆరవ మూస 'రక్షకులు' కథలోని సరళ పాత్ర. ఆమె మధ్య తరగతి ఉద్యోగిని. పురుషాధిపత్యానికి లొంగి వుండడం నుండి, స్వతంత్ర ఆలోచన వరకు పరిణమిస్తుంది. ఈ పాత్రకు ఆర్థిక స్వాతంత్ర్యం ఉంది. సామాజిక పరిజ్ఞానం, పరిసరాల ప్రభావంవల్ల వచ్చిన చైతన్యం ఉంది. కాని ఈ చైతన్యం సమాజంలో

స్త్రీగా ఆమెకు నిర్దేశింపబడిన స్థానం గురించిన ఆత్మ చైతన్యం లేదు. స్త్రీకి స్త్రీగా జరిగే దోపిడిని తెలుసుకునే ధైర్యం గాని, శక్తి గాని ఆమెకు లేవు. ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి విముక్తి సాధించగలదనే భ్రమ కొంతమందికి ఉంది. కాని సరళ పాత్ర అది తప్పని రుజువు చేసింది. రక్షణ రూపంలో కూడా పీడన సాగుతుందని తెలిసింది. అందుకే ఆర్థిక స్వాతంత్ర్యం కూడా ఇతర స్వాతంత్ర్యాలలాగా నామ మాత్రమే. రావి శాస్త్రి పాత్ర లన్నిటిలోకీ ఉనికిని కాపాడు కోవడానికి బుద్ధి పూర్వకంగా ప్రయత్నించే ఏకైక పాత్ర సరళ.

ఏడవ మూస 'గోవు లొస్తున్నాయి జాగ్రత్త'లోని మరిడి మహాలక్ష్మి పాత్ర. ఆమె కూడా బలాత్కారానికి గురైన ఒక పేద స్త్రీ. పురుషాధిపత్యానికి లొంగిపోయి తను అనుభవించిన బాధల నుండి, తాను సరైన వనుకున్న పరిష్కారాలు కనిపెట్టి, 'గయ్యాళి'గా పిలువబడి, తన హక్కులను నిలబెట్టుకునే పాత్ర. ఒక పీడనను అనుభవించే స్త్రీ సహజంగా దాని నుండి తప్పించుకునే మార్గాన్ని వెతుకుతుంది. ఆమె చైతన్యానికి సరయినదిగా తోచిన పరిష్కారానికి వస్తుంది. అయితే చేయగల పరిస్థితులు ఉన్నప్పుడు వాటిని అమలు చేస్తుంది. హక్కులను సాధించుకుంటుంది. మరిడీ మహాలక్ష్మి పాత్ర కూడా పీడనలకు గురై సర్గ్గా ఈ క్రమం లోనే తనకు తోచిన పరిష్కారాన్ని ఉంచుకుంటుంది. తన అసహాయతకు ఏడుస్తుంది. కోపం వస్తే తన శక్తినంత కూడ తీసుకుని అన్నింటినీ నాశనం చేసి తన కోపాన్ని ప్రకటిస్తుంది. ఆ కోపంలోనే కుక్కను చంపేస్తుంది. దాని బొట్టును ముక్కలు ముక్కలు చేస్తుంది.

సమస్యలకు సరయిన పరిష్కారం కనిపెట్టి మళ్ళీ అటువంటి సమస్యలు తలెత్తకుండా చేసుకోలేని మనుష్యులు, సర్వసాధారణంగా ఇటువంటి పరిష్కారాలనే వెతుక్కుంటారు. ఈ పరిష్కార మార్గాలలో భర్త మీద అధికారం చెలాయించడం కూడా ఒకటి. సరయిన పరిష్కారాన్ని గుర్తించే చైతన్యం లేనప్పుడు అది అసమగ్రమైంది, అబద్ధమైంది. ఎందుకంటే అప్పటి కప్పుడు తోచిన పరిష్కార మార్గాలను అమలు చేసే స్త్రీలు జాలిగా, మొత్తంగా పురుషాధికారాన్ని ప్రశ్నించరు. ఏదో ఒక్క పురుషాధికారాన్ని మాత్రమే ప్రశ్నిస్తారు. ఆ పురుషుడ్ని కూడా ఇతర విషయాలలోగల అధికారాలను గాక, తమ విషయంలో గల అధికారాన్ని మాత్రమే ప్రశ్నిస్తారు. అది కూడా పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడే.

అంటే ఇటువంటి పరిష్కారాలు అమలు చేసే స్త్రీలు లోకం దృష్టిలో భర్తలపై అజమాయిషి చేసే 'గయ్యాళి' స్త్రీలుగా గుర్తింపబడినా, నిజానికి వీరు పురుషాధిపత్యాన్ని మొత్తంగా గుర్తించి, వ్యతిరేకించే స్త్రీలు కారు. ఈ అసమగ్ర పరిష్కారంలోనైనా స్త్రీ విముక్తికి అనుకూలమైన అంశం కూడా ఒకటుంది. అది

స్త్రీ తన హక్కులకు నిలబెట్టుకోవడానికి ప్రయత్నించడం. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త'లో 'గయ్యాళి'గా కనిపించే మరిడీ మహాలక్ష్మి చివరి వరకూ చేసింది ఈ ప్రయత్నమే.

పైన వివరించిన మూసల్లో ఎక్కువ లంపెన్ పాత్రలే. లంపెన్ పాత్ర లను వాస్తవికంగా చిత్రీకరించడంలో శాస్త్రిది అద్భుతమైన ప్రతిభ. అయితే ఈ ప్రతిభ పై కథల్లో రావి శాస్త్రి స్త్రీ విషయంలో ఏ దృక్పథాన్ని తీసుకుంటున్నాడో ఆ దృక్పథాన్ని కప్పిపుచ్చుతుంది. స్త్రీ పట్ల రావి శాస్త్రికి ఎటువంటి దృక్పథం ఉందో చూడడానికి ఆయన కథలలో నుండే కొన్ని వర్ణనలు, సంభాషణలు తీసుకోవచ్చు.

ఉదాహరణకు 'అగ్గిపుల్ల' కథలో ఒక పాత్ర వర్ణన - ఆ పిల్ల "పల్లెటూరి పశువే" కాని 'ఎంత అందమైన పశువు! వాట్ ఎ బ్యూటిఫుల్ బీస్ట్", "ఆమెకి గంపంత కొవ్వు కొండంత గుండె వున్నాయి." 'రాత్రి ముక్క' కథలో ఒక సంభాషణ - "ఇప్పుడా కాంతమ్మ పదేళ్ళనుంచీ పడుపు వృత్తి చేస్తూ కుళ్ళిపోయిన మీ అప్పలా ఉంది!" ఇంకో చోట అదే కథలో "విన్నమ్మి కూతురులాగే! నిరుటి కింనా ఉల్లి పిచికిలా ఉంది. మొన్న జూస్తే పచ్చ గుర్రంలా పిటపిట లాడుతుంది." 'కుక్క పిల్ల' కథలో "ఆడది డీప్ సారోలో ఉండగా వశపర్చుకోవడం కొంతలో కొంత సులభం అని నేనెక్కడో చదివాను" అని స్వయంగా రచయితే అంటాడు. ఆడవాళ్ళ కూడా రావి శాస్త్రి ఔచిత్యం పాటించక పోవడం చూస్తాం. 'కుక్క పిల్ల'లో "క్లాబ్బులో దండు ముండలు ఇంగ్లీషులో మాటాడుకున్నట్టు కాకుండా, లైబ్రరీలో చీర్వాల వార ట్యూటర్ కుర్రాడితో ఆనార్సమ్మాయి మాటాడినట్టు ఆవేళ్టి గాలి చల్లగా మెల్లిగా మెత్తగా ఉంది."

పైన విశ్లేషించిన పాత్రలనుండి రావి శాస్త్రికి స్త్రీల పట్ల ఎటువంటి దృక్పథం ఉన్నదీ అంచనా కట్టవచ్చు. ఆయన ఎక్కడా స్త్రీల పట్ల జరుగుతున్న పీడనను దాని సమగ్ర అర్థంలో చిత్రీకరించలేదు. ఏదో ఒక రంగంలో ఏదో ఒక సాధనం ద్వారా సమాజంలో అమలవుతున్న పితృస్వామ్యాన్ని మాత్రమే రావి శాస్త్రి చిత్రించాడు. ఆ సంస్కృతి ప్రభావమే రావి శాస్త్రి రచనలలో కనిపిస్తుంది. ఆయా పాత్రల చిత్రణ వెనుక ఆ ప్రభావమే కనిపిస్తుంది. ఉదాహరణకు 'రాత్రి ముక్క' కథలో వర్ణన "ఇరవై ఏళ్ళ కింద ఇరవయ్యేళ్ళ వయసులో నగలబాబు గారింట్లో పని చేస్తున్నప్పుడు ఆమె కంచుతో చేసిన వీనస్ విగ్రహంలా ఎలా ఉండేదో తెలుసుకోవాలంటే ఆమెతో క్రీడించిన బాబుగారి పెద్ద కుమారుడ్ని ప్రత్యేకంగా అడగక్కర్లేదు."

రావి శాస్త్రికి శిల్పం పట్ల గల మక్కువ కథనంలోని సీరియస్‌నెస్‌ని చాలా నిర్దయగా బలహీన పరుస్తుంది. ఒక్కొక్క పాత్ర ఆయా సందర్భాలలో మాట్లాడ వలసిన సీరియస్ విషయాలను గాక, తేలికగా, చాలా లైటర్ వేన్‌లో, హాస్యం కలిగించే మాటలు మాట్లాడుతాయి. ఇది పాత్రల పట్ల రావి శాస్త్రి చేసిన అన్యాయం. రావి శాస్త్రి వర్ణనలను కొన్నిటిని చూస్తే శిల్పం కోసం వస్తువు ఎట్లా పోయినా ఫర్వాలేదనుకుంటారా అనిపిస్తుంది!

రావి శాస్త్రి పాత్రల చిత్రణ, కథా గమనంలో దుర్లక్షణం ఏమంటే కథకుడే ఒక్కోసారి పాఠకునితో మాట్లాడేస్తాడు. చాలా సందర్భాలలో కథకునికీ, పాత్రకీ మధ్య తేడా లేకుండానే రావి శాస్త్రి రాస్తాడు. ఒక్కోసారి "అద్దెకు తెచ్చుకున్న ఆడదాన్దగ్గర దుస్తులు విప్పే పెద్ద మనిషిలా వెకిలిగా నవ్వేడు మూర్తి కవి!" అనే సందర్భశుద్ధి లేని సంభాషణలు, వర్ణనలు దాదాపు అడుగడుగునా కనిపిస్తాయి. ఆ వర్ణనలు స్త్రీల ఒంపు సొంపులు మొదలు వారిని గేలి చేసే స్థాయి వరకు ఉంటాయి. ఒక్కోసారి పాఠకుణ్ని రచయితతో మమేకం చేస్తాడు. ఇది మంచి లక్షణం కాదు. పాఠకుడు పాత్రలతో మమేకం అయినప్పుడే ఆయా పాత్రల పరిస్థితులను సమగ్రంగా అవగాహన చేసుకొవడానికి అవకాశం ఉంటుంది. కన్యాశుల్కం నేటికీ సజీవంగా ఉండడానికి ఇదే కారణం.

రావి శాస్త్రి రచనలలో దోపిడీ నేపథ్యంలో స్త్రీల అణచివేత, విముక్తికి వారు అవలంభించ వలసిన కార్యాచరణ కనిపించదు. సమాజంలో పురుషాధిపత్యం క్రింద స్త్రీ ఎలా నలిగిపోతున్నదీ రావి శాస్త్రి రచనలు చిత్రీకరించవు. సాధారణ దోపిడిలోని భాగంగానే స్త్రీ మరిన్ని రకాలుగా ఎలా అణచివేయబడుతున్నారో రావి శాస్త్రికి స్పష్టమైన అవగాహన లేకపోవడమే ఇందుకు కారణం కావచ్చు. పురుష పాత్రల విషయంలో దురహంకార పాత్రలను సృష్టించినప్పటికి ఆ దురహంకారాన్ని వ్యతిరేకించే పాత్రలను రావి శాస్త్రి సృష్టించలేదు. సమాజం వ్యతిరేకించ వలసిన ఆలోచనలను, భావజాలాన్ని కూడా రచయిత చెప్పలేదు. అందుకే ఆయన స్త్రీకి ఎలా విముక్తి లభిస్తుందో చెప్పలేకపోవడమే కాక, పీడన నుండి స్త్రీకి విముక్తి అవసరమని కూడా ప్రకటించలేదు. ఇందులో రావి శాస్త్రి అభిప్రాయాలు ఏమైనా ఆయన కథలు మాత్రం ఖచ్చితంగా పాఠకునిలో స్త్రీ విముక్తి అవసరాన్ని ప్రేరేపించవు.

("ప్రజా సాహితి" మార్చి 1987 సంచిక నుంచి)

# ఆఖరి దశ

## రాచకొండ విశ్వనాథశాస్త్రి



కాశీనగరంలో గంగానదీ తీరాన, తెల్లటి యిసక తిన్నెమీద కూర్చుని సాయంకాలపు సూర్యకిరణాల్తో తళ తళ లాడే అలలవైపు చూస్తోన్న దేవదత్తుణ్ణి వెనకనుంచి వచ్చి భుజం మీద గట్టిగా తట్టి పక్కన చతికిలపడ్డాడు చారుదత్తుడు.

ఇద్దరూ సమవయస్కులు, నడికాలం దాటి జుత్తు బాగా నెరిసింది. ముఖ వర్చస్సు, దుస్తుల విలువా చూస్తే గౌరవ కుటుంబాలకి చెందిన వాళ్ళలా కనిపిస్తున్నారు.

"ఏం చారుదత్తా! ఇంత ఆలస్యంగా వచ్చావేం? ఆందోళనగా కూడా ఉన్నట్టున్నావు ?"

"ఇంకా వార్త వినలేదా ఏమిటి నువ్వు ?" అని ఆశ్చర్యపడుతూ అడిగాడు చారుదత్తుడు.

"ఏ వార్త? నే నేం వినలేదు. యేమిటో చెప్పు త్వరగా."

"సుయోధన మహారాజు కూలిపోయాట్ట !"

"హరహరా! ఎప్పుడు ?"

"పొద్ది దినాలే అయింది. వార యిప్పుడే చేరింది."

"అంతా ఎలా జరిగింది ? వివరాలేమిటి ?యేమిటి? కథ ?"

"చివరికి ఆ భీముడే ప్రాణం పుచ్చుకున్నాట్ట."

"అయితే యుద్ధం ముగిసినట్టేనా?"

"ఆ! అధర్మంతో యుద్ధం ముగిసింది."

"అధర్మ యుద్ధం అంటున్నావేమిటి ?"

"గదా యుద్ధంలో రారాజుని జయించలేక చివరికి తొడల మీద కొట్టి చంపేట్ట భీమసేనుడు. అలా కొట్టమని పక్కనుండి ప్రోత్సహించాట్ట కృష్ణుడు."

"హరహరా! ఈ కృష్ణుడు చేయించే పాపాలకి హద్దున్నట్టు లేదు."

"అతగాడు సాక్షాత్తు శ్రీ మహా విష్ణువు అవతారం. అతనేం చేసినా తప్పు లేదని పాండవుల ప్రచారం."

"శ్రీమహా విష్ణువు, ఏదైనా అయుండొచ్చుగాని కొంపలు ముట్టించే కొరివి మాత్రం కాదు."

"కొంపలు ముట్టించే రాజకీయ వేత్తలుండబట్టే కథ ఇంత మట్టుకు వచ్చింది. ఈ కృష్ణుడు రాజకీయ వేత్తే కాట్ట. గొప్ప వేదాంతి కూడానట."

"అవేంకటా !"

"కాక పాపం ఆ అర్జునుడు తొలి దినం నాకీ రాజ్యం వద్దు, రాజ్యాం వద్దు, చూస్తూ చేతులారా వీళ్ళ నెవ్వర్నీ నేను చంపలేను. అని అస్త్ర సన్యాసం చేసి కూర్చుంటే, ఈ నల్లవాడు మెట్ట వేదాంతం అంతా బోధపర్చి పురెక్కించి రెచ్చగొట్టేట్ట."

"అహా? నాకీ విషయం ఇంతవరకూ తెలియలేదుస్మా అయినా ఆ కిరీటికి విరక్తి పుట్టి ఉండొచ్చు. కాని, ఆ పెద్దవాడి రాజ్య కాంక్ష ఎక్కడికి పోతుంది చెప్పూ ?"

"ఆ కాంక్షే యింతా తెచ్చి పెట్టింది."

"చూశావా! ప్రాపంచిక సౌఖ్యాల కోసం తండ్రులు, కొడుకులు, అన్నదమ్ములు, బంధువులు, స్నేహితులు- సాధారణులు కూడా కారు, గొప్పవారు, పండితులు, జ్ఞానులు- అంతా ఒకర్నొకరెలా పొడుచుకు చంపుకున్నారో, వీరితో పాటు అమాయక ప్రజానీకం ఎంత హతమయిందో!"

"దేవదత్తా! ఎటు చూసినా అధర్మం ప్రబలి పోతోంది. ఆర్యుల్లోనే ఈ అధర్మం పొడసూపినప్పుడు యింక అనార్యుల సంగతి చెప్పవలసిందేముంది?" అన్నాడు చారుదత్తుడు విచారంతో.

"ధర్మ పద్ధతికి చరమకాలం వచ్చింది" అన్నాడు దేవదత్తుడు.

"ధర్మా ధర్మాల మాటేమిటి? నీకూ, నాకూ, అందరికీ అన్నిటికీ, ఆర్యావర్తానికే కాదు, మహా ప్రపంచానికే అంత్యకాలం ఆసన్నమయినట్టుంది."

అంత వరకూ సూర్యకిరణాలు పడి మిల మిల మెరిసిన గంగాజలం కొన్ని చోట్ల ఎర్ర బడింది; కొన్ని చోట్ల నల్ల బడింది.

"హరహర మహాదేవ శంభో" అన్న రవం ప్రతివైపు నుండీ విన వస్తోంది. చారుదత్త దేవదత్తులు లేచి విశ్వేశ్వరాలయం వైపు నడిచారు.

• • •

సాయం సమయం. సంఘారామంలో తటాకానికి దిగే చలువరాతి మెట్ల మీద నిల్చున్నారిద్దరు బౌద్ధ సన్యాసులు. ఇద్దరూ వృద్ధులు. స్నానం చేసి తుడుచుకుంటూ మాట్లాడు కుంటున్నారు.

"అంతే కాదా నందా! ఈ శంకరాచార్యుడు శివుడి అవతారమట. అందరూ చెప్పుకుంటున్నారు" అన్నాడు ఉపాలి.

"ఈ బ్రాహ్మణులు మన తథాగతుడే విష్ణ్వంశ సంభూతుడన్నారు. ఆశ్చర్యమేముంది?" అన్నాడు ఆనందుడు.

"కాని, ఎవడీ శంకరుడు ? ఎక్కణ్ణించి ఊడిపడ్డాడు?"

"మంట పుట్టడం మళయాళ దేశంలో పుట్టింది. కాని తాత ముత్తాత లెవరో ఇక్కణ్ణించే తర్లి వెళ్ళారట అటు వైపుకి. పూర్వాశ్రమంలో బ్రాహ్మణాధముడు."

"అలా చెప్పు. అయితే ఇంత కాలం తథాగతుడికి తలలొగ్గిన బ్రాహ్మణాధములు మంత్ర తంత్రాలతో తిరిగి తల లెత్తుతున్నారన్నమాట."

"ఎత్తుతున్నారని మెల్లిగా అంటు న్నావా? ఎత్తి పడగ విప్పి ఆడుతున్నారు. వాళ్ళ నాయకుడే ఈ శంకరాచారి."

ఉపాలి కొంతసేపు మౌనంగా నిల్చొని, "జాడ్యం విపరీతంగా వ్యాపి స్తోందట కదా!" అని అడిగాడు.

"మనలో దోషాలు పెచ్చు పెరగడం చేతనే దానికి విరుగుడుగా ఇటువంటి జాడ్యం పుట్టుకొచ్చింది."

"మనలో దోషాలు ఉంటే ఉండ వచ్చు. కాని ఈ శంకరాచారే కాని విజయుడయినట్లయితే ప్రజలు పూర్వం లాగే మూఢ మనయిపోతారన్నమాట.

"నిజమే."

"మన యొక్క ఈ సంఘాలు, మనం, మన ధర్మ పద్ధతి, మన భిక్షువులు లేనినాడు ప్రపంచం అంతా చివరి దశకి వచ్చినట్టే" అని నిట్టూర్చాడు ఉపాలి.

• • •

తాజ్‌మహల్ సమీపాన్న సుందరో ద్యానంలో పూలమొక్కల మధ్య పచ్చి గడ్డి మీద కూర్చున్నారిద్దరు మహమ్మ దీయులు. విలువైన వస్త్రాలు ధరించారు. వారి టోపీలూ, చేతి కర్రలూ పక్కన పడి వున్నాయి. సాయం కాలపు నీరెండ తాజ్‌మహల్ అంచులకొక వింత శోభను తెచ్చి పెట్టింది. చల్లని గాలి వీస్తోంది.

"భాయీ, ఔరంగజేబ్ పాదుషా చనిపోయారని పుకార్ పుట్టింది విన్నావా" అని అడిగాడు హుసేన్ ఖాన్.

"పుకారు మాత్రం కాదు, నిజమే" అన్నాడు రహిమాన్.

"అరె! నిజమేనంటావా?"

"ఆహా! నిజమే."

"ఎవరు చెప్పారు నీకు?"

చెవిలో ఏదో మెల్లిగా ఊదాడు రహిమాన్.

"అల్లా, అల్లా! అయితే కబురు నిజమే అయుండాలి' అని వేదనతో అరిచాడు హుసేన్ ఖాన్.

"మనం అల్లాని ప్రార్థించడం తప్ప మరింక చేసేదేం లేదు" అన్నాడు రహి మాన్. "ఇహ రాజ్యానికి షాజాదాలంతా కొట్టుకు చస్తారు."

"అదెలాగా తప్పదు అందులో ఎవరు నెగ్గినా ఒక్కటే. ధాటీగా పరిపాలించే శక్తి ఎవడికీ లేదు."

హుసేన్‌ఖాన్ నిస్పృహతో అన్నాడు.

"అయితే కాఫర్లింక మనల్ని బతక నివ్వరు. దెక్కన్లో మరాఠీ దొంగలు ఇదివరకే చెలరేగేరు. ఇటు సిక్కులు కత్తులు నూరుతున్నారు. అంతవరకూ ఎందుకు? ఢిల్లీలోనే ద్రోహం చెయ్యడా నికి కాఫర్లు సాహసిస్తున్నారట విన్నావా?"

"మన నీరసం చూసి ఏమైనా చేస్తారు. వేటగాడు లోకువైతే లేడి మూడు కాళ్ళ మీద నడుస్తుందిట!"

"ప్చ! ఖరాబ్ రోజులొచ్చాయి భాయీ."

"మొగల్ సామ్రాజ్యానికే చెడ్డరోజు లొచ్చాయంటే ప్రపంచ శాంతికే భంగం కలిగిందనుకో."

"కాదా మరి !!"

"ఒక కాఫర్లే కాదు, పై నుండి ఇరా నీలు, మంగోలీలు, ఇటు కాఫర్లు, మధ్య

మనం. అంతా కలిసి తగవులాడి కొట్టు కొని నానా గోల్‌మాలా జరుగుతుంది."

"మరొకటి. ఈ మధ్య ఓడల మీద దిగుతున్నారు చూసేవా, తెల్ల వాళ్ళు! వాళ్ళ పై పెవడూ మాట్లం చేయ. వాళ్ళ మధ్య కొత్త కొత్త ఆయుధాలు తీసు కొచ్చి జాగ్రత్త చేస్తున్నారట."

"భాయీ! వీళ్ళూ వాళ్ళూ అనకు. నానా బీభత్సం జరుగుతుంది. ప్రపం చంలో యింక శాంతి అనేది ఉండదు. మొగల్ సామ్రాజ్యానికి ఆఖరోజు లొచ్చాయని లెక్కవేసుకో" అన్నాడు హుసేన్ ఖాన్.

క్రీస్తు శకం, పంధొమ్మిది వందల నలభయ్యేడవ సంవత్సరం ఆగస్టు నెల పదిహేడవ తారీకు.

ఆంగ్లేయు లిద్దరు క్లబ్బు వరండాలో వాలుకుర్చీల్లో కూర్చొని చుట్టలు కాలుస్తూ మాట్లాడుకొంటున్నారు. బాగా చీకటి పడింది. చుట్టూ కలకత్తా నగరం కన్నుల పండువుగా స్వాతంత్ర్యోత్సవాన్ని జరుపు తోంది. దీపాల తోరణాలు ఎటు చూచినా కనిపిస్తున్నాయి. తారాజువ్వలు ఆకాశా న్నందు కొంటున్నాయి. ప్రతి వైపు నుంచీ జయజయ ధ్వనులు వినిపిస్తు న్నాయి. "ఛార్లెస్! ఈనాడింతకోలాహలం చేస్తూన్న జనమంతా కొద్ది కాలంలో గోరీల్లోనూ, శ్మశానాల్లోనూ ఉంటారు. చూసుకో!" అన్నాడు రిఛర్డ్

"బాగా చెప్పేవు" ఛార్లెస్

"పంజాబులో అప్పుడే అల్లర్లు బయల్దే రేయి, తెలుసా?"

"పంజాబ్ అన్నమాటేమిటి? దేశ మంతటా బయల్దేరాయి."

...టు పరిపాలన సాగించేవాళ్ళు!"

"ఇదంతా వినాశానికే వచ్చింది."

"అంతటికీ కారణం, మన దేశంలో చేతకాని గవర్నమెంటు రావడం."

"అదీ ఓ కారణం అయినా దీన్లో ఫేట్ పని చేస్తూందనుకో. ప్రపంచ మంతా కుక్కల నక్కల పాలవుతుంది. మన సామ్రాజ్యం ఇలా నీళ్ళ కలిసి పోతోందా? అటు రష్యన్ భల్లూకం దొరికినవాళ్ళ నందర్నీ భక్షించేస్తోంది: దొరకని వాళ్ళకోసం చేతులు జాస్తోంది."

"ఇటు ఏటమ్ రహస్యం మనకైనా చెప్పకుండా అమెరికన్లు పట్టుకూర్చు న్నారు." "వాళ్ళెందుకుచెప్తారు? మనమీద పెరిగేద్దామని వాళ్ళు చూస్తున్నారు కదా"

"వాళ్ళూ వీళ్ళూ మనం కూడా జర్మనీలో బైరాయించి రాళ్ళు కొంటు న్నాం." "మన మధ్య జర్మనీయే కాక యూరప్ అంతా నలిగిపోయింది."

"ఇటు ఆసియాలో ఇండియన్లతో సహా అంతా కొట్టుకు చస్తునారు."

"అంతా ఘోరంగా ఉంది."

"చూస్తూ వుంటే ప్రపంచానికి ఆఖరి దశ సమీపించినట్టుంది."

"బాగా చెప్పావు." . . .

ప్రపంచం సాగుతూనే ఉంది, ఇన్ని వేల సంవత్సరాల నుంచీ, ఇన్ని యుగాలనుంచీ....

(ఈ కథ హిందీ అనువాదం "ఆఖరీ దశా" పేరుతో కేరళ నుంచి వెలువడే హిందీ పక్ష పత్రిక "యుగ ప్రభాత్"లో 1964 మధ్యలో వెలువడింది. అనువాదం నిర్మలానంద చేశాడు. సం॥)

# భావాల లావాలు చిమ్మిన రావికొండ

— వి.వి. రమణమూర్తి

శ్రీముఖ నామ సంవత్సరం - అశ్వీయుజ మాసం - ఏకాదశి - బుధవారం- నవంబరు పదో తేదీ! ఉదయం తొమ్మిదీ నలభై అయిదు నిమిషాలు! విశాఖ సాగరం వెక్కి వెక్కి ఏడ్చింది. రోజూ నాతో పోటీ పడే నా నేస్తం ఏమైపోయాడని గుండె లవిసేలా ఘోషించింది. దుఃఖసాగరమై కడలి పొంగిపోయింది!

నిత్యం నిమగ్నమైన ఆలోచనలతో ఎప్పటిలా కుర్చీలో ఠీవిగానే నిలువెత్తు రావిశాస్త్రి ఆ రోజు కనిపించలేదు. ముసి ముసి నవ్వులు ఒక్కసారిగా నిలిచి పోవటంతో ఆ కళ్లు మూగబోయింది. కథకు సాంఘిక ప్రయోజనం, సామాజిక స్పృహ ఎంత అవసరమో ఈ ప్రపంచానికి చాటిన రావిశాస్త్రి బతుకు పుస్తకంలో ఆఖరి పేజీ తిరగేసింది. కృష్ణాసగర్ తల్లడిల్లింది. సాహితీ ప్రపంచం ఈ 'నిజా'న్ని జీర్ణించుకోలేకపోయింది. నివ్వెరపోయింది. కాని.... ఈ నిజానికి 'తిరస్కృతి' తప్పదంది. సాహిత్య ప్రపంచం, సాహితీ లోకం మళ్ళీ మళ్ళీ కన్నీరు కార్చింది. ఇంకా దుఃఖిస్తూనే వుంది. మరో కొండలా నిలిచిన రావిశాస్త్రి తుది శ్వాస విడవడంతో సర్వస్వం కోల్పోయినట్టు విశాఖ విషాదమైంది. రావిశాస్త్రి తాత పురోహితుడు. కాని రావిశాస్త్రి ప్రజా హితుడు. ఆయన తాతగారు మంత్రాలు వల్లిస్తే ఈ మనుమడు పేదల్ని నంజుకు తినేసేవారి 'తంత్రాల'ను బయటపెట్టేవాడు. ఆయన తాత మంత్రాలను ఆపోశన పడితే ఈ మనుమడు సమాజాన్ని కాచి వడపోశాడు. తన తండ్రి న్యాయవాద పట్టా పుచ్చుకుని కూడా అన్యాయవాదిగా బ్రతకడం ఇష్టం లేక హాలికునిగా బ్రతికారని ఆయన చెప్పారు. ప్రముఖ న్యాయవాది అయి వుండి కూడా ఈ కోర్టుల్లో న్యాయం అనేది లేదని వ్యక్తిగా, రచయితగా చాటిన మనిషి రావిశాస్త్రి. సమాజమనే పుస్తకంలో 'పేదల బ్రతుకులు' పార్యాంశాన్ని పేదల మధ్యలో కూర్చునే అర్థం చేసుకున్నాడు. అందుకే ఆయన రత్తాలును, రాంబాబును ముత్యాలును, అడ్డ బుర్రను, విమలను, పైడితల్లిని, పీనుగ్గుమాస్తాను, వేతన శర్మను, సుబ్బయ్యను, అంతరాత్మగాడిని అందరికీ చూపించ గలిగాడు. తాను మరణించినా వీళ్ళనెవరూ చంపలేరన్నారు. అందుకే ఆయన రచనలకు ముగింపు నెప్పుడూ ఇవ్వలేదు. అవి సజీవమైన పాత్రలు. ఈ సమాజం వున్నంతవరకూ అవి బ్రతికే వుంటాయి. అవి బ్రతికున్నంతవరకూ రావిశాస్త్రి బ్రతికే వుంటాడు. అందుకే.... రావిశాస్త్రి చనిపోయారన్న 'నిజా'నికి 'తిరస్కృతి' తప్పదనడం.

రాచకొండ విశ్వనాథ శాస్త్రి చిన్నప్పుడు తాను దుంపల బడిలో చదువుకున్నానని సగర్వంగా చెప్పుకునే వారు. రెన్ అండ్ మార్టిన్ గ్రామరు పుస్తకం లేనప్పుడో, నిక్కరు లేనప్పుడో ఆయన ఆ దుంపల బడికి కూడా వెళ్ళలేని పరిస్థితి ఉండేది. అయినా ఆయన 'విశ్వం' గనుక అచంచలమైన ఆత్మ విశ్వాసంతో నిరాశ పడకుండా పుస్తకాల్లో పాఠాలను, సమాజంలోని జనాలను చదవడం నేర్చుకున్నారు. అమ్మ దగ్గరుండి చదివించినా అమ్మమ్మ చెప్పిన శైలినే అలవరచుకున్నారు. కత్తి గొప్పదా? కలం గొప్పదా ? అంటే కత్తే గొప్పదని వాదించారు. అందుకే రావిశాస్త్రి తన కలాన్ని పాలకులపై కత్తిగా ఎక్కుపెట్టారు. అనకాపల్లికి నాలుగు కిలోమీటర్ల దూరంలోని తుమ్మపాల గ్రామంలో ఆయన బాల్యం గడిచింది. ఆ ఊరుని ఆయన ఉత్తరాంధ్ర మాండలీకంలో 'తుంపాలా' అనే ఎప్పుడూ పిలిచేవారు. శాస్త్రిగారు మొదటి కథను 1936లో ఈ గ్రామంలో వున్న తన ఇంట్లోనే రాసారు. చిన్నప్పటి నుంచి బాధ్యతతో రచన చేయాలనేవారు. తన బాధ్యతను మాత్రం ఎప్పుడూ మరచి పోలేదు. 1938లో హిస్టరీలో శాస్త్రిగారికి బహుమతి వచ్చింది. అయితే వేదిక మీదకు పిలిచినా వెళ్ళి తీసుకోలేదు. చిన్నతనం నుంచి డాబూ దస్కం లేని వ్యక్తి. 'నేనేం గొప్పవాణ్ణి కాదు. ఇంట్లోపడి కొట్టుకొంటున్న కథని బయటకు తీసుకువచ్చాను' అని చెప్పిన శాస్త్రి గారికి తొలి తెలుగు కథ రాసిన గురజాడ అంటే విపరీతమైన గురి. 1957లో 'తిరస్కృతి' రాయడానికి ముందు కన్యాశుల్కం చదివారు. ఆ ప్రాయ అయన అనుకున్నారట రాయడం ఎంత కష్టమో! అని. తిరస్కృతి రాసిన తర్వాత మనుషులు ఎలా మాట్లాడుకుంటున్నారో గమనించడం మొదలుపెట్టారు. అదే శాస్త్రి గారి శైలి! కథ చదివి ఈ కథ రావిశాస్త్రి రాసిందేనని చెప్పగలిగే శైలి ఆయనది.

1963లో విశాఖ రచయితల సంఘం సమావేశంలో 'నేనెందుకు రాస్తున్నాను' అనే శీర్షికను ఇచ్చి ప్రతి రచయిత ఆలోచించి తేల్చుకోవాలని శాస్త్రిగారు చెప్పారు. ఇది కా.రా. మాస్టారుతో సహా అందర్నీ కదిలించి మళ్ళీ గొప్ప కథల్ని రాయించింది. చెఖోవ్ అంటే ఇష్టం. డికెన్స్ అంటే ఆరాధన. "Law is an assఅన్నవాడు నాకు దేవుడే. దేవుడు ఎవడన్నా వుంటే డికెన్సే" అనేవారు శాస్త్రిగారు. అందుకే శాస్త్రిగారు నిరుపేద నేరస్థుల తరపున వకల్తా తీసుకునేవారు. ఒక నిరుపేద హత్య చేస్తే ఆ హత్య ఎందుకు చేశాడు? ఏ కారణాల చేత చేశాడు? ఏ పరిస్థితుల్లో చేసాడు? అన్న ప్రశ్నలకు సమాధానాలు రాబట్టేవారు! శాస్త్రిగారు క్రిమినల్ కేసు వాదిస్తే తిరుగులేదు. చట్ట ప్రకారం కాకుండా సామాజిక దృక్పథంతో వాదించేవారు. ఎంతో మంది నిరుపేదలను సంకెళ్ళ నుంచి తప్పించేవారు. సొమ్ములు సంపాదించాలనే యావ వుండేది కాదు. సొంత ఇళ్ళు వుండాలనే ధ్యాస వుండేది కాదు. ఇల్లు అనేది

వుండడానికి గూడు గాని, స్వంత ఆస్తి కాదనేది శాస్త్రిగారి అభిప్రాయం. ఆటో ఎక్కి కోర్టుకు వెళ్ళేవారు. జేబులో డబ్బు లేకపోతే నడిచే వెళ్లేవారు. ఎప్పుడైనా ఎవరైనా పాత్రికేయుడు శాస్త్రిగారూ 'ఈ విషయం'పై మీ అభిప్రాయం ఏమిటి? అని ప్రశ్నిస్తే, ఒక్కసారి ముక్కు పొడుం గట్టిగా పీల్చి 'నా అభిప్రాయం సరే. ముందు నీ అభిప్రాయం ఏమిటి?' అని ఎదురు ప్రశ్న వేసేవారు. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడేవారు. ఎంతో చదువుకొన్న శాస్త్రిగారు ఉత్తరాంధ్ర మాండలికంలో మాట్లాడుతుంటే ఎంతసేపయినా వినాలనిపించేది.

'పాపంలా' పెరిగిన పెద్దవారు ఎన్ని పాపాలు చేసినా సరే పెద్దవారుగా, ప్రభువులుగా వుంటున్నారు. ఈ పరిస్థితిలో ఈ సంఘంలో పేదవాడి న్యాయం దొరకదు గాక దొరకదు. తన కన్యాయం జరిగితే ఎదుర్కొందికి పేదవాడికి సంఘంలో అవకాశం లేదు కాక లేదు 'పాపుల్లో సాహసులూ ఉంటారు' అన్న రావిశాస్త్రి మాటలే నడుస్తున్న చరిత్రకు దర్పణం. 'తప్పులు అందరూ చేయగలరు. త్యాగాలు మాత్రం కొందరు చేయగలరు' అంటూ వారి ఋణం తీర్చుకోవడం కోసం ముందడుగు వేయాలనేవారు.

"విశాఖలో ఏరాడ కొండ లేకపోతే విశాఖకి రేవుండదు. రేవు లేకపోతే విశాఖకి ఇన్ని పరిశ్రమలుండవు. ఇన్ని పరిశ్రమలు లేకపోతే ఇంతమంది జనానికి ఈనాడు ఈ పాటైనా బతుకుండదు. మావూరి యారాడకొండే నాకెక్కువ ఇష్టం" అని రావిశాస్త్రి చెప్పుకునేవారు. విశాఖలో యారాడకొండే కాదు రాచకొండ కూడా వుంది. ఒక రచయిత అన్నట్టు యారాడకొండ మీద లైట్‌హౌస్ వుంటే రచయితలకు రాచకొండే ఓ పెద్ద లైట్‌హౌస్. ఇప్పుడు ఆ దీపం ఇక వెలగదు. దారి చూపించదు. ఇంతకు పూర్వం ఆ దీపం వెదజల్లిన వెలుగుల్లోనే మనం దారి వెదుక్కోవాలి!

(ఆంధ్రజ్యోతి దినపత్రిక 12-11-93 "వారం వారం విశాఖ తీరం" సౌజన్యంతో)

---

"ఏమీ తోచనప్పుడు కథలు రాస్తాను. కథలు రాస్తేగానీ ఏమీ తోచదు"

— **రావిశాస్త్రి**

చర్చ :

# స్త్రీ వాద ప్రశ్నల్ని, పరిశీలనల్ని నిరాకరించటం సరైంది కాదు

ఓల్గా "రాయకీయ కథలు"పై సూర్యసాగర్ గారి విమర్శను గురించి మాట్లాడు కునే ముందు, సాహిత్య విమర్శలో పాటించాల్సిన కొన్ని కనీస నియమాల్ని పరిశీలించాల్సిన అవసరం వుంది. ఒక రచయిత మీదా, రచన మీదా విమర్శకు దిగే ముందు ఆ రచనలోని వస్తువేమిటీ, దాన్ని రచయిత ఏ దృక్పథంతో చెప్తున్నారూ, ఆ రచనతో మనం విభేదించే అంశాలున్నప్పటికీ, ఆ వైరుధ్యాలు ఎలాంటి స్వభావంతో వుండాలీ అనే అంశాన్ని స్పష్టం చేసుకోవాలి. అందులోనూ, ఆ విమర్శ కుడు పీడిత ప్రజల ఉద్యమానికి ప్రతినిధి ఐనప్పుడూ, ఆ రచన పీడిత ప్రజల్లోని ఒక సెక్షన్‌ని చిత్రించేదయినప్పుడూ ఈ విషయాల్లో మరింత జాగ్రత్త అవసరం. నిర్దిష్టంగా ఒకే రచనను తీసుకుని విమర్శిస్తున్నప్పుడు ప్రత్యేకంగా తీసుకోవాల్సిన జాగ్రత్తలూ కొన్ని వుంటాయి. ఆ రచన గురించి పాఠకులకు ఒక అంచనాని యివ్వగలగటం, ఆ రచయిత మొత్తం సాహిత్యంలో ఈ రచన స్థానాన్ని గుర్తించ గలగటం, ఈ రచన నాటికి ఆ రచయితలో వస్తున్న క్రమ పరిణామాన్ని అర్థం చేసుకోవటం చెయ్యగలగాలి విమర్శకుడు. ఇవన్నీ వదిలేసి, ఆ రచయిత ప్రాతి నిధ్యం వహిస్తున్న దృక్పథం మీదా, ఆ రచయిత మీదా ముందే ఏర్పర్చుకున్న అభిప్రాయాల ఆధారంగా తప్పులు వెదక బోవటం, రచనలో వున్న విషయాన్ని వదిలేసి మరేదో ఎందుకు రాయలేదని ప్రశ్నించటం, ఆ రచనలో లేని అంశాలను దానికి ఆపాదించి వక్రీకరించటం సాహిత్య విమర్శ కాలేదు. సూర్యసాగర్ గారు యిదే పద్ధతిలో రాజకీయ కథలపై విమర్శకు దిగారు.

అసలు సూర్యసాగర్ గారి వ్యాసం ప్రారంభానికీ, తర్వాత కొనసాగిన విధా నానికీ మధ్య సమన్వయం లేదు. దాదాపు ప్రతి కథ మీదా ఆయనకు అభ్యంత రాలున్నాయి. ఈ కథల్లోని సమస్యలు యాంత్రికమైన, నినాదప్రాయమైన ముగింపు లతో పూర్తవుతున్నాయనీ, చిత్రీకరణ అసహజంగా నమ్మశక్యం కాని విధంగా వున్నదనీ ప్రతిచోట చెప్తూనే వుంటారు. కానీ, వ్యాసం ప్రారంభంలో "పితృస్వామ్య వ్యవస్థ రూపొందించిన జెండర్ విధానం దాదాపు అన్ని కథల్లోనూ.... సహజంగా వాస్తవికంగా చిత్రితమైంది" అంటూ చెప్పటంతో పాఠకులకు అనవసరమైన గందర

గోళం ఏర్పడుతుంది. ఒకే కథ ఒకే సమయంలో "సహజంగా, వాస్తవికంగా"నూ, "విశ్వసనీయం కాకుండానూ" కూడా వుండగలగటం ఎలా సాధ్యమవుతుందో అర్థం కాదు. తన వ్యతిరేకతను బలవంతంగా అణిచిపెట్టి, సహనాన్ని ప్రదర్శించాలని చేసే ప్రయత్నంవల్ల వచ్చే ప్రయోజనమేమీ లేదు. ఈ రకమైన వైరుధ్యాలు విమర్శలో ప్రతి చోటా కన్పిస్తూనే వుంటాయి. ఒక ఉదాహరణ చూస్తే--

సమస్యల్లో వున్న ఆడవాళ్ళు ఐక్యంగా పురుషాధిక్యతను ఎదిరించ బూనుకోవటాన్ని కేవలం వ్యక్తివాదంగా ఒక చోట చెప్తూ (పే. 35), మరో చోట ప్రతి కథ చివరా స్త్రీలలో తిరుగుబాటు చైతన్యం ఏర్పడటం, ఐక్య పోరాటాల స్పృహ కలగటం లాంటి ముగింపుల వల్ల ప్రయోజనం ఏమీ లేదని (పే 34) విమర్శిస్తారు. రెండు వైపులా పదునున్న ఆయుధంతో ఈ కథల మీద తీర్పు చెప్పే ప్రయత్నం చేశారు సూర్యసాగర్‌గారు. వ్యక్తులుగానే సమస్యల్ని పరిష్కరించుకుంటే, వ్యక్తివాదము, ఐక్య పోరాటాల్లో కలిసి సాగితే, యాంత్రికమైన నినాదమూనూ!

వ్యక్తిగత అనుభవాల ద్వారా, సాటి స్త్రీల వర్ధంచేసుకునే స్థాయికి చేరటమనేది "నమ్మశక్యం" కాని విషయమేమీ కాదు. సమస్యల నుంచి పూర్తిగా విముక్తిమయ్యేందుకు పనికొచ్చే శాస్త్రీయ సిద్ధాంతం తెలియకుండానే మానవత్వంతో, స్పందనతో, లోక జ్ఞానంతో కొన్ని సరైనమార్గాలను చెప్పగలగటమనేది జరుగుతూ వుంటుంది కొన్ని సందర్భాల్లో. గురజాడ, చలం లాంటి రచయితల్ని అలాగే అర్థం చేసుకోవాల్సుంటుంది. వాళ్ళకున్న పరిధుల్లోంచే వాళ్ళ కృషిని అర్థం చేసుకోవటం సరైన పద్ధతి. ఓల్గా కథల్లోని ఈ స్త్రీలు - "గోడలు"లో రేవతి, "భద్రత"లో సుజాత లాంటివాళ్ళు స్త్రీ విముక్తి ఉద్యమాలను నిర్మించ లేకపోవచ్చు కానీ, తమ అనుభవాల్లోంచి పొందిన అవగాహనతో సాటి స్త్రీల సమస్యలకు స్పందించ గలగటం అసాధ్యమైన విషయమేమీ కాదు. దోపిడీకీ, పీడనకూ, అణచివేతకూ గురవుతున్న ఒక ప్రజా సమూహం రూపాల్లో వేరుగా వున్నా, మౌలికంగా అవే సమస్యలలో వున్న మిగిలిన పీడిత వర్గాలపట్ల స్పందించ గలిగే అవకాశాలు ఎక్కువగా వుంటాయన్న సూత్రం మీదనే పీడిత వర్గాలన్నిటినీ సమీకరించే ప్రయత్నం చేస్తుంది విప్లవోద్యమం.

ఈ కథల్లో ఎక్కడా "కాస్త మానవత్వం గల పురుష పాత్ర మచ్చుకైనా లేకపోవడం" (పే.34) అనేది సూర్యసాగర్ గారికి నచ్చని మరొక విషయం. పితృస్వామిక సమాజపు అణచివేతనూ, అది పురుషులకిచ్చే హక్కులనూ, అధికారాలనూ చిత్రించటం ఈ కథల లక్ష్యం. ఇందులో పురుషుడి వ్యక్తిగత బాధ్యతనూ, అతని మీదున్న సాంస్కృతిక భావ జాలపు ప్రభావాన్ని వివరంగా చర్చించేంత విస్తృతమైన కేన్వాస్ వుండదు చిన్న కథకు నవలలో లాగా. అలాంటప్పుడు

పురుషుల ప్రవర్తనలో పితృస్వామ్య వ్యవస్థ స్వరూపం ఎలా ప్రతిఫలిస్తుందో రచయిత్రి చిత్రించాల్సుంటుంది. ఇక్కడ మంచి వాళ్ళయిన పురుషుల్ని గురించి చెప్పటం అసందర్భం. సమస్యలకు గురవుతూన్న మెజారిటీ ప్రజల పక్షం వహించి ఆయా వర్గాల ప్రధాన లక్షణాలతో టైప్ కారెక్టర్స్‌ని సృష్టించటం ఏ ఉద్యమానికి చెందిన సాహిత్యంలోనైనా సహజంగా కన్పించేదే. శ్రామిక వర్గపు సమస్యల్ని చిత్రించే కథలు రాస్తున్నప్పుడు ఒక ఉత్తమ భూస్వామినో, దయామయుడైన పెట్టుబడిదారుడినో గురించి చెప్పాల్సిన అవసరం వుండదు. కొద్దిమందిలోని వ్యక్తిగతమైన మంచితనానికి ఆ సమస్యల్ని పరిష్కరించే శక్తి వుండదు కాబట్టి.

"మధ్య తరగతి సమస్యల్ని ఎందుకు రాశారూ?" అనేది మార్క్సిస్టు విమర్శ పేరు మీద కొందరు చెలామణీ చేస్తున్న ఓ అరిగిపోయిన ప్రశ్న. జెండర్ కారణంగా అన్ని వర్గాల స్త్రీలకూ ఏర్పడుతున్న కొన్ని కామన్ సమస్యలను గురించి చెప్పటం ఈ కథల్లో రచయిత్రి ఉద్దేశ్యం. దానికి నేపథ్యంగా రచయిత్రి తనకు తెలిసిన మధ్యతరగతి జీవితాన్ని తీసుకోవటం నేరం కాదు. ఏ ఉద్యమానికైనా ప్రారంభ దశలో చదువుకున్న మధ్య తరగతి వాళ్ళు నాయకత్వ స్థానంలో వుండటం, ఆ ఉద్యమ ప్రచారం లిఖిత సాహిత్యం ద్వారా జరుగుతున్నప్పుడు ఆ మధ్యతరగతే రచయితలుగా వుండటం సహజమైన విషయం. శ్రామిక స్త్రీల విముక్తికి ఫెమినిజం ఉపయోగపడుతుందా ? లేదా ? అనేది ఇవాళ సాహిత్య విమర్శల్లో తేల్చేసుకునే విషయం కాదు. ఈ కథల్లోని అంశాలు శ్రామిక స్త్రీల పట్ల వ్యతిరేకతను ప్రచారం చేస్తున్నాయా? అనే దాన్నిబట్టే ఈ కథలను స్వీకరించటమో, తిరస్కరించటమో చెయ్యాలి. అలాంటి ఆరోపణ చెయ్యటానిక్కూడా ఒక సాకును సిద్ధం చేసుకున్నారు సూర్యసాగర్‌గారు- "ఏం చెయ్యాలి ?" కథలోని శ్రామిక స్త్రీ 'సీత' పాత్రను ఈ ఫెమినిస్టు రచయిత్రి ఉద్దేశ పూర్వకంగా "అప్రధాన పాత్ర"గా చిత్రించారని. పాత్ర నిడివినిబట్టి ప్రాధాన్యతను నిర్ణయించడం సరైందికాదు.

ఈ కథల్లోని స్త్రీ పాత్రలు చదువుకుని, ఉద్యోగాలుచేస్తూ ఆర్థిక ఇబ్బందుల్లో లేని వాళ్ళు కాబట్టి, కుటుంబాల నుంచి బయటపడినా అదే ఆర్థిక స్థాయిలో బతక గలిగిన వాళ్ళు కాబట్టి వాళ్ళ సమస్యలూ, అనుభవాలూ స్త్రీల విముక్తికి ఉపయోగ పడవనేది సూర్యసాగర్‌గారి అవగాహన. సమస్యల ప్రాధాన్యతల పేరు మీద సాంస్కృతిక పోరాటాల అవసరాన్ని వెనక్కినెట్టేసే ధోరణే యిది. రచయిత్రి ఉద్దేశించిన విషయాన్ని ఏ మాత్రం పట్టించుకోకుండా మరేదో లేదని ఆరోపించటం వ్యాసం పొడవునా ఆయన చేస్తూనే వున్నారు. స్త్రీ పురుష సంబంధాల్లో వైరుధ్యాలు పెరగటానికి కారణమవుతున్న "అర్ధ వలస వ్యవస్థ, దళారీ పెట్టుబడిదారీ విధానము,........ సామ్రాజ్యవాద దోపిడీ సంస్కృతుల దొరబాటు (పే. 35) అనే

అంశాల ఆవిష్కరణ ఈ కథల్లో లేదనేది కూడా ఒక ఆరోపణ. ఇవాళ్టి సమాజంలో ఒకవైపు డబ్బు సంపాదించే యంత్రంగానూ, మరోవైపు చెలామణీలో వున్న ఫ్యూడల్ విలువలను సంతృప్తి పరచాల్సిన బాధ్యతతోనూ ఆధునిక స్త్రీ ఎలా నలిగి పోతోందో ఈ సంకలనంలోని చాలా కథలు ముఖ్యంగా "గోడలు", "ఎన్నికలలో" లాంటివి చెప్తాయి. ఫలానా పడికట్టు మాటలున్నాయా ? లేదా ? అని వెతికే బదులు కథల్లోని ఆడవాళ్ళ జీవితాల్లోని సంఘర్షణను అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తే ఈ అనుమానం వచ్చేది కాదు.

ఈ కథల్లో ఎక్కడా లేని విషయాల్ని గూర్చి మాట్లాడుతూ స్త్రీ వాదంలో "శ్రామికోద్యమ వ్యతిరేకత" వుందనీ, వివాహాలకు బయట మాతృత్వపు హక్కుని కోరుతున్నారనీ చేసే ఆరోపణలు విమర్శను పక్కదారి పట్టించేవే. ప్రత్యేకంగా ఒక పుస్తకాన్ని గురించి మాట్లాడుతున్నప్పుడు అందులోని రచనలకు అప్లై చెయ్యటానికి వీల్లేని, ఆధారాల్లేని విషయాల్ని ప్రస్తావించటం ప్రయత్న పూర్వకంగా ఆ రచన మీద పాఠకులకు వ్యతిరేకత కలిగించటం కోసమే అవుతుంది. రచయిత్రి ప్రాతినిధ్యం వహిస్తున్న సోషలిస్టు ఫెమినిజం స్త్రీల లైంగికత్వం గురించీ, జెండర్ విధానాన్నీ, సంతానోత్పత్తినీ గురించి కొన్ని ప్రశ్నల్ని ముందుకు తెస్తోంది. సమాజపు అభివృద్ధిలో సమానమైన ప్రాధాన్యత గల ఉత్పత్తి, పునరుత్పత్తి అనే రెండు అంశాలనూ ఎంగెల్స్ గుర్తించినా, తర్వాత క్రమంగా ఆర్థిక పునాది కిచ్చిన ప్రాధాన్యతను పునరుత్పత్తికి కమ్యూనిస్టులు యివ్వలేదనేది స్త్రీ వాదం చెప్తున్న ఒక అభ్యంతరం. పితృస్వామ్య సంస్కృతిని సమూలంగా నిర్మూలించేందుకు సోషలిస్టు సమాజ స్థాపన అంతిమ లక్ష్యంగా వుండటం నిజమే అయినా, పురుషుల ఆధిపత్యాన్నీ, కుటుంబ హింసనూ ఎదిరించి ముందుకు సాగేందుకు స్త్రీల కిస్తున్న తక్షణ కార్యక్రమం ఏమిటీ అనేది మరో ప్రశ్న. దానికి జవాబుగా పురుషాధిక్య సంస్కృతిలోని ప్రతి అంశానికీ వ్యతిరేకంగా స్త్రీలను చైతన్యవంతం చెయ్యటాన్ని స్త్రీ వాద ఉద్యమం తన లక్ష్యంగా చెపుతోంది. ఈ క్రమంలో కొన్ని ఫెమినిస్టు గ్రూపులూ, వ్యక్తులుగా కొందరు రచయిత్రులూ స్త్రీ విముక్తికీ, మార్క్సిజానికీ శత్రుత్వం వుందనే ధోరణిని కూడా ప్రదర్శించారు. కమ్యూనిస్టు ఉద్యమాల ఆచరణలోని కొన్ని అవగాహనా లోపాలను పథకం ప్రకారం జరిగిన కుట్రలుగా చిత్రించటమూ, వాస్తవాల వక్రీకరణా, కొన్ని విడి సంఘటనలను జనరలైజ్ చెయ్యబోవటం లాంటివి కూడా స్త్రీ వాద రచయిత్రులు కొందరిలో కన్పిస్తాయి. వాటిని సైద్ధాంతికంగా ఎదిరించటం అవసరం కూడా! కానీ, స్త్రీ వాదం ముందుకు తెస్తున్న న్యాయమైన ప్రశ్నల్నీ, విలువైన పరిశీలనల్నీ నిరాకరించటం సరైందికాదు. అందులోనూ పీడిత వర్గాలన్నిటినీ కలుపుకుని పోవలసిన లక్ష్యంతో సాగే కమ్యూనిస్టు ఉద్యమం

ఈ సంయమనాన్ని పాటించి తీరాల్సే వుంటుంది. శత్రు పూరితమైన విమర్శల్ని ఎవరు మొదలు పెట్టారంటూ తారీకుల లెక్కలు తేల్చ పూనుకోవటం యిప్పుడు అనవసరం. సరైన పంథాకోసం పరస్పర అవగాహనతో కృషి చెయ్యటానికి బాధ్యతగల వారందరూ ముందుకు రావల్సుంటుంది. "సోషలిస్టు ఉద్యమాన్ని ఉపేక్షించటం కానీ, అధిక్షేపించటం గానీ స్త్రీ విముక్తి ఉద్యమానికి ఆత్మవినాశనకారి మాత్రమే అవుతుంది" (పే. 35) అనడంవల్ల మార్క్సిస్టు విమర్శ సాధించ గలిగే దేమీలేదు. ఒక మూసలో బిగదీసుకు పోయాక ఏ ఉద్యమమైనా జీవాన్ని కోల్పోయి గిడసబారి పోతుందనేది చరిత్ర నేర్పిన పాఠమే!

## 'తరతరాల రాయలసీమ'

### పునః ప్రచురణ

ప్రకృతి అనాదరణకు, పాలకుల నిర్లక్ష్యానికి గురైన రాయలసీమ నిరంతరం కరువులకు నిలయమైంది. కరువుల సీమ సమస్యల పరిష్కారం కొరకు పాలక వర్గాలు ప్రయత్నమే చేయడం లేదు. గతంలో 'కదలిక' పత్రిక రాయలసీమ సమస్యలనూ, నీటి పారుదల ప్రాజెక్టుల వివరాలూ, మొదలగు వివిధ సమస్యలపై వ్యాసాలను ప్రచురించింది. వాటినీ, మరికొన్ని వ్యాసాలనూ కలిపి 'తరతరాల రాయలసీమ' అనే ప్రత్యేక సంచికను 'కదలిక' సంపాదక వర్గం ప్రచురించింది.

ఈ సంచిక కాపీలు అయిపోయాయి. దానిలోని లోటుపాట్లను సరిచేసి, మరి కొన్ని వ్యాసాలు కలిపి మరల 'తరతరాల రాయలసీమ'ను ప్రచురించే ప్రయత్నానికి సహాయ సహకారాలను, విరాళాల రూపంలోనూ, ప్రకటనల రూపంలోనూ అందించ వలసిందిగా 'కదలిక' సంపాదక వర్గం కోరుతోంది.

ఉత్తర ప్రత్యుత్తరాలకు :

**చిరునామా :**

భూమన్
పద్మావతి నగర్
తూర్పు రైల్వేస్టేషన్ దగ్గర
తిరుపతి

ఇమామ్
ఎడిటర్ 'కదలిక'
14/142 E, కమలానగర్
అనంతపురం




బంగోరె తెలుగు సాహిత్యానికి నిస్వార్థ సేవ చేసాడు. అమూల్యమైన విషయాలు బయటకు తెచ్చాడు. "ప్రజాసాహితి" యీ విషయంలో మంచి పని చేసింది. పోతే, ఒక చిన్న సవరణ. నా అభిప్రాయంలో—

"Depth, width and worth వున్న మనుషులంటే ఆయన కిష్టం. అవి ఆరుద్రలో వున్నాయి. శ్రీశ్రీకి లేవు గదా" అన్నట్లు అచ్చయింది. ఇది దారుణమైన అపార్థానికి దారి తీసే ప్రమాదముంది.

"తెలుగు పరిశోధనలో depth, width and worth వున్న మనుషులంటే ఆయన కిష్టం. ఇవి ఆరుద్రకున్నాయి. శ్రీశ్రీకి పరిశోధనతో ప్రమేయం లేదు కనుక లేవు. అందుచేత బంగోరెకు వ్యక్తిగతంగా శ్రీశ్రీ కంటే ఆరుద్ర సన్నిహితుడు" అని వుండాలి. ఈ చిన్న సవరణ ప్రచురించగలరని కోర్తూ—

విశాఖపట్నం

— చందు సుబ్బారావు

  

"ప్రజాసాహితి" నవంబరు 1993 సంచికను అమూలాగ్రం చదివాను. "బంగోరెను జ్ఞాపకం చేసుకుందాం" అనే శీర్షికతో "బంగోరె" ఫోటోను అట్టపై చూసి కుతూహలంతో ఈ సంచికను చదవడం నాకు చాల సంతోషాన్ని కల్గించినది. కారణం "బంగోరె"గా పిలవబడే బండి గోపాలరెడ్డి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బి కాం. (ఆనర్సు) తరగతిలో నా సహాధ్యాయి కావడమే. "బంగోరె" భాక్రా డామ్ నుండి 31-10-1982న రాసిన ఉత్తరం చదువుతూ ఉంటే మనసు ద్రవించి కన్నీళ్ళు వచ్చాయి. "బంగోరె"ను గూర్చి వ్రాసిన వ్యాసాలు చదువుతూ ఉంటే నా మిత్రుని ఎదురుగా చూసినట్లే అనుభూతిని పొందాను. చదివే రోజులలోనే "బంగోరె" తన

కవిత్వంతో మమ్మల్ని ముగ్ధుల్ని చేసేవాడు. అతని మరణం ఒక విచార, విషాద ఘట్టం.

—నంగేగడ్డ కోటేశ్వరరావు

నగరం రిటైర్డ్ ప్రిన్సిపాల్

  

శ్రీ కె. వి. ఆర్, బంగోరెను 'పరిశోధక సాహసి'గా పేర్కొన్నారు (బ్రౌన్-వేమన సంచిక 1984 - కడపజిల్లా రచయితల సంఘ ప్రచురణ) అక్షరాల అక్షరాలా వాస్తవం.

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం చేపట్టిన బ్రౌన్ ప్రాజెక్టు పరిశోధకుడుగా 1976లో బంగోరె కడప వచ్చాడు. తన వద్ద నున్న 'రికార్డ్స్' సహాయంతో, కడపలో బ్రౌన్ నివసించిన భవనాన్ని గుర్తించాడు నన్నూ రమ్మన్నాడు. బ్రౌన్ స్మారకార్థం ఏదైనా చేయమని కోరాడు. అప్పటి కడప కలెక్టర్ డా॥ పి. యల్. సంజీవ రెడ్డిగారు. బ్రౌన్ పేర గ్రంథాలయ భవన నిర్మాణం కావాలన్నాడు స్థలాన్ని ఉచితంగా లభింప చేశారు.

1976 నుండి 1987 వరకు జిల్లా కలెక్టర్లతో రాష్ట్ర ముఖ్యమంత్రితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. బ్రౌన్ గ్రంథాలయ భవన నిర్మాణానికి కలెక్టర్ శ్రీ జంధ్యాల హరినారాయణ 1987 జనవరి 22న శంకుస్థాపన చేశారు. 1991 నాటికి భవన నిర్మాణం పూర్తి అయింది. మన దురదృష్టం కొద్దీ ఆ భవనాన్ని చూచి ఆనందించే బంగోరె లేక పోవటం అత్యంత బాధాకరమైంది. ఈ మహా త్కార్యానికి ప్రేరకుడు మిత్రుడు బంగోరె.

ఈ సందర్భంగా, బ్రౌన్ ప్రాజెక్టు ప్రచురించిన 'బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు - కడప జాబుల సంకలనం' వెలువరించుటకు, ఆంధ్రకేసరి, ప్రకాశం పంతుల శత జయంతి నిధుల నుండి అయిదు వేల రూపాయల ఆర్థిక సహాయమందించిన కలెక్టర్ డా॥ పి. యల్. సంజీవరెడ్డిగారి సహకారం బంగోరెకు లభించింది.

బంగోరెకు పట్టిన 'బ్రౌన్ ఫీవర్'ను నాకూ సంక్రమింప చేశాడు. అందు వల్ల ఒక మంచి పని జరిగిందనుకుంటున్నాను.

బ్రౌన్ గ్రంథాలయంలో, బ్రౌన్ ఊహా చిత్రం వుంది. బంగోరెగారి చిత్ర పటం కూడా వుంచబడుతుంది.

— జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కడప కార్యదర్శి, సి. పి. బ్రౌన్ మెమోరియల్ ట్రస్టు.

'బంగోరె'ను గుర్తుంచుకుని మీరయి ప్రత్యేక సంచిక తెచ్చారు. నాకున్న కొద్దిపాటి పరిచయంతో బంగోరె నాకు చాలా ఆత్మీయుడు. తిరుపతిలో ఉండగా తరచూ కలుస్తూండే వాళ్ళం. ఒక మారు శ్రీశ్రీ నుంచి నాకు ఒక కబురు కూడా మోసుకొచ్చి, నన్ను వెదికి అందించి పోయిన మంచి స్నేహితుడు బంగోరె-అవన్నీ జ్ఞాపకంగా మిగిలిపోతాయి. చాన్నాళ్ళకి ప్రత్యేక సంచికతోనే అవన్నీ గుర్తొస్తు న్నాయి.

10 రోజులు క్రితం తంజావూరు సరస్వతీ మహల్‌కు వెళ్ళినపుడు కూడ బంగోరె బాగా గుర్తుకొచ్చాడు.

రావిశాస్త్రి సంస్మరణ జరుపుకుని ఆయన్ని గురించి మాట్లాడుకోవటం ఒక ప్రివిలేజ్‌గా అనిపించింది. నాకు వున్న కొద్దిపాటి పరిచయమే ఆయనకి నేనెంత ఆత్మీయంగా కట్టుబడిపోయానో తెలుస్తోంది. ఆయన రచనలే కాదు - ఉపన్యాసం అన్నా, సంభాషణ అన్నా నాకు భలే ఇష్టం. తిరుపతికి పిలిపించి మాట్లాడించు కోవాలని చాలా కోరికగా ఉండె. అది తీరకుండానే పోయింది.

తిరుపతి — థూమన్.

## ప్రజా సాహితి-జనవరి 1994

**మావో శత జయంతి సంచిక.**

"ప్రజాసాహితి" డిశంబర్ 93 అంటే ఈ సంచికను 'మావో శత జయంతి' సంచికగా విడుదల చేయాలనుకున్నాం. కాని, రా.వి.శాస్త్రి మరణం వల్ల, వారి సాహిత్య విశ్లేషణతో ఈ సంచికను 'రా.వి.శాస్త్రి సంచిక'గా ప్రచురిస్తున్నాం. అయితే మావో జయంతి డిసెంబర్ 26 నాటికి- 'మావో శత జయంతి' సంచికగా (జనవరి 1994) "ప్రజాసాహితి"ని విడుదల చేస్తున్నాం. ప్రజా సాహిత్యం, ప్రజా కళలు, ప్రజా సంస్కృతికి సంబంధించిన వ్యాసాలూ, కవితలూ, కథలూ, నాటికలూ మొదలగు రచనలతో వెలువడే ఈ సంచికకు రచనలు పంపించవలసిందిగా ప్రజా సాహితి రచయితలను కోరుతోంది.

ఈ సంచికకు ప్రకటనలు సేకరించి పంపించ వలసిందిగా పాఠకులనూ, అభిమానులనూ కోరుతున్నాం.

— సంపాదక వర్గం

# రా వి శా స్త్రీ యం

—దివి కుమార్

రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారిని ఎరుగని తెలుగు పాఠకు లుండరంటే అతిశయోక్తి కాదు. ఆయన సుమారుగా 40 సంవత్సరాలుగా రాస్తున్నా 1952 లోనే 'అల్పజీవి' అనే నవల రాసినా గత 20 సంవత్సరాల నుండి బాగా పేరు పొందారు. ఆయన ప్రధానంగా కథలు, నవలలు రాసినప్పటికి వ్యాసాలు కూడా కొన్ని రాశారు. తన పుస్తకాలకూ యితరుల పుస్తకాలకూ ముందు మాటలూ అంతే కాక పత్రికల ద్వారా చేసిన ప్రకటనలూ, నిరసనలూ, విషాద గీతాలూ, నోట్ చేయబడిన కొన్ని ఉపన్యాసాలూ కూడా వున్నాయి. వ్యాసాల నుండి ఉప న్యాసాల వరకు (1960 నుండి నేటి వరకు) ఆయన 60 సం॥ల వయసు నిండిన (షష్ఠిపూర్తి) సందర్భంగా 'విరసం' వారు వాటిని 'రావి శాస్త్రీయం' పేరుతో చలసాని ప్రసాద్ గారు కూర్పుగా ప్రచురించారు.

పురుషులందు పుణ్య పురుషులు వేరన్నట్లు, కొండలలో రాచకొండలు కూడా వేరే. అలాగే రచయితలకు రచయిత అయిన రావిశాస్త్రి గారు మరీ మరీ వేరు. ఆయన తన అద్భుతమైన శిల్ప చాతుర్యంతో తెలుగు పాఠకుల్ని ఉర్రూతలూగిస్తూ వున్నారు. వారి కథా కథనం అనితర సాధ్యం కాదేమోగాని కష్ట సాధ్యమని మాత్రం చెప్పక తప్పదు.

శాస్త్రి గారి రచనలు ఎక్కువగా ఉత్తమ పురుష (ఫస్టు పర్సన్) లో సాగు తాయి. ఆ కారణంగా ఆయన గురించి మనకు ఈ పుస్తకం ద్వారా మరింత ఎక్కువగ తెలిపే అవకాశం లభిస్తుంది.

1938-41 మధ్య, అనగా శాస్త్రి గారికి 16-19 సంవత్సరాల వయసప్పుడే కొన్ని కథలు రాశారట. కానీ తన కథలు ఎందుకో తనకే నచ్చక 1949 దాకా మళ్ళీ రాయానే లేదట. ఆ తర్వాత వారి భార్య కోసం (ఆవిడ రాయమని కోరిన మీదట) ఆవిడ చదవాలనే మళ్ళీ రాయటం మొదలెట్టారట. అలా రాస్తూ రాస్తూ ఒక క్రాస్‌రోడు దగ్గరకు ప్రయాణించి తను ఎటు వైపుండాలో నిర్ణయించు కోవాల్సిన స్థితికి వచ్చి-

"నిజాన్ని తెలుసుకోవటం, అందులో మంచి చెడ్డలేవో నిర్ణయించు కోవటం, మనుషుల్ని మంచికి మళ్ళించడానికి ప్రయత్నించడం రచయితల కర్తవ్యమ"ని 1952 తర్వాత కాలంలో గ్రహించినట్టు "ఎందుకు రాసేను?" అనే వ్యాసంలో రాశారు.

1980 నాటికి దేశంలో ఒకవైపు ప్రజల సమస్యలు తీవ్రతరమవుతున్నా, పాలకుల మోసాలు, వారు చేస్తున్న ఘోరాలు ఎంతగానో పెరిగి పోతున్నా, ప్రజా

ఉద్యమం నిస్తబ్ధంగా, చల్లారిపోయినాయనే అభిప్రాయం కలిగినా వెనువెంటనే ఈ నిస్తబ్ధతను బద్దలు కొట్టాలనీ, ఎండను వెండిలా మండించాలనీ, సంద్రాన్ని ఉడుకు లెత్తించాలనీ, నదులన్నీ నయాగారా జలాలు కావాలనీ అనుకున్నారు. ఈ ప్రభుత్వాన్ని ఈడ్చి ఎండ బెట్టాలనీ, వారి గుమస్తాలను గుద్ది దూర్చి పెట్టాలనీ, కూలీలందరూ ఏకం కావాలనీ పచ్చడి మెతుకులా దేవతా వస్త్రాలే వారికి పరమార్థం కాకూడదనీ అభిప్రాయ పడ్డారు.

ఇపుడు సమీక్ష కోసం వున్నది కథలు, నవలలు కాకుండా ఇతర సాహితీ రూపాలు, ముఖ్యంగా వ్యాసాలు. శ్రీ శ్రీ గారన్నట్టుగా చలసాని ప్రసాద్‌గారు ఈ పుస్తకానికి ముందు మాటలో యిలా రాశారు:

"ఒక రచయితలో వున్న సుగుణాలను, దుర్గుణాలను బయట పెట్టగలిగింది సాహిత్య వ్యాస మొక్కటే అనుకొంటాను. అతనిలోని అన్ని గుణాలు ఒక్కుమ్మడిగా వ్యాస రచనల్లో పెల్లుబుకుతాయి."

ఎంత పెద్ద కొండయినా దూరం నుంచి చూస్తే పచ్చగానూ, సున్నగానూ అందంగానూ కనిపిస్తుంది. కానీ దాన్ని ఎక్కటం మొదలు పెడితే అడ్డదిడ్డంగా పడ్డ రాళ్ళు, అనుకోకుండా మనల్ని ప్రమాదంలో పడేసే గోతులు వుంటాయి.

శ్రీ శ్రీ గారు చెప్పినట్లు 'రావి శాస్త్రీయం' వ్యాసాలు శాస్త్రిగారి ఆలోచనా విధానాన్ని అర్థం చేసుకోటానికి మార్గదర్శకాలుగా వున్నాయి. 1970 లో విరసంలో చేరడం ద్వారా మార్క్సిజాన్ని 'శాస్త్రంగానూ, శస్త్రంగానూ' గ్రహించిన విషయాన్ని దృష్టిలో వుంచుకొని పరిశీలన చేయటం కూడా తప్పనిసరి.

సాహిత్య విమర్శల గురించి 1981 లో విశాఖ రేడియో యింటర్వ్యూలో శాస్త్రిగారు యిలా చెప్పారు. "విమర్శలు నేనేవీ చదవ లేదు. నాకు విమర్శల గురించి స్పష్టమైన అభిప్రాయాలేం లేవు. ఏదో కథ రాస్తాం. అది బాగుంటే బాగుంటుంది. జనం ఒప్పుకుంటే ఒప్పుకుంటారు. ఒప్పుకోకపోతే అది నిలబడదు. పోతుంది" అని (పేజి 30లో) రాశారు.

రచయిత లోపాలను సరిదిద్దడానికి, పాఠకులకి సరైన దృక్పథం కలిగించడానికి సాహిత్య విమర్శ ఎంతైనా అవసరం. సాహిత్య ప్రక్రియలలో ఒక ముఖ్యమయినదీ, యితర ప్రక్రియలను సరైన మార్గంలో నిలబెట్టేదీ అయిన సాహిత్య విమర్శను, దాన్ని అవసరాన్ని శాస్త్రిగారు కనీసంగా గుర్తించకపోగా ఒక రచన ఎక్కువ కాలం నిలబడటం, నిలబడకపోవటమే రచన యొక్క గొప్పతనం తక్కువతనంగా భావించారు. విమర్శల కతీతమనే అభిప్రాయం ఎంతటి వారికైనా, వారి అభివృద్ధిని కుంటుపరుస్తుంది.

గాంధిని మహాత్ముడని, జాతిపిత అనీ, భారత స్వాతంత్ర్య ప్రధాత అని పాలక వర్గాలు కీర్తిస్తున్నాయి. ఆ ప్రచార ప్రభావం వల్ల సాధారణ ప్రజలు కూడా చాలా మంది అలాగనే అనుకోవటం జరుగుతోంది. జాతీయోద్యమానికి వెన్నుపోటు పొడిచి. స్వాతంత్ర్యాన్ని బ్రిటీష్ వారికి తాకట్టు పెట్టిన గాంధీని దోపిడి వర్గాల ప్రతినిధిగా విరసం వారితో సహా అనేక మంది భావిస్తున్నారు. కాని రావిశాస్త్రి గారికి విరసం ఏర్పడటానికి కొద్ది నెలల ముందు, తరువాత కూడా గాంధీ యెడల ఏ విధమైన అభిప్రాయం వుందో చూడండి.

"గాంధీ అంతటి మహానుభావుడికి బోసుబాబు మీద అంతకోపం వుండటం ఎంత తప్పు అని ఎంచినట్లయితే తక్కిన వారిలో ఎన్నెన్ని తప్పులు వుండ వచ్చునో ఆలోచించండి. కానీ గాంధీగారి జీవితంలో అది కాదు గమనించదగ్గ విషయం ధర్మాధర్మాల మధ్య జరిగే సంఘర్షణలో ఈ మనిషి ఏ పక్షం నిలబడ్డాడు అనేది ఏ మనిషిలో అయినా చూడదగ్గ ముఖ్య విషయం" (పే. 139)

"మానవలోక కల్యాణానికి మన ధన, మాన, ప్రాణాల్నీ సర్వస్వాన్ని త్యాగం చేయగల శక్తిని గూడా వారు మనలో కల్పిస్తారు. మనల్ని వారు కార్యోన్ముఖులుగా చేస్తారు. గౌతమ బుద్ధుడా, ఏసు క్రీస్తూ, గాంధీ మహాత్ముడా ఎవరైనా సరే, అలాంటి వారంతా అటువంటి శక్తి యుక్తులున్నవారే." (పే.138)

పై రెండు పేరాలు మహాకవి శ్రీశ్రీకి 1970 ఫిబ్రవరి 1న విశాఖలో పెద్ద సన్మానం జరిగిన సందర్భంగా విడుదల చేసిన సావనీర్ రాసిన "మహాకవి" అనే వ్యాసం లోనివి.

రెండవ విరసం మహా సభలకు కొద్ది ముందు ఆనాడు విరసంలో చురుకైన కార్యవర్గ సభ్యులుగా వున్న జ్వాలాముఖి, నిఖిల్, చెరబండరాజు గార్లను అరెస్టు చేసిన దానికి నిరసనగా విశాఖలో ఏర్పాటు చేసిన మీటింగు కోసం "దండోరా" అనే కరపత్రం రాశారు. అందులో ప్రస్తుత పాలకుల దృష్టిలో జ్వాలాముఖి, నిఖిల్, చెరలు ద్రోహులుగా వున్నట్టే పూర్వం బ్రిటీషు వారికి గాంధీ కూడా ద్రోహేనంటూ రాశారు.

"కీచకుడి యెడల భీమసేనుడు ద్రోహి, రావణబ్రహ్మ యెడల రామరాజు చెడ్డ ద్రోహి, కంసుడనే రాజాధిరాజు యెడల గొల్లకన్నయ్య మహాద్రోహి, బ్రిటీషు వాడి రాజ్యంలో గాంధీ అనే వాడు గొప్ప ద్రోహి. (దండోరా)

బ్రిటిషు వారికి గాంధీకి మధ్య తగాదా అంతా లాలూచీ కుస్తీ మాత్రమేనని శాస్త్రిగారు విరసంలో చేరిన తర్వాత కూడా గ్రహించ లేదు.

"బలమైన శత్రువుని చంపకుండా చాకిరీ చేయించు కోవాల"న్నది చాణక్య నీతి. ఈ నీతితోనే నందులకు అనుకూలంగా వున్న రాక్షసుడనే మంత్రిని చాణ

క్యుడు లొంగదీసి చంద్రగుప్తుడికి చాకిరీ చేసేవాడుగా మారుస్తాడు. ఈ నీతితోనే మార్షల్ టిటో రష్యావారిని పెట్టుబడిదారీ పంథావైపు తిరిగేట్టుగా ప్రయత్నించాడని 'ముద్రా రాక్షసం' అనే వ్యాసంలో 1963 లోనే 'జనశక్తి' పత్రికలో శాస్త్రిగారు రాశారు. జవహర్‌లాల్ నెహ్రూ కూడా చాణుక్యుడు లాంటి వాడేనని అభిప్రాయ పడుతూనే ఆయన చనిపోయిన సంవత్సరానికి [సంవత్సరీకం నాడే 27-5-65] 'విశాఖ' పత్రిక సంపాదకీయంలో 'అపర చాణుక్యుడు' అనే వ్యాసం రాశారు.

ఆ వ్యాసంలో నెహ్రూ కుయుక్తులనీ, వివిధ సోషలిస్టు నినాదాలతో ప్రజలను ఆయన ఏలా మోసం చేసిందీ, సామ్రాజ్యవాదులకు ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్య వాదులకు అనుకూలంగా ఆయన ఎలా వ్యవహరించినదీ కనీసంగాకూడా ప్రస్తావించకపోగా అగ్రరాజ్యాలకున్నంత సమాన గౌరవం ప్రతిష్ట ప్రపంచంలో, మనకు కూడా నెహ్రూ వల్లనే ఏర్పడ్డాయని రాశారు. శ్రీకృష్ణుడు, చాణుక్యుడు తర్వాత నెహ్రూతో సరితూగ గలవారు ఇటీవల ఎవరూ లేరని పొగిడారు. చివరగా-

"పండిత జవహర్‌లాల్ నెహ్రూ గారు నలభై కోట్ల భారతీయుల ముద్దుల హృదయాల్లో అత్తుకుపోయారు. రాబోయే తరాల్లో గుండె గుండెలో - అన్ని గుండెల్లో ఆయన బింబం అలా వుంటూనే వుంటుంది. ఆయన్ని మృత్యువు మరింత ముట్టుకో జాలదు—" అని రాశారు.

రంగూ రంగులమారి నెవురయ్యా
నీ రంగూ బై రంగమాయె నెవురయ్యా"

అని అక్షర జ్ఞానంలేని తెలంగాణా రైతు 1949—50ల్లోనే రాస్తే రావి శాస్త్రి గారు గతమంతా మరచిపోయి 1965లో నెహ్రూని పొగుడుతూ రాశారు.

అయితే నెహ్రూ తన చాణుక్య నీతిని ఉపయోగించే భారత కమ్యూనిస్టుల్లో వొక వర్గాన్ని తనకు అనుకూలంగా తనకు చాకిరీచేసే విధంగా తిప్పుకొన్నాడని 1972లో విరసం 3వ మహా సభలో చెప్పారు.

అత్యవసర పరిస్థితి 1975 జూన్ 25న విధించగానే అనేక రాజకీయ పార్టీల వారినే కాక రావి శాస్త్రిగారి లాంటి రచయితల్ని కూడా ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆయన జైల్లో ఎన్ని రోజులున్నారో తెలియదుగానీ విరసంకు రాజీనామాచేసి, ప్రభుత్వానికి వ్రాతపూర్వకంగా లొంగిపోయి జైలునుండి బయటకు వచ్చారు. అత్యవసర పరిస్థితి అనే వ్యాసం (20.7.75) జైల్లోనే రాసినట్టున్నారు. దాదాపు ప్రతి వ్యాసానికి వివరణ లిచ్చిన సంకలన కర్త ఈ వ్యాసానికి సంబంధించి అసలు వ్యాఖ్యానమే రాయలేదు.

అత్యవసర పరిస్థితి ఊహించని ఆకస్మిక పరిణామం కావటం, అనేక సంస్థలు నిషేధింపబడటం, అవన్నీ తిరిగి నిలదొక్కుకుని అత్యవసర పరిస్థితికి

వ్యతిరేకంగా ప్రజల్ని ఆందోళనకు కదిలించటానికి కొంత సమయం పట్టింది అత్యవసర పరిస్థితి విధించిన సరిగ్గా నెలకు రాసిన వ్యాసంలో—

"సామాన్యుల్ని శవాల కింద మార్చి అమాత్యులు పోలీసు మిలటరీ సహాయంతో "ప్రజాస్వామ్యం" పరిరక్షణ పేరుతో జులుం, జబర్దస్తీలే న్యాయం ధర్మం అని బుకాయించి, దబాయించి అధికారం చెలాయిస్తూవుంటే మేధావులు, ప్రజా ప్రతినిధులు, ప్రజాస్వామ్యవాద పరిరక్షకులు, కార్మికులు వారి నాయకులు అనేకానేక విద్యార్థి వీరులంతా ఏం చేస్తున్నారు? నిద్ర పోతున్నారా? లేక భయానికి తల లొంచుకొన్నారా? గుండె జబ్బులకి మందులు పుచ్చుకొంటున్నారా?" అని (126వ పేజిలో) ప్రశ్నించారు.

శాస్త్రిగారు ఎవరినైతే ప్రశ్నించారో ఆ కార్మికులు వారి నాయకులు, విద్యార్థి వీరులు ఎందరో అరెస్టు అయి, అతి తీవ్ర హింసలకు గురికావటం అనేకులు రహస్య జీవితానికి వెళ్ళి ప్రజల్ని సంఘటితపరిచే కృషిలో కష్టభరితమైన జీవితాన్ని గడుపుతూండటం, కొందరు పోలీసు కాల్పులకు గురై మరణించటం జరిగిన రోజుల్లో రావి శాస్త్రిగారు వారిని—నిద్రపోతున్నారా? తల లొంచుకున్నారా? గుండె జబ్బులకు మందులు పుచ్చుకొంటున్నారా? అని ప్రశ్నించటం జైలు నుండి బయటపడాలనే ఆదుర్దాని వ్యక్తం చేసుకోవటం తప్ప మరొకటి కాదు.

1952లో మద్రాసు రాష్ట్రం నుండి తెలుగు మాట్లాడే ప్రజలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని పోరాడిన దాని ఫలితంగా '52లో ఆంధ్రరాష్టం,' '56లో ఆంధ్ర ప్రదేశ్' ఏర్పడ్డాయి. తెలుగు ప్రజలు ఒక రాష్ట్ర ప్రభుత్వం క్రిందకు రావటం జరిగింది. అది ఏ మేరకైనా తెలుగు భాష అభివృద్ధికి తోడ్పడింది. ఆ వుద్యమానికి ప్రజాతంత్ర స్వభావం వుంది. భాషా రాష్ట్రాల ఏర్పాటుకు కూడా దోహద పడింది.

కానీ ప్రత్యేక తెలంగాణా ఉద్యమం (1969), ప్రత్యేకాంధ్రా ఉద్యమం (1972—73) పాలక వర్గాల ముఠా తగవుల ఫలితంగా వచ్చినవి మాత్రమే. వీటికి ప్రజాతంత్ర స్వభావం ఏ మాత్రం లేదు. 1952 నాటి ఉద్యమంతో ప్రత్యేక తెలంగాణా ఉద్యమాన్ని శాస్త్రిగారు సమానం చేసి చూడటం (పేజీ 105) సరైంది కాదు. శాస్త్రిగారు, విరసం కూడా ప్రత్యేక తెలంగాణా ఆంధ్రా ఉద్యమాలను బలపరిచారు. ఇది అవకాశవాదం మాత్రమే.

పోలీసులు ఏనాడూ ప్రజల పక్షం వుండరనీ, కనీసం ఒక్కరు కూడా ఎన్ని డబ్బులిచ్చినా కూడా నక్సలైట్లకు కొంచెం కూడా సహాయం చేయరని ఖండితంగా చెప్పేరు శాస్త్రిగారు. ఇది కేవలం తొందరపాటు నిర్ణయమని, పోలీసుల్ని కూడా పాలక వర్గాలకు ఎదురు తిరిగేవారిగా ఉద్యమింప జేయవచ్చుననీ, ప్రజాతంత్ర వుద్య

మాలకు సానుభూతి చూపి వాటికి సహాయపడేవారు కూడా వారిలో ఉన్నారని జరుగుతున్న ఘటనలు రుజువు చేస్తున్నాయి.

1960లో అఖిల భారత తెలుగు రచయితల మొదటి మహా సభలు హైదరాబాదులో జరిగాయి. అందులో శాస్త్రిగారు 'కథానిక' మీద ప్రసంగ వ్యాసం చదివారు. తెలుగు కథ - జీవితం అనే అంశం గురించి రాస్తూ....

"ఈ రోజు కూడా తెలుగు ప్రజల జీవితం గురించి తెలుసుకోవాలన్నా, వారి దారిద్ర్యాన్ని, దుఃఖాన్నీ, వారి సంపదనీ, సుఖాన్నీ చూడాలన్నా, తెలుగు ప్రజలలోకి వెళ్ళి చూడవలసిందేగాని తెలుగు కథలు చదివితే మటుకు ఛోగట్టా తెలియదు" అని చాలా కరెక్టుగా చెప్పిన వెంటనే అదే వ్యాసంలో అనాటి కథా రచయితలు 37 మందిని, రచయిత్రులు 14 మందిని పేర్కొని "వారు తీసుకొనే ఇతివృత్తాలు జీవితానికి సంబంధించినవిగా వుంటున్నాయి. [పే. 26] అని రాశారు. 1955లో "విశాఖ" పత్రిక సంపాదకీయంలో "రచయితలందరూ దేశం మంచికో, ఫలానా సంఘం మంచికో లేక మొత్తం మానవకోటి మంచికో దేనికైనా మంచి గురించి రాస్తారు. కానీ మరో ఉద్దేశంతో రాయరనే మనం నమ్మవచ్చు" (పేజి 11) అని రాశారు. ఇవి పరస్పర విరుద్ధంగా ఉన్నాయని వేరే చెప్పనక్కర్లేదు.

వ్యక్తిగతంగా మంచివారు తప్పకుండా మంచి కథలు రాస్తారని చెప్పలేనట్టే మంచి కథలు రాసే వారందరూ కూడా మంచివారై తీరతారని కూడా చెప్పలేము.

కాళీపట్నం రామారావు గారు మంచి కథకులనటం సరైనదే. వారు వ్యక్తిగతంగా మంచివారై వుండటం కూడా నిజమే కావచ్చు. వారికి రావి శాస్త్రిగారికీ చిరపరిచితమో, సన్నిహితత్వమో కూడా వుండవచ్చు. కానీ—

"ఈ పాడు లోకంలో ఎక్కడో అక్కడ ఈ పాటైనా వర్షాలు కురుస్తున్నాయన్నా, కాల్వలు పారుతున్నాయన్నా, కొంతమందైనా పేదలు కొనఊపిరితోనైనా బతగ్గలుతున్నారన్నా శ్రీ కాళీపట్నం రామారావుగారిలాంటి సజ్జనులుండబట్టేనని నేను నమ్ముతున్నాను."

ఈ మాటలు 'యజ్ఞం' కథల ముందు మాటగా రాసినవి. ముందు మాటలో కథల గురించి ఏమీ రాయనే లేదు. రచయితను అతిగా పొగడటం రచనకు పరిచయం చేయడమెలా అవుతుంది?

ఇతరుల పుస్తకాలకు ఆయన రాసిన ముందు మాటలు, పరిచయాలలో రెండు మూడు పుస్తకాలు తప్ప వారు పొగిడినంత గొప్పతనం వాటిలో వుందా అనేది అనుమానమే.

శాస్త్రిగారు నిజాయితీగానే రాసుకొన్నప్పటికీ ఆయనకున్న కొన్ని రకాల

ఆలోచనల్ని పాఠకులర్థం చేసుకొనే విషయాలు కూడా ఈ పుస్తకంలో వున్నాయి.

"క్షేత్రయ్య పదాలకంటే త్యాగయ్య కీర్తనలంటే ఎక్కువ యిష్టం" (131)

"ఇప్పటికీ దేముడున్నాడనే నమ్మకం నాకు పూర్తిగా పోలేదేమో" (73)

"అప్పటికీ, ఇప్పటికి నాకు కుష్టు రోగాన్నిచూస్తే ఎంత భయమో, దారిద్ర్యం అంటే అంత భయం" (59)

"సంఘంలో అనాథ జీవుల్ని ఉద్ధరించటం చాలా ఉత్తమమైన పని అంటూ నేనెన్ని 'మధ్య తరగతి' కబుర్లు చెప్పినా నా మట్టుకు నకు కాలు కదపకుండా, కందకుండా హాయిగా జీవితం వెళ్ళిపోతే బాగుండుననిపిస్తుంది." (81)

"పడకకుర్చీలకీ, విస్కీ-బుడ్లకీ, మంచి భోజనాలకీ, రోజుకో రంగు బట్టకీ, మోజుపడే నాయకులు నాలాగే న్యాయాన్ని, ధర్మాన్ని, విప్లవాన్ని వాలు కుర్చీలో కూర్చోపెమంటారు. (82)

అభ్యుదయ రచయితల సంఘం విప్లవ చేవను కోల్పోయి మృతప్రాయమైన తర్వాత విరసం ఏర్పాటు దాకా ప్రజాసాహిత్యోద్యమం సంఘటిత కృషిగాకాక వ్యక్తులుగా సాగించిన కృషిగానే వుండిన రోజుల్లో [1952-70] రావి శాస్త్రిగారు మంచి రచనలు చేయటమేకాక అనేకమందీ రచయితలను ప్రభావితం చేశారు. విరసం ఆవిర్భావానికి దోహదం చేసిన అంశాలలో రావి శాస్త్రిగారి రచనలు కూడా ఒకటని చెప్పటం అవాస్తవం కాదు.

"ఎందుకు రాసేను" అనే వ్యాసంలో "సెక్సు కథలు చిన్నప్పుడే చదివి జీవితం కొంతవరకైనా పాడుచేసుకొన్న వారెవరైనా వున్నారో లేదో కాని నేను మాత్రం వున్నాను ..."మను చరిత్ర" నుండి "మైదానం" వరకూ ఏ పుస్తకమైనా సెక్సుకోసం తప్ప మరొకందు కోసం నేను చదవలేక పోయాను.

"గొప్ప రచయితలని చాలామందీ ఒప్పుకునే రచయితలు కొంతమందీ వున్నారనేదీ నిర్వివాదాంశమైన విషయం. ఆ ప్రతిభగల రచయితల రచనలు కొన్ని నన్ను చెడ్డ వైపుకి తిప్పేయనీ, కొన్ని నాకు మంచిని చూపించేయనీ నాకు తెలుసు. అందుచేత కవిత్వానికి ఎటో అటు మళ్ళించే శక్తిగలదని నేను నమ్ముతాను."

అద్భుతమైన రచనా ప్రతిభగల రావి శాస్త్రిగారు పైన తన మాటలనే తిరిగి మననం చేసుకొని తన ఈనాటి రచనలు పాఠకులను చెడ్డకు తిప్పకుండా చూసుకోవటం ఎంతయినా అవసరం. ●

("ప్రజా సాహితి" అక్టోబరు 82 సంచిక నుంచి పునర్ముద్రితం)

# పిల్లల ప్రపంచం




★ రావిశాస్త్రి ★

పిల్లలూ—

మీ అందరూ పత్రికల్లో చదివే ఉంటారు- 'రాచకొండ విశ్వనాథ శాస్త్రి' అనే ఓ గొప్ప రచయిత చనిపోయారని. ఆయన్నే 'రా.వి. శాస్త్రి' అని పిలుస్తారు. ఆయన కథలూ, నవలలూ, వ్యాసాలూ ఇంకా చాలా చాలా రాశారు. మీ కోసం ఇంకా మీ తర్వాత తరం వారి కోసం కూడా ఆయన లాంటి పెద్దలు రాసిన రచనలు గ్రంథాలయాల్లో ఉంటాయి. ఇంకా చాలా మంది అలాంటి పుస్తకాలను కొని తమ పిల్లలకు కానుకగా అందిస్తుంటారు.

మీలానే ఆయన కూడా ఒకనాటి పిల్లవాడు. ఆయన ఇంత గొప్ప రచయిత కావటానికి ముందు తను ఏం చేసిందీ చెప్పారు. అందులో నుండి కొంత భాగం తీసి ఈ నెల అందిస్తున్నాం.

అంతే కాదు ఆయనకు 'వెన్నెల' అంటే చాలా ఇష్టం. ఆ వెన్నెమీద చాలా మంచి కథ రాసేరు. అది మీరు చదవాలి. పెద్దయ్యాక మళ్ళీ చదవండి. మీ నుండి కూడా అలాంటి గొప్ప రచయితలూ, రచయిత్రులూ ఆవిర్భవించాలనేదే మా ఆరాటం.

'పిల్లల ప్రపంచం' తరవున 'రా.వి. శాస్త్రి' గారి మరణం పట్ల తీవ్రమైన సంతాపం ప్రకటిస్తూ, ఆ గొప్ప రచయితకు మనందరి నివాళులర్పిస్తున్నాం.

మీ

మామయ్య

## నా చిన్నప్పుడు

చిన్నప్పుడు రామాయణం, భారతం కథలు వినడం వల్ల చిన్నప్పుడే కథలంటే నాకు సరదా కలిగింది. ఆ తరువాత అపరాధ పరిశోధక నవల్లు చదివేక ఆ సరదా హెచ్చయింది. నాక్కూడా ఓ డిటెక్టివ్ నవల రాయాలని సరదా వేసింది. మా అన్నయ్యకీ, తమ్ముళ్ళకి కూడా నా లాగా కథలంటే చాలా సరదా ఉండేది. అయితే వాళ్ళు నా లాగా కథ వ్రాయడానికి ఎందుకు ప్రయత్నం చెయ్యలేదో నేను చెప్పలేను. మా అన్నయ్య

బొమ్మలు బాగా వేసేవాడు. మా తమ్ముడు పద్యాలు చెప్పటానికి సరదా పడేవాడు. నేను నా తొమ్మిది లేక పదో యేట ఒక డిటెక్టివ్ నవల రాయటానికి ప్రయత్నం చేసి పది పదిహేను పేజీలు రాసేను. పెద్ద వాళ్ళలాగా మనవూ రాసేద్దాం అనే సరదాతోనూ, మా ఇంట్లో వాళ్ళ దగ్గర గొప్ప కోసవూ ఆ ప్రయత్నం చేసేనని ఇపుడు అనుకుంటున్నాను.

పెద్దలు చెప్పిన కథలు విని చదివి నాకు కథల్లో ఆసక్తి కలిగింది. పెద్ద వాళ్ళని ఇమిటేట్ చెద్దామనే ఉత్సాహము అప్పట్లో నాకు చాలా ఉండేదని ఇప్పుడు నాకు బాగా స్పష్టంగా తెలుస్తోంది. అది అప్పుడు నాకు చాలా గొప్పగా తోచింది. ఆ కథ రాయడం నేను మా ఇంట్లో వారంతా చదవాలనే సరదాతో రాసేను. "నా కథ ఎవరూ చదవడానికి వీల్లేదు. నేను ఇదెవరికీ ఇవ్వను" అని నే రాసిన కాయితాలు ఎంత గట్టిగా పట్టుకు తిరిగినా, ఆ కాయితాలు మా ఇంట్లో వాళ్ళు బలవంతంగా లాక్కుని చదివితే బావుండునని అనిపించడం నాకు ఇప్పటికీ బాగా గుర్తుంది. వాళ్ళు చివరికి బలవంతంగా ఆ కాయితాలు లాక్కుని నేను రాసింది చదివి పక పక మని నవ్వినప్పటికీ నేను ఆ పాటైనా రాయ గలగడం చూసి వాళ్ళంతా ఆశ్చర్యపడ్డారని గమనించి నేను గర్వించడం నాకు చాలా బాగా గుర్తుంది. పెద్దలు నడిచినట్టు మనవూ నడవగలం అనే గొప్పతనం చాడ్డంకోసం ఆ కథ రాసేనని నేనిప్పుడు నమ్ముతున్నాను.

—రా.వి. శాస్త్రి

---

("సంపాదకీయం" 6వ పేజీ తరువాయి)

ద్వేషించాడు, లేనివాళ్ళను ప్రేమించాడు. అడవిని ప్రేమించాడు, వెన్నెలను ప్రేమించాడు, అల్ప జీవులందర్నీ ప్రేమించాడు. ధనస్వామ్య వ్యవస్థను ద్వేషించాడు. సమ సమాజాన్ని ప్రేమించాడు. అయన 'మానవుణ్ని' ప్రేమించాడు, వాళ్ళ ఆకాంక్షల్ని, పోరాటాన్ని ప్రేమించాడు. అందుకే రావిశాస్త్రిని, ఆయన కథల్ని తెలుగు ప్రజలందరూ ప్రేమించారు. వాటిని ప్రేమతో వార సత్వంగా స్వీకరిస్తారు. రావిశాస్త్రి ద్వేషించిన వారిని మనం ద్వేషించి, ఆయన ప్రేమించిన వారిని మనం ప్రేమించి, ఆయన తిరస్కరించిన వాటిని మనం తిరస్కరించి, నిక్కచ్చిగా, నిటారుగా ప్రజల పక్షన నిలబడి రచనలు చేయడమే నేటి ప్రజాతంత్ర సాహిత్యోద్యమ కర్తవ్యం. మరణించి జీవించిన, మన స్మృతుల నెన్నడూ వీడిపోని తెలుగువాడి మహోన్నత రావి శిఖరానికి "జనసాహితి", "ప్రజా సాహితి" విప్లవ సాహితీ నివాళులర్పిస్తున్నది:ఆయన కుటుంబ సభ్యులకు ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నవి.

రాచకొండ అమరుడు.

# చైతన్యవాహిని

## శిక్షణా శిబిరాలు-ప్రదర్శనలు :

★ నెల్లూరు జిల్లా, గుంపర్లపాడులో అక్టోబర్ 13 నుండి 19 వరకు 7 రోజులు పాటు 28 మంది కళాకారులతో జిల్లా స్థాయి శిక్షణా శిబిరం జరిగింది. 18 పాటలు పాడటం, కొన్ని పాటలకు అభినయం, చీపు లిక్కర్‌కు వ్యతిరేకంగా మరో కొత్త వీధి నాటకం "చీపు లిక్కరు" రూపొందించి నేర్చుకున్నారు. 8 మందితో కూడిన బాలల దళం కూడా తయారైంది. "డంకెల్ బెల్స్" వీధి నాటిక రెండు దళాలు తయారవ్వగా అందులో ఒకటి పురుష పాత్రలు ధరించే మహిళల దళం.

★ గుంటూరు జిల్లా, పిన్నెల్లిలో నవంబర్ 29, 30న పాటల శిక్షణా శిబిరం-

★ నల్గొండ జిల్లా, నకిరేకల్లు ఏరియాలో డిసెంబర్ 2, 3, 4 తేదీలలో డంకెల్ వ్యతిరేక, మతోన్మాద వ్యతిరేక పాటల, వీధి నాటిక శిక్షణా శిబిరం జరిగాయి.

పై శిబిరాలకు శిక్షకులుగా ఉదయ్, బాబూరావులు హాజరయ్యారు.

## అరుణోదయ కళాకారుల అరెస్టులు :

★ నల్గొండ జిల్లా అరుణోదయ కళాకారులు 'చిల్పగుంట' అనే గ్రామంలో డంకెల్ వ్యతిరేక ప్రచారంలో భాగంగా వీధి నాటిక ప్రదర్శించ బోతుండగా హఠాత్తుగా ప్రత్యక్షమైన మఫ్టీ పోలీసులు అరెస్టు చేసి అక్రమ కేసుల్లో ఇరికించ ప్రయత్నించారు.

★ శ్రీకాకుళం జిల్లా, కాశీ బుగ్గలో- ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా జరిగిన బంద్ సందర్భంగా జరిగిన విధ్వంసాల సాకుతో అరుణోదయ రాష్ట్ర ఉపాధ్యక్షులు కా॥ రాజారావు తదితరులను పోలీసులు అరెస్టు చేసి, ఆ తర్వాత విడుదల చేశారు.

★ హైదరాబాద్‌లో సిల్క్‌స్మిత అశ్లీల నృత్య ప్రదర్శనలకు వ్యతిరేకంగా 28-11-93న రాస్తారోకో చేసిన వారితో పాల్గొన్న అరుణోదయ కళాకారులు చైతన్య తదితరులను పోలీసులు అరెస్టు చేశారు.

## అఖిల భారత విప్లవ సాంస్కృతిక సంఘాల సమాఖ్య AILRC 10వ మహా సభల్లో జనసాహితి, అరుణోదయ :

★ అక్టోబర్ 9, 10 తేదీలలో హైదరాబాద్‌లో జరిగిన AILRC 10వ మహా సభలు విజయవంతం కావాలని, నేటి మతోన్మాద ఫాసిస్టు వాతావరణంలో మరింత

ఐక్య కృషితో సాంస్కృతికోద్యమం నిర్మాణం కావాలని జనసాహితి రాష్ట్ర సంయుక్త కార్యదర్శి కా॥ సురేష్, అరుణోదయ రాష్ట్ర అధ్యక్షులు కా॥ దివికుమార్ సందేశాలు ఇచ్చారు. కా॥ రామారావు "అమర కళావేత్తలారా-అందుకోండి జోహార్లు" కా॥ చైతన్య అనూరాధలు "విరసం అమర వీరులకు- విప్లవ జోహార్లు" పాటలు ప్రారంభ సమావేశంలో పాడారు. ఆరోజు రాత్రి అనేక రాష్ట్రాల సాంస్కృతిక కార్యక్రమాల మధ్య అరుణోదయ కళాకారులు "రామజన్మ భూమి కాదురో" నాటకాన్ని ప్రదర్శించారు. ఊరేగింపు ముందు ఏర్పాటు చేసిన వాహనంపై గద్దర్, వంగపండు తదితర కళాకారులతో పాటు అరుణోదయ రామారావు, చైతన్య, అనూరాధలు కూడా విప్లవ గేయాలు ఆలపించారు.

**అరుణోదయ శ్రీకాకుళం జిల్లా :**

★ శ్రీకాకుళం జిల్లాలోని అరుణోదయ కళాకారులు, ఎపిటియఫ్ టీచర్లు కలసి వివిధ సాంస్కృతిక అంశాలపై క్లాసులు నిర్వహించారు. డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా రాష్ట్ర ఉపాధ్యక్షులు కా॥ రాజారావు కవిత, పాటలు, నృత్య రూపకాన్ని రూపొందించారు. ఒక ప్రదర్శన ఇచ్చారు.

**అరుణోదయ కృష్ణాజిల్లా :**

★ నవంబర్ 16న పెద కరగ్రహారంలోను, 17న సాలెంపాలెం లోను, 20న కోడూరులోను జరిగిన డంకెల్ ప్రతిపాదనల వ్యతిరేక బహిరంగ సభల్లో కృష్ణా జిల్లా కళాకారులు, విజయవాడ బృందం పాల్గొని అనేక పాటలను, ఉపన్యాసాలను ఇచ్చారు. "అప్పుల భారతం" వీధి భాగోవత యక్షగానం ప్రదర్శించారు.

★ నవంబరు 22న చల్లపల్లిలో జరిగిన దేశభక్త రైతాంగ సంఘర్షణ సమితి కృష్ణాజిల్లా సదస్సులో కూడా పాల్గొన్నారు. బహిరంగ సభలో విజయవాడ దళం వారు "అప్పుల భారతం", వీధి భాగవతం ప్రదర్శించారు.

★ నవంబర్ 18న నందిగామలో జరిగిన బహిరంగ సభలో రాష్ట్ర అధ్యక్షులు దివికుమార్ ఉపన్యసించారు. పల్లగిరి గ్రామంలో దళిత యువకుడికి అగ్రకుల అహంకారులు సజీవ దహనం చేయబోయిన దుస్సంఘటనకు వ్యతిరేకంగా జరిగిన ఆనాటి సభలో నరమేధం (దళిత పోరాట వీధి నాటిక) లోని ఒక భాగాన్ని "నేరమూ-శిక్ష" వీధి నాటికగా విజయవాడ దళం ప్రదర్శించింది.

★ నవంబర్ 19న తెనాలిలో జరిగిన ఒక హేతువాద వివాహ వేదికపై "హత్య బాబోయ్" నాటకాన్ని ప్రదర్శించారు.

**అరుణోదయ నెల్లూరు జిల్లా :**

★ OPDR నాయకులు శ్రీ K.V.S.N. ప్రసాదరావు వర్థంతి సందర్భంగా 9-10-93 తేదీన "డంకెల్ ప్రతిపాదనలు- ప్రజాస్వామ్య హక్కులు" అనే అంశంపై జరిగిన రాష్ట్ర సదస్సులో నెల్లూరు జిల్లా కళాకారులు పాటలు పాడారు.

**అరుణోదయ కర్నూలు జిల్లా :**

★ రాయలసీమ భూస్వామ్య సాయుధ గూండాలకు, ముఠాలకు వ్యతిరేకంగా సాగుతున్న ఉద్యమానికి సంఘీభావంగా కర్నూల్ జిల్లా కళాకారులు "నంద్యాల నుండి పాణ్యం" వీధి నాటకాన్ని బలపనూరు తదితర గ్రామాల్లో నాలుగు ప్రదర్శనలు ఇచ్చారు.

**చీపు లిక్కర్ వ్యతిరేక బహిరంగ సభలో అరుణోదయ రామారావు, గద్దర్, వంగపండుల కళా ప్రదర్శనలు :**

★ అక్టోబర్ 20న కర్నూల్ పట్టణంలో జరిగిన చీపు లిక్కర్ వ్యతిరేక బహిరంగ సభలో జిల్లా అరుణోదయ కళాకారులు, ప్రధాన కార్యదర్శి రామారావు, జననాట్యమండలి నాయకులు గద్దర్, వంగపండులు అనేక పాటలు, నృత్యాలు ప్రదర్శించారు.

**అరుణోదయ నల్గొండ జిల్లా :**

★ అరుణోదయ కళాకారులు సమిష్టిగా డంకెల్‌కు వ్యతిరేకంగా మరో కొత్త వీధి నాటిక "డంకెల్‌పై దండయాత్ర" రూపొందించారు. స్త్రీలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా, చీప్ లిక్కరుకి వ్యతిరేకంగా, డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా నెలరోజుల పాటు సాగిన ప్రచార క్యాంపెయిన్‌లో అనేక పాటలుతో పాటు "డంకెల్‌పై దండయాత్ర" వీధి నాటకం వివిధ చోట్ల ప్రదర్శనలు ఇచ్చారు.

---

## ప్ర క ట న

అక్టోబరు 93 'ప్రజాసాహితి' సంచికలో ప్రకటించినట్లుగా నవంబరు 20, 21 తేదీలలో జనసాహితి, అరుణోదయ నిర్వహించ దలచిన "సామ్రాజ్యవాద వ్యతిరేక సాంస్కృతిక సదస్సు" వాయిదా పడింది.

ఇది 1994 ఫిబ్రవరి చివర్లో "సామ్రాజ్యవాద సాంస్కృతిక దాడికి వ్యతిరేకంగా అఖిల భారత సదస్సు"గా నిర్వహించబడుతుంది.

వివరాలు వచ్చే సంచికల్లో చూడండి.

— జనసాహితి, అరుణోదయ

---

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editer : NIRMALANANDA